# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 9 సంచిక : 5 హైదరాబాద్ 118 మే 2011 పేజీలు : 68 రు. 15

* ఫోకస్ : అభివృద్ధి పథకాల విధ్వంసం
* అవినీతి నిర్మూలన ఆకాంక్షలు
* బాధిత ఆదివాసులను కలవడమే నేరమా?
* శ్రీకృష్ణ కమిటీ ఎనిమిదో అధ్యాయం
* అప్రజాస్వామిక ఉత్తర్వు జి.ఒ. 177
* జపాన్ అణు విద్యుత్ ప్రమాదాల పాఠాలు
* ఎవరి కోసం ఈ ఎన్నికలు?

# వీక్షణం విస్తరించడానికి సహకరించండి!
# మీ మిత్రులందరికీ పరిచయం చేయండి!!
# మీ వంతుగా చందాలు చేర్పించండి!!

వీక్షణం రాజకీయార్థిక, సామాజిక మాసపత్రికకు ఎనిమిది సంవత్సరాలుగా మీరు అందిస్తున్న ఆదరాభిమానాలకు కృతజ్ఞతలు. మీ నిత్యజీవితంలో, కుటుంబ సభ్యులతో, పని స్థలంలో, స్నేహితులతో, భిన్నాభిప్రాయాలున్న వారితో మాట్లాడుతున్న ప్రతి సందర్భంలోనూ వీక్షణంలోని వ్యాసాలు, అభిప్రాయాలు మీకు ఉపయోగపడతూనే ఉన్నాయి. ఈ పత్రిక నిలదొక్కుకుని పది కాలాలపాటు నిలబడాలని మీరు కోరుకుంటున్నారని మాకు తెలుసు. తెలుగు సమాజానికి అవసరమయిన విభిన్న ఆలోచనలను అందించే పత్రికగా వీక్షణం ఇంకా విస్తరించాలని కూడా మీరు కోరుకుంటూ ఉంటారు. కాని, వీక్షణం ఆర్థిక పరిస్థితి సుస్థిరంగా లేదు. వీక్షణంను నిలబెట్టడానికి మీరు తక్షణమే పూనుకుని చేయవలసిన పనులు కొన్ని ఉన్నాయి.

- మీ బంధుమిత్రుల దగ్గర, మీ పనిస్థలంలో, మీరు మాట్లాడే ప్రతిచోటా, సామాజిక రాజకీయ విషయాల చర్చ వచ్చిన ప్రతిచోట ఆ విషయాల మీద వీక్షణం అవగాహన కలిగిస్తుందని ప్రస్తావించండి. వీక్షణం చదవడం ఎంత అవసరమో చెప్పండి.
- మీ చందా చెల్లించడంతోపాటు, మీ మిత్రుల కొరకు కానుకగా చందా చెల్లించండి. వారిని చందా చెల్లించమని కోరండి.
- మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న గ్రంథాలయానికి వీక్షణం వస్తుందో లేదో కనుక్కుని తెప్పించడానికి ప్రయత్నాలు చేయండి.
- మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న విద్యాలయాలలో, కళాశాలలో, ముఖ్యమైన ప్రభుత్వ, ప్రభుత్వేతర కార్యాలయాలలో, స్వచ్ఛంద సంస్థల, యువజన సంస్థల కార్యాలయాలలో వీక్షణం వస్తుందో లేదో కనుక్కుని వారిచేత చందాలు కట్టించండి.
- మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న వీక్షణం శ్రేయోభిలాషులు, విద్యా సంస్థల నిర్వాహకులు, వ్యాపారవేత్తల దగ్గర వీక్షణంకు ప్రకటనలు సేకరించండి.
- మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న పత్రికల ఏజెంటు వీక్షణం తెప్పిస్తున్నారో లేదో కనుక్కుని తెప్పించేలా చూడండి.

## చందా వివరాలు

| | సంస్థలకు/లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | - |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | - |

వీక్షణం అకౌంట్ నెంబర్ - 013911011002175, ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా


**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్

హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

ఇమెయిల్ : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

KLVA10SM105

118

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

మే 2011
సంపుటి : 9
సంచిక : 5



## లోపలి పేజీల్లో...

ఫోకస్ : అభివృద్ధి పథకాలు - అభివృద్ధా? విధ్వంసమా?



'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

ప్రింటర్స్
డక్కన్ ప్రెస్ / చరితా ఇంప్రెషన్స్
అజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
ఆనంద్ ఏజన్సీస్
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం
మైత్రీ రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

వీక్షణం చందా వివరాలు

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | - |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | - |

వీక్షణం అకౌంట్ నెంబర్ - 013911011002175
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్

3

వీక్షణం మాస పత్రిక బాగా వస్తున్నది. ప్రసాద్ వ్యాసాలు బాగున్నాయి. పోరాట వాస్తవికతను ప్రతిఫలిస్తున్నాయి. తెలంగాణపై కృష్ణ ఆదిత్య వ్యాసం ఆలోచింపజేసే విధంగా ఉంది. ఇంకా ఈ ప్రపంచీకరణ నేపథ్యంలో తెలంగాణలో ప్రాంతీయ, ప్రాంతీయేతర, బహుళజాతి పెట్టుబడులు – దోపిడీలు, ఎలా ఉన్నాయో తెలియజేసే వ్యాసాలు వస్తే బాగుంటుంది. ముఖ్యంగా అరబ్ దేశాల లాంటి పరిస్థితులే ఉన్న భారతదేశంలో అలాటి ప్రజా సంచలనాలు ఎందుకు రావడం లేదని ఒక వ్యాసంలో రాశారు. ఈ ప్రశ్నకు సమాధానం రూపంలో కూడా చర్చా వ్యాసాలు వస్తే ప్రజలకు, మేధావులకు ఉపయోగకరంగా ఉంటుంది. మొత్తం మీద వీక్షణం లాంటి ఆలోచింపజేసే పత్రిక మరింత ప్రజల్లోకి వెళ్లాల్సిన అవసరం ఉంది.

– కె. సుభాష్
మహబూబ్‌నగర్

సామాన్యుడిని సైతం సమాజం గురించి ఆలోచింపజేసేలా వ్యాసాలను రాస్తూ, ప్రస్తుత సమాజంలోని రాజకీయ, ఆర్థిక, సామాజిక విషయాలపై అవగాహన కల్పిస్తున్నటువంటి వీక్షణంకు అభినందనలు. ఏప్రిల్ 2011 సంచికలో కె. విజయ్ కుమార్ రాసిన 'సూక్ష్మ రుణ వడ్డీ వ్యాపారం – ప్రజాస్వామ్య విద్రోహం' అనే వ్యాసం చాలా బాగుంది. ప్రాచీన కాలం నుండి ధనికులు పేదవారి అవసరాలను ఆసరాగా చేసుకొని, వారికి వడ్డీకి అప్పులు ఇచ్చి, ఆ అప్పు మీద వడ్డీ, చక్ర వడ్డీ వసూలు చేసి, నిరక్షరాస్యులయిన వారి ఆస్తులను గుంజుకున్నారనీ, అలాగే ప్రస్తుతం ప్రజలకు మేలు చేస్తాం, సహకారాన్ని అందిస్తాం అని చెప్పుకుని ప్రజల్లోకి వచ్చి, వారికి వడ్డీలకు అప్పులిచ్చే సూక్ష్మ రుణ సంస్థలు అంతకు తక్కువేమీ కాదనీ, పేద ప్రజలకు ఆశచూపి, వారి నుండి అధిక వడ్డీలు వసూలు చేసి, ప్రజలను పట్టి పీడిస్తున్నాయని తెలియజేశారు. వీటన్నిటికీ ప్రభుత్వ వైఫల్యాలు ప్రధాన కారణమనీ ఇటువంటి సూక్ష్మ రుణ సంస్థల నుండి ప్రజలను రక్షించవలసిన అవసరం ప్రభుత్వానికి ఎంతయినా ఉందనీ తెలియజేస్తూ, ఇటువంటి విషయాలను గురించి సామాన్యున్ని కూడా ఆలోచింపజేసేలా వ్యాసాన్ని రాసిన కె. విజయ్‌కుమార్‌కి ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

– పులుగుజ్జు గురువర్మ
చిన్న ఓబినేనిపల్లి, ప్రకాశం

ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రంలోని దంతెవాడ జిల్లాలో ఆదివాసీలపై అమలవుతున్న రాజ్యహింసను వరవరరావు కళ్లకు కట్టినట్లు తన వ్యాసం 'మానసిక యుద్ధం – భౌతిక విధ్వంసం'లో వివరించారు. ఛత్తీస్‌ఘడ్ రాష్ట్ర జనాభా 2,55,40,196. దేశంలోనే ఎక్కువ ఖనిజ సంపద గల రాష్ట్రం. బహుళజాతి కంపెనీలతో విదేశీ సంస్థలతో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చేసిన ఒప్పందాలలో భాగంగా గిరిజనులను తరిమివేసి ఖనిజాలను తవ్వడానికి ప్రభుత్వం రంగం సిద్ధంచేసి పారా మిలిటరీ బలగాలను వేలాది మందిని దింపింది. వందల సంఖ్యలో గృహదహనాలకు పాల్పడు తున్నది. వేలమంది గిరిజనులు వలసలు పోయారు. సాల్వాజుడుం, గిరిజన కోయ కమాండోలను ఏర్పరిచి గిరిజనులను ఊచకోత కోస్తున్నారు. సుప్రీంకోర్టు సాల్వాజుడుంను రద్దు చేయాలని ఆదేశించినా ఛత్తీస్‌ఘడ్ ప్రభుత్వం పాటించలేదు. బాధిత ప్రజల కేసులు చాలా సుప్రీం కోర్టుల్లో పెండింగ్‌లో ఉన్నాయి. దేశంలోనే మొట్టమొదటగా విశాఖ జిల్లా చింతపల్లి ఏజెన్సీలో 1987 అక్టోబర్‌లో 46 గ్రామాలలో 638 ఇళ్లను పోలీసులు తగులబెట్టారు. నిజ నిర్ధారణ కమిటీలో బాలగోపాల్‌తో పాటు నేను పాల్గొన్నాను. జస్టిస్ కృష్ణయ్యర్ సూచనల మేరకు కోర్టు నిర్వహించి గిరిజనులతో సాక్ష్యాలు చెప్పించాం. నక్సల్స్ ఏరివేత పేరుతో రాజ్యహింస తీవ్రంగా అమలు జరుగుతున్నది. ఛత్తీస్‌ఘడ్ ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేయాలి. లిబియాపై వచ్చిన మూడు వ్యాసాలూ బాగున్నాయి. వీక్షణం డాక్యుమెంట్‌తో సమానం. భద్రపరుచుకోవలసి ఉంటుంది. న్యూస్ ప్రింట్ నాసిరకం వాడితే ఇబ్బంది ఉంటుంది. మీరు ఎడిటోరియల్‌లో తెలియజేసినట్లు విగ్రహాల విధ్వంసం గురించి మాత్రమే చర్చ కాదు ఆ ఘటన ఏ పరిణామాల గొలుసులో భాగమో చూడాలి.

– తుంపాల శ్రీరామమూర్తి
గాజువాక, విశాఖపట్నం

వీక్షణం మాస పత్రిక చూశారా? వాణిజ్య దృక్పథంతో కాకుండా సామాజిక దృక్పథమే ధ్యేయంగా నిజాన్ని నిర్భీతిగా, సమకాలీన రాజకీయ, సామాజిక, న్యాయ, ప్రజా సమస్యల్ని ఎప్పటికప్పుడు మన ముందుంచే పత్రిక. ఈ డిసెంబర్ 2010 సంచికలో 'చదవాల్సిన పుస్తకాలు', 'పోలవరం ప్రాజెక్టు పై పునరాలోచన', 'మానవ సమాజాల అధ్యయనం' వగైరా వ్యాసాలు సరళంగా, ఉపయోగకరంగా ఉన్నాయి.

– రాజా
*http://gksraja.blogspot.com*

వీక్షణం మార్చ్ 2011 సంచికలో పి. ప్రసాద్ రాసిన 'ప్రపంచ గమనానికి మలుపు – అరబ్బు ఉద్యమాలు' వ్యాసంలో నేడున్న ప్రపంచ పరిస్థితులలో విప్లవ పోరాటాలకున్న అవకాశాల్ని అర్థం చేసుకోవడానికి గానీ, విప్లవ పార్టీలు సంసిద్ధంగా లేకపోతే ఏ విధంగా అవకాశాన్ని జారవిడుచుకొంటారో కూడా చాలా వివరణాత్మకంగా రాశారు. ఈజిప్ట్ సోషలిస్టుల పత్రికా ప్రకటనతో వచ్చిన వ్యాసం చాలా గొప్పగా ఉంది. ప్రపంచ విప్లవ గమనానికి వారు సూచించిన మార్గాలు అంటే విప్లవకారులు జాగ్రత్తవడి, విప్లవ నాయకత్వాన్ని ప్రజల నుండి చేజార్చుకోకుండా దోపిడీ పాలకవర్గాల చేతుల్లోకి పోకుండా, వారికీ ఉద్యమం ఒక హెచ్చరికగా ఉపయోగపడుతుంది. వేణుగోపాల్ వ్యాసం మార్క్సిస్ట్ దృక్పథంతో కూడిన ఒక పరిశోధనాత్మక వ్యాసంగా ఉంది. ఇందులో వర్గ విశ్లేషణ చాలా బాగుంది. ఆయా వర్గాల పాత్ర విప్లవంలో ఏ మేరకు ఉపయోగ పడుతుందో స్పష్ట పరిచారు. 'జ్యోతిష్యం విజ్ఞాన శాస్త్రమా?' వ్యాసం కూడా చాలా బాగుంది. ప్రస్తుతం రాయవలసిన ఆవశ్యకత కూడా ఎంతో ఉంది. కానీ ఇంకొంచెం వివరణ ఇచ్చి ఉంటే, పాఠకులు ఇంకా ఎంతో తెలుసుకొని ఉండేవారని నా అభిప్రాయం. ఈ విషయం మీద మనసుపెట్టి, ఇంకొక వ్యాసాన్ని దీనికి కొనసాగింపుగా రాస్తే బాగుంటుంది. ఈ వ్యాసాలలో ఎవరి దృక్కోణాన్ని బట్టి వారు ఈ అరబ్ ప్రపంచ పోరాటాల్ని విశ్లేషించి చాలా లోతుగానే రాశారు. ఈ వ్యాసాల్ని సామాన్య ప్రజలతో చదివించే పని కూడా విప్లవ ప్రజాసంఘాల వాళ్లు చేయాల్సి ఉంటుంది. అప్పుడు జనం నిజానిజాలు తెలుసుకొంటారు. అందుకోసం 'వీక్షణం' పత్రికను ఎంతో ఎక్కువగా ప్రజలలోనికి తీసుకొని పోవాలని ఆకాంక్షిస్తున్నాను.

– కడియాల సుబ్బనాచారి
దుత్తలూరు, నెల్లూరు

వీక్షణం ఏప్రిల్ 2010 సంచికలో ఆదిత్య రాసిన 'పీడిత వర్గాల పోరాట ఐక్యత కావాలి' వ్యాసంలో ఆయనే పేర్కొన్నట్లు పీడిత వర్గాల మధ్య ఐక్యత అనేది చేరుకోవాల్సిన లక్ష్యమే. అయితే, ఇవాల్టి సందర్భంలో తెలంగాణ ప్రజల బలమైన ఆకాంక్షను గుర్తించడంలో మనం వెనుకబడి పోవద్దు. ఒక న్యాయమైన ఆకాంక్షను సమయానికి గుర్తించకపోవడం వల్ల అది ప్రజల మధ్య వైషమ్యంగా మార్చి పబ్బం గడుపుకోవాలనే పాలకులు వెన్నంటే ఉన్నారనే సంగతి మరచిపోకూడదు. అర్ధవలస, అర్ధభూస్వామ్య వ్యవస్థలోకి సామ్రాజ్యవాద పెట్టుబడి చొచ్చుకొని వస్తోంది. తీవ్ర అసమానతలు పెంచే దళారీ విధానాలతోనే పాలకులు ఈ పరిస్థితిని తీసుకువచ్చారు. వివిధ పీడిత సమూహాల మధ్య వైరుధ్యాలు పెంచి తమ పాలనను సజావుగా నడుపుకోవాలని పాలకులు చూస్తున్నారు. ఆలోచనాపరులుగా మనమంతా పీడిత ప్రజల ఐక్యతకు దోహదపడే వైపుగానే నిలబడాలి.

– ఝాన్సీ
నిజామాబాద్

**రచయితలకు సూచన :** తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 23వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. – సం.

# దేవుడి క్షేమం కోరే భక్తులు, ఆస్తుల పంపకంలో దేవుడు!

పుట్టపర్తి సత్యసాయిబాబా ప్రశాంతి నిలయంలో మార్చ్ 28న మొదలైన అతి విచిత్రమైన, హాస్యాస్పదమైన నాటకం, చిట్టచివరికి, ఎట్టకేలకు ఏప్రిల్ 24 ఉదయం ముగిసింది. ఎప్పుడో మరణించిన మనిషి మరణవార్త ఆస్తుల లెక్కలు, పంపకాలు అన్నీ పూర్తయ్యాకనే బయటపడింది. తనను తాను భగవంతుడిగా, అవతారంగా అభివర్ణించుకున్న మనిషి ఆస్పత్రిలో ఆధునిక వైద్య పరికరాల మీద ఆధారపడి అపస్మారకంలో పడి ఉండగా, లెక్కలు తేల్చుకునేవాళ్లు ఆ బతుకును పొడిగించడానికి, మరణవార్తను వాయిదా వేయడానికి ప్రయత్నించారు. ఈ కొత్తభగవంతుడిని కాపాడమని భక్తులు పాత భగవంతుడికి పూజలూ పునస్కారాలూ చేశారు గాని వారి మొర ఎవరూ ఆలకించినట్టు లేరు. వెంటిలేటర్ల మీద బతుకును పొడిగిస్తున్నామని ఆస్పత్రి నుంచి రోజుకొక వార్త వచ్చింది గాని ఆ మనిషి బతికి ఉన్నాడని చెప్పే ఒక్క ఆధారమైనా బయటికి రాలేదు. స్వతంత్ర పరిశీలకులను లోపలికి వెళ్లనివ్వలేదు. ఆ మనిషి ఎప్పుడో చనిపోయాడని, ఆస్తుల లెక్కలు తేల్చుకోవడం కోసమే చావువార్త బయటపెట్టడానికి ఆలస్యం చేస్తున్నారని వదంతులు చెలరేగాయి. ఈలోగా బంగారం బిస్కెట్లు ఆశ్రమం నుంచి తరలిపోయాయనీ వార్తలు వచ్చాయి. మనిషి చనిపోయిన తర్వాత కూడ బతికే ఉన్నాడని, చికిత్సలు చేస్తున్నామని అబద్ధాలు చెపుతూ రావలసిన డబ్బులన్నీ వచ్చాకనే చావువార్త బయటపెట్టే ఐదు నక్షత్రాల ఆస్పత్రుల ఆనవాయితీ కొత్తదేమీ కాదు. ఇప్పుడు విచిత్రమల్లా చెల్లించవలసిన బిల్లు గురించి కాదు, రోగి దగ్గర దాచిపెట్టిన డబ్బు లెక్కలు, రోగి దగ్గర పోగయిన ఆస్తి పంపకాలు తేలేదాకా చావువార్త బయటికి రానివ్వలేదు. మొత్తానికి తాను 96 ఏళ్ల దాకా బతుకుతానని కొత్త భగవంతుడు చెప్పిన జోస్యం అబద్ధమని తేలిపోయింది. ఈ ఒక్క అబద్ధం మాత్రమే కాదు, సత్యసాయిబాబా జీవితకథ, మహిమల కథ మొత్తంగానే అబద్ధాల మయం. ఆ అబద్ధాలు సత్యనారాయణ రాజు అనే ఒకానొక వ్యక్తివి మాత్రమే కాదు. ఈ వ్యవస్థ సృష్టించకతప్పని అబద్ధశక్తి అతను. ప్రజల సమస్యలను పరిష్కరించలేని పాలకవర్గాలు అభూత శక్తులను సృష్టించి, అక్కడే పరిష్కారాలు ఉన్నాయని మాయను అల్లుతాయి. ఈ లౌకిక భారతదేశంలో, శాస్త్రీయ దృక్పథాన్ని పెంపొందించే రాజ్యాంగ బాధ్యత ఉన్న ప్రభుత్వాధినేతలలో ప్రతిఒక్కరూ ఆ మాయాశక్తి పాదాల చెంత ఏదో ఒక సమయంలో సేదదీరినవారే. రాష్ట్రపతులు, అత్యున్నత న్యాయస్థానపు న్యాయమూర్తులనుంచి ప్రభుత్వ యంత్రాంగంలోని అతి చిన్న గుమస్తాల దాకా ఆయన భక్తులే. అరచేతిలో బూడిద సృష్టించడం, గాలిలోనుంచి ఉంగరాలు, గొలుసులు, శివలింగాలు సృష్టించడం వంటి గారడీ విద్యలతో ప్రారంభించి, ప్రజల అమాయకత్వమూ అజ్ఞానమూ పెట్టుబడిగా వేల కోట్ల రూపాయల సామ్రాజ్యం నిర్మించి, దాన్ని రాజ్యాంగేతర శక్తిగా మార్చడంలో ఆ వ్యక్తికి ఎంత పాత్ర ఉందో, ఈ వ్యవస్థకు, పాలకవర్గాలకు అంత పాత్ర ఉంది. సత్యసాయిబాబా పేరిట జరుగుతున్న ఈ మోసాలను వివరించడానికి గాంధేయవాది, బెంగళూరు విశ్వవిద్యాలయ వైస్ చాన్సలర్ ఎచ్ నరసింహయ్య జీవితాంతం పోరాడారు. అవే గారడీలను చేసి చూపిస్తూ, బూడిద, ఉంగరాలు, గొలుసులు, శివలింగాలు సృష్టిస్తూ శ్రీలంక హేతువాది డా. అబ్రహాం కోవూర్ దేశమంతా కాలికి బలపం కట్టుకుని తిరిగారు. సత్యసాయిబాబా చేసేది కనికట్టు కాదని నిరూపిస్తే నష్ట పరిహారం చెల్లించి, తన ప్రచార కార్యక్రమం ఆపుతానని 1970లలోనే ప్రకటించారు. ఆ సవాలుకు సాయిబాబా నుంచి గాని, భక్తుల నుంచి గాని జవాబు లేదు. తమిళ హేతువాది ప్రేమానంద సాయిబాబా అక్రమాల మీద న్యాయస్థానాలలోనూ ప్రజలలోనూ ఎన్నో పోరాటాలు చేశారు. “సాయిబాబా, సొన్నాయి బాబా” అంటూ గద్దర్ 1980ల మొదట్లో రాసిన సుప్రసిద్ధమైన పాట సాయిబాబా బండారాన్ని బయటపెట్టింది. ఈలోగా గారడీ బాబా దొంగనోట్ల వ్యాపారంలోకి కూడ దిగారని 1980లలో వార్తలు వచ్చాయి. రాజకీయ నాయకుల, అక్రమవ్యాపారుల లెక్కచూపని, పన్ను చెల్లించని సంపదను, నల్లడబ్బుగా పేరుపడిన అక్రమార్జనను తెల్లడబ్బుగా మార్చడమే సత్యసాయిబాబా పని అని ఎందరో వివరించారు. ఈ అక్రమాల ఆరోపణలు పెరుగుతున్నకొద్దీ సత్యసాయిబాబా, ఆయన భక్తులలోని పాలకవర్గశక్తులు రెండు కొత్త ఎత్తుగడలు పన్నారు. ఒకటి, అంతకంతకూ ఎక్కువగా దేశంలోని అత్యున్నత అధికార పీఠాల వ్యక్తులు, క్రీడా, సినీ, మేధోరంగ ప్రముఖులు, శాస్త్రవేత్తలు సాయిబాబా దగ్గరికి వచ్చి, ఆయన పాదాల దగ్గర కూచుని ఆయన ప్రాధాన్యతను పెంచారు. ఆయనను చట్టాతీత, సమాజాతీత శక్తిని చేశారు. రెండు, సాయిబాబా అక్రమాల మీద విమర్శలను ఎదుర్కోవడానికి ఆయన ఆశ్రమానికి సేవా కార్యక్రమాల మేలిముసుగు తొడిగారు. విద్యాలయాలు, ఆస్పత్రులు, అన్న, వస్త్ర దానాలు, దుర్భిక్ష ప్రాంతాలకు తాగునీటి సౌకర్యం కల్పించడం, ప్రకృతి ఉత్పాతాల సమయంలో అన్నార్తులను, నిరాశ్రితులను ఆదుకోవడం వంటి కార్యక్రమాలతో ఆయన మంచితనాన్ని, మానవత్వాన్ని ప్రచారం చేయడం మొదలుపెట్టారు. ఎంత మానవత చూపినా ఆస్తే నేరం, ఆస్తే దొంగతనం అన్నట్టు ఆస్తి పెరిగినకొద్దీ ఆ ఆస్తి పంపకాలలో కొట్లాటలు, నేరాలు తలెత్తాయి. స్వయంగా బాబా పడకగదిలో 1993లో హత్యాకాండ జరిగి ఆరుగురు మరణించారు. ఆ హత్యాకాండ మీద కనీస విచారణ జరగని, ఎవరి ప్రాంగణంలో హత్యలు జరిగాయో వారిమీద దర్యాప్తు కూడ జరగని చట్టబద్ధ పాలన సాగుతున్న దేశం మనది! ప్రశాంతి నిలయంలో అశాంతి కార్యకలాపాల గురించి ప్రపంచానికి చాటి చెప్పిన ఆ హత్యాకాండ కేవలం ప్రమాద సూచన మాత్రమే. నిజమైన ప్రమాదం గత నాలుగు వారాలలో బయటపడింది. సత్యసాయి ఆశ్రమ ఆస్తులు నలభై వేల కోట్ల రూపాయలా, లక్ష కోట్ల రూపాయలా, లక్షానలభై వేల కోట్ల రూపాయలా అని పత్రికలు ఊహాగానాలు చేశాయి. ఇంత సంపద ఎలా పోగుపడి ఉంటుంది, అందులో భక్తుల విరాళాలు ఎన్ని, ఇంతకాలంగా ఆశ్రమ నిర్వహణకు అయిన వ్యయం పోగా ఆశ్రమానికి ఇంత మిగిలే అవకాశం ఉందా, ఇదంతా రాజకీయ నాయకులు, అధికారగణం దాచుకున్న అక్రమసంపద కావచ్చునా అనే ప్రశ్నలు రాలేదు. అలా ప్రశ్నించడమే భగవంతుని ఎడల అపచారంగా చూసే స్థితి ఉంది. గత మూడు వారాలలో కనీసం పద్నాలుగు, పదిహేను రోజులు అన్ని పత్రికల ప్రధాన పతాక శీర్షికలు బాబా ఆరోగ్యం గురించే మాట్లాడాయి గాని, ఇతర ప్రజాసమస్యలూ పట్టలేదు, ఈ ఆస్తుల మూలాలు కనిపెడదామనీ పట్టలేదు. ప్రజా అసంతృప్తిని పక్కదారులు పట్టించడానికి పాలకవర్గాలు ఇటువంటి మూఢనమ్మకాలను వాడుకుని ఆ జనాకర్షణలో తమ అక్రమాలను దాచుకోవడం కొత్తకాదు. ఇటువంటి శక్తులకు వ్యతిరేకంగా ప్రజలలో చైతన్యాన్ని రగిలించడం, ఈ శక్తులను నమ్మకతప్పని స్థితి కల్పిస్తున్న వ్యవస్థను మార్చడం తమ పనిగా భావిస్తున్న నిజమైన ప్రజాశక్తుల ముందున్న పని ఎంత గురుతరమైనదో ఇప్పటికైనా గుర్తించాలి. ఆ రంగంలో ఇతోధిక కృషి చేయడానికి ఈ ఉదాహరణను వాడుకోవాలి. వీ

## లోక్‌పాల్ లేకనేనా అవినీతి సాగేది?!

టునీషియా, ఈజిప్ట్ పరిణామాలు జరుగుతున్నప్పుడు "ఇటువంటి ప్రజాప్రదర్శనే జంతర్ మంతర్‌లో జరిగితే, రెండు లక్షల మంది పోగైతే..." అని ఔట్‌లుక్ పత్రిక సంపాదకుడు వినోద్ మెహతా ఒక ఊహాగానం చేశారు. రెండు నెలలు తిరగకుండానే జంతర్ మంతర్‌లో ప్రదర్శన జరిగింది. అక్కడికి కొన్ని వందలమందో, వేలమందో వచ్చారేమో గాని, దేశవ్యాప్తంగా లక్షలాదిమంది అవినీతికి వ్యతిరేకంగా గొంతెత్తారు. కాని టునీషియాలో, ఈజిప్ట్ లో జరిగిన పరిణామాలతో పోలిస్తే వందో వంతు మార్పు అయినా జరగలేదు. అసలింతకీ జంతర్ మంతర్ ప్రదర్శన టునీషియా, ఈజిప్ట్ లలో ప్రజాసంచలనాలు ప్రకటించినలాంటి లక్ష్యాలతో జరగలేదు. అత్యున్నత అధికార పీఠాలలో అవినీతిని అరికట్టడానికి ఉపయోగపడే లోక్ పాల్ వ్యవస్థను సృష్టించాలని ప్రభుత్వం ప్రయత్నించినప్పుడు, ఆ బిల్లులో అవతవకలు ఉన్నాయని, అందుకు భిన్నమైన మరొక బిల్లు తయారు చేయాలని, ఆ బిల్లు తయారీలో పౌరసమాజ ప్రతినిధులకు భాగస్వామ్యం ఉండాలని అన్నా హజారే నిరాహార దీక్ష ప్రారంభించారు. దేశవ్యాప్తంగా మధ్యతరగతి ఆ దీక్షకు సంఘీభావం ప్రకటించింది. దేశ ప్రజానీకంలో రాజకీయ అవినీతి పట్ల ఉన్న వ్యతిరేకతకు ఈ సంఘీభావం ఒక వ్యక్తీకరణ. అయితే అవినీతికి కేంద్రస్థానంలో ఉన్న కార్పొరేట్ పారిశ్రామిక వ్యాపార మీడియా వర్గాలు కూడ ఈ "అవినీతి వ్యతిరేక" ఆందోళనలో ముందువరుసలో కనబడడానికి ప్రయత్నించడం ఆందోళనకరం. ఎన్ని సమస్యల మీద ఎన్ని కోట్ల మంది ఎన్ని దశాబ్దాలుగా ఆందోళనలు చేస్తున్నా పట్టించుకోని ప్రభుత్వం మూడు రోజులలోపల "దిగి వచ్చి" అన్నా హజారే కోరినట్టుగా పౌరసమాజ సభ్యులకు బిల్లు తయారీలో ప్రాతినిధ్యం ఇచ్చింది. ఆ బిల్లు ఎప్పటికి తయారవుతుందో, తయారయినా అది ఎప్పటికి చట్టమవుతుందో, చట్టమయినా అది అమలులోకి వస్తుందో రాదో, అమలులోకి వచ్చినా పెద్దచేపలను, తిమింగిలాలను పట్టుకుంటుందో లేదో తెలియకపోయినా, ఈ మాత్రం విజయానికే దేశవ్యాప్త అవినీతి ఆందోళన విజయం సాధించిందని చెప్పుకుంటున్నారు. అన్నా హజారే మీద గాని, ఆయన ప్రతిపాదిస్తున్న పౌరసమాజ ప్రతినిధుల మీద గాని ఎటువంటి అగౌరవం లేకుండానే, ఈ మొత్తం నాటకం అమాయకంగా, అర్ధరహితంగా, హాస్యాస్పదంగా సాగుతున్నదని చెప్పకతప్పదు. ఈ ఉద్యమంలో పాల్గొన్న, పాల్గొంటున్న ప్రజల న్యాయమైన అవినీతి వ్యతిరేక ఆకాంక్షలను నట్టేట ముంచడానికి అత్యున్నత స్థాయిలో కుట్ర జరుగుతున్నదని చెప్పకతప్పదు. అసలు అవినీతికి మూలమేమిటో, అవినీతిని పెంచి పోషిస్తున్నదెవరో తెలియని అమాయకత్వం, లేదా దాచిపెట్టదలచిన కుటిలత్వం ఈ ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్నది. అవినీతికి మూలకారణమైన వ్యవస్థను యథాతథంగా ఉంచి, ఆ వ్యవస్థలోని దోపిడీ పీడనల గురించి, అంతరాల గురించి, అసమానతల గురించి మాట్లాడకుండా, అవినీతిని వేల రెట్లు పెంచిన ప్రపంచీకరణ గురించి మాట్లాడకుండా అవినీతి గురించి మాట్లాడడమంటే, ఆ అవినీతిని ఒక చట్టం ద్వారా రూపుమాపగలమని భ్రమలు కల్పించడమంటే అమాయకత్వమో, కుట్రో కాకతప్పదు. అది అమాయకత్వమయినా, కుట్ర అయినా బలి అయిపోయేది మాత్రం ప్రజల న్యాయమైన అవినీతి వ్యతిరేక ఆకాంక్షలు. కామన్‌వెల్త్ గేమ్స్, ఆదర్శ్, 2జి వంటి కుంభకోణాలు వెల్లడయిన తర్వాత ప్రజలలో ఈ వ్యవస్థ పనితీరు పట్ల తీవ్రమైన అవిశ్వాసం పెరుగుతున్న తరుణంలో, ఈ వ్యవస్థలో మార్పు సాధ్యమే అని భ్రమలు కల్పించడానికి పాలకవర్గాలు వేసిన కొత్త ఎత్తుగడ లోక్‌పాల్. ఆ చట్టం ఎవరు చేసినా, ఎంత ఆదర్శవంతంగా చేసినా, ఈ వ్యవస్థ ఇలా కొనసాగినంతకాలం, ఎన్ని అతుకులు, మాట్లు వేసినా, మలామాలు పూసినా అవినీతి రద్దు కాదు. ప్రజల అవినీతి వ్యతిరేక ఆకాంక్షలను బలంగా బయటపెట్టిన ఈ ఆందోళన అవినీతికి మూలమైన వ్యవస్థను రద్దు చేసే దిశగా సాగాలి. వీ

## ప్రపంచ బ్యాంకు, ఐ.ఎం.ఎఫ్.ల ఆర్తనాదాలు

ఇటీవల వాషింగ్టన్ లో జరిగిన ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ (ఐఎంఎఫ్) ల వార్షిక సమావేశాలలో ఆ సంస్థల అధిపతులు చేసిన ప్రకటనలు, హెచ్చరికలు సామ్రాజ్యవాద ప్రభుత్వాల, పాలకవర్గాల, బహుళజాతి సంస్థల భయాలకు అద్దం పడుతున్నాయి. అంతర్జాతీయంగా పెరుగుతున్న ఆహారధరలు, విపరీతంగా పెరిగిపోతున్న నిరుద్యోగం, ఇటీవలి పశ్చిమాసియా ప్రజా సంచలనాలు, అభివృద్ధి చెందిన దేశాల ఆర్థిక వ్యవస్థల ఒడిదుడుకులు ప్రపంచవ్యాపిత ఆర్థిక సంక్షోభాన్ని తీవ్రతరం చేయనున్నాయని ఆ సమావేశాల్లో ప్రపంచ బ్యాంకు అధ్యక్షుడు రాబర్ట్ జోలిక్, ఐఎంఎఫ్ మేనేజింగ్ డైరెక్టర్ డామినిక్ స్ట్రాస్-కాన్ పదే పదే అన్నారు. "పూర్తిస్థాయి సంక్షోభంనుంచి మనం ఒక్క అడుగు దూరంలో మాత్రమే ఉన్నాం. తర్వాత చేసే చికిత్స కన్న నిరోధమే మంచిదని గత ఆర్థిక సంక్షోభం మనకు గుణపాఠం నేర్పింది. మనం ఆ పాఠాన్ని విస్మరించడానికి వీలు లేదు" అనీ, అరబ్ దేశాలలో జోక్యానికి "మామూలు పరిస్థితులు నెలకొనేదాకా వేచిచూద్దాం అనే ధోరణి మంచిది కాదు. అలా మనం అవకాశాలను జారవిడుచుకోలేం. విప్లవ పరిస్థితులలో యథాస్థితి వాదం నెగ్గదు" అనీ జోలిక్ ప్రపంచబ్యాంకు చేయనున్న పనులేమిటో సూచించాడు. ఇక స్ట్రాస్-కాన్ మరొక అడుగు ముందుకువేసి వ్యవస్థకు అనేక వ్యాధులు ఉన్నాయని, కొత్త వ్యాధులు కూడ పొడసూపుతున్నాయని, ఇప్పుడు చేతులు ముడుచుకు కూచుంటే పని జరగదని అన్నాడు. "వృద్ధి సరిపోదు. పాత పద్ధతిలో అయితే మనం వృద్ధి జరిగితే సరిపోతుందని, మిగిలినవన్నీ వాటంతట అవే జరుగుతాయనీ అనుకునేవాళ్లం. కాని ఆ పద్ధతికి కాలం చెల్లింది" అన్నాడు. ఐఎంఎఫ్ లో కీలకాధికారం గల కమిటీ అధ్యక్షుడు ధర్మన్ షణ్ముగరత్నం "మనం ఇంకా ఎప్పుడైనా పగిలిపోగల స్థితిలోనే ఉన్నాం. మనం చాల జాగ్రత్తగా చూస్తూ ఉండాలి. చికాకు పరిచే సన్నివేశాలు ఏర్పడతాయని గుర్తించి, ఎదుర్కోవడానికి సిద్ధపడాలి. మరీ ముఖ్యంగా వ్యవస్థాత్మకంగా కీలకమైన దేశాల విషయంలో మరొక సంక్షోభం రాకుండా జాగ్రత్త పడాలి" అన్నారు. ఇలా వ్యవస్థాత్మకంగా కీలకమైన, ప్రమాదపు అంచులలో ఉన్న దేశాలుగా ఏడు దేశాలను గుర్తించారు. అవి అమెరికా బ్రిటన్, జర్మనీ, ఫ్రాన్స్ జపాన్, చైనా, భారతదేశం. ఈ ఏడు దేశాలు తమ సంక్షోభాలను నివారించడానికి ఏ చర్యలు చేపట్టాలో నవంబర్ లో ఫ్రాన్స్ లో జరిగే సమావేశంలో నిర్ణయాలు తీసుకోవాలనుకున్నారు. అంటే నవంబర్ లో మళ్లీ ఒకసారి భారతదేశంలో ప్రపంచీకరణ విధానాలను మరింత తీవ్రతరం చేసే చర్యలు చేపట్టడానికి రంగం సిద్ధం కానున్నదన్నమాట. ఇది పాలకవర్గాల నుంచి, బహుళజాతిసంస్థల నుంచి జరుగుతున్న కుటిల ప్రయత్నం. ఈ ప్రయత్నాన్ని తిప్పికొట్టగల శక్తి ఇవాళ్టికివాళ ఆయాదేశాల విప్లవ, ప్రజా శక్తులకు లేకపోవచ్చు. కాని ఈ దేశాలలో తమ కార్యక్రమాలవల్ల సంక్షోభం రాగల స్థితి ఏర్పడిందని, దాన్ని నివారించడానికి మరింత పెద్దఎత్తున ప్రపంచీకరణ విధానాలు అమలు జరపాలని బహుళజాతి సంస్థలు సామ్రాజ్యవాద శక్తులు ఆలోచిస్తున్నాయని గుర్తించడం ప్రజాశక్తుల బాధ్యత. ఆ దాడి గురించి పెద్ద ఎత్తున ప్రచారం చేసి, ఆ దాడిని ఎదుర్కోవడానికి ప్రజలను సమాయత్తం చేయడం, ఒకవేళ పాలకవర్గాలకూ, ఆర్థిక వ్యవస్థలకూ సంక్షోభమే వస్తే, ఆ సంక్షోభాన్ని ప్రజావెల్లువను రేకెత్తించడానికి ఉపయోగించుకోవడం విప్లవ, ప్రజాశక్తుల, సామ్రాజ్యవాద వ్యతిరేకుల, నిజమైన ప్రజాస్వామికవాదుల కర్తవ్యం. వీ







- **చైతన్య కెరటాలు** – వి. జయరాముడు – సంజీత ప్రచురణలు, 261 పేజీలు, 1/8 డెమీ, రు.150, ప్రతులకు : వి. జయరాముడు, ఎం.ఐ.జి.-27, ఫేజ్-2, సైట్-1, హౌసింగ్ బోర్డ్ కాలనీ, పోతిరెడ్డిపల్లె, సంగారెడ్డి – 502 295; సెల్ : 9848215650, అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో
- **శ్రీశ్రీ ఒక తీరని దాహం** – అదృష్ట దీపక్ – శ్రీశ్రీ సాహిత్య నిధి, 31 పేజీలు, 1/8 డెమీ, రు.20, ప్రతులకు : శ్రీశ్రీ సాహిత్య నిధి, 305, ప్రగతి టవర్స్, వీరయ్య స్ట్రీట్, మారుతినగర్, విజయవాడ – 520004; ఫోన్ : 0866-6640595, ఫ్యాక్స్ : 0866-6697375, సెల్ : 9848504649, 9246277375; ఇ-మెయిల్ : srisri_sahityanidhi@yahoo.com
- **కృష్ణారెడ్డి గారి ఏనుగు** – కన్నడ మూలం: పూర్ణచంద్ర తేజస్వి – తెలుగు అనువాదం : శాఖమూరు రామగోపాల్ – అభిజాత్య కన్నడ-తెలుగు భాషా (అనువాద) సంశోధన కేంద్రం ప్రచురణ – 201 పేజీలు, 1/8 డెమీ, రు : 100, ప్రతులకు: శాఖమూరు రామగోపాల్, ఇ.నెం. 5-10, రోడ్ నెం. 21, దీప్తి శ్రీనగర్, మియాపూర్ పోస్ట్, హైదరాబాద్ – 500 049; ఫోన్ : 040 – 65520286, సెల్ : 9052563666
- **పణవిపణి** – గేయ కావ్యము – నళినీ కుమార్ – 151 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : పెనుగొండ లక్ష్మీనారాయణ, ప్రెసిడెంట్, ఎ.పి. అరసం, 4-15-122/8, 'అభ్యుదయ', 9వ లేన్, భరతపేట, అమరావతి రోడ్డు, గుంటూరు – 522 002, ఫోన్: 9440248778; విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ అన్ని బ్రాంచీలు
- **అశ్రుజల** – కవిత (2003-2009) – కె.వి. రమణారెడ్డి – కొణతం ప్రచురణలు – 88 పేజీలు, 1/8 డెమీ, రు : 30, ప్రతులకు : కె.వి. రమణారెడ్డి, టీచర్, ఇ.నెం. 1/203-ఎ-174-బి-1, జార్జి కాలేజి (బి. ఫార్మసి) వెనుక, తర్లుపాడు రోడ్, మార్కాపురం – 523 316, ప్రకాశం జిల్లా. సెల్ : 98856 20875, అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో
- **లెటర్స్ ఆఫ్ నాలెడ్జ్** (ఇంగ్లిష్ పొయెట్రి) – తెలుగు : శ్రీగిరిరాజు విజయలక్ష్మి, ఇంగ్లిష్ అనువాదం : క్రిష్, 41 పేజీలు, 1/8 డెమీ, రు : 20, ప్రతులకు : ప్రముఖ పుస్తక కేంద్రాల్లో, సెల్ : 9246571113
- **చారిత్రక సందర్భం – తెలంగాణ రాష్ట్ర సాధన** – ఎం. శ్రీనివాస్ – సి.పి.ఐ. (ఎం.ఎల్.) న్యూ డెమోక్రసీ ప్రచురణ – 64 పేజీలు, 1/8 డెమీ, రు. 15, ప్రతులకు : ప్రజాపంథా, మార్క్స్ భవన్, 658, విద్యానగర్, 7వ లైన్, హైదరాబాద్ – 500 044; సహచర బుక్ హౌస్, దిశ బుక్ హౌస్, నవోదయ బుక్ హౌస్, మైత్రీ బుక్ స్టాల్
- **ప్రజాతంత్ర విప్లవంలో సోషల్ డెమోక్రాట్ల రెండు ఎత్తుగడలు** – సంక్షిప్త పరిచయం – సి.పి.ఐ. (ఎం.ఎల్.) న్యూ డెమోక్రసీ ప్రచురణ – 46 పేజీలు, 1/8 డెమీ, రు. 10, ప్రతులకు : ప్రజాపంథా, మార్క్స్ భవన్, 658, విద్యానగర్, 7వ లైన్, హైదరాబాద్ – 500 044; సహచర బుక్‌హౌస్, దిశ బుక్‌హౌస్, నవోదయ బుక్‌హౌస్, మైత్రీ బుక్ స్టాల్, విశాలాంధ్ర అన్ని బ్రాంచీలలో, ప్రజాశక్తి అన్ని బ్రాంచీలు
- **పిట్టగూడు** – జానపద కథలు – పుప్పాల కృష్ణమూర్తి – అడుగుజాడలు పబ్లికేషన్స్ – 102 పేజీలు, 1/8 డెమీ, రు.50
- **దేశ దేశాల కవిత్వం** – మట్టి కూడా మాట్లాడుతుంది – డా. నలిమెల భాస్కర్ – అడుగుజాడలు పబ్లికేషన్స్ – 76 పేజీలు, 1/8 డెమీ, రు. 40

పై రెండు ప్రతులకు : జూలూరు గౌరీశంకర్, ఇ.నెం. 1-8-702/33/20ఎ, పద్మాకాలనీ, నల్లకుంట, హైదరాబాద్ – 500 044; రాష్ట్రంలోని అన్ని పెద్ద పుస్తకాల షాపుల్లో









## 8వ అధ్యాయాన్ని బహిర్గత పరచాలి

శ్రీకృష్ణ కమిటీ నివేదికలోని 8వ అధ్యాయాన్ని బయట పెట్టాలంటూ నిజామాబాద్‌కు చెందిన మాజీ ఎం.పి. ఎం. నారాయణరెడ్డి వేసిన పిటిషన్‌పై హైకోర్టు మార్చ్ 16న వాదోపవాదాలు విన్న తర్వాత మార్చ్ 23న 58 పేజీల తుది తీర్పు వెలువరించింది. ప్రజల అభిప్రాయం పై ఆధారపడి రూపొందించిన నివేదికలోని ఓ భాగాన్ని రహస్యంగా ఉంచడం ప్రజాస్వామ్యానికి గొడ్డలి పెట్టు వంటిదనీ, ఈ నివేదికను బహిర్గతం చేయకుండా ఉంచితే ఈ కమిటీ ప్రజలతో జరిపిన అర్థవంతమైన చర్చలకు అర్థం లేకుండా పోతుందనీ ఈ సందర్భంగా హైకోర్టు వ్యాఖ్యానించింది. రెండు వారాలలోగా 8వ అధ్యాయాన్ని బయటపెట్టాలని కేంద్ర హోంశాఖను ఆదేశించింది. హైకోర్టు వ్యాఖ్యల నేపథ్యంలో తెలంగాణ ప్రాంతమంతటా మార్చ్ 24న నిరసనలు మిన్నంటాయి.

## ఎవరి లాభాల కోసం ఈ ఒప్పందాలు?

రాష్ట్ర ప్రభుత్వ ఆధ్వర్యంలోని ఎ.పి.ఐ.ఐ.సి., రెవెన్యూ శాఖలు 2004-10 మధ్యకాలంలో 6767 ప్రాజెక్టుల కోసం 67,570 ఎకరాలు కేటాయించింది. ఒకలక్షా ఎనభై ఏడువేల యాభై రెండు కోట్ల రూపాయల పెట్టుబడి ప్రతిపాదనలతో అవగాహన ఒప్పందాలు (ఎం.ఒ.యు.) రాష్ట్ర ప్రభుత్వం కుదుర్చుకుంది. ఇప్పటికీ అమల్లోకి వచ్చిన పెట్టుబడులు కేవలం రు. 17,567 కోట్లు కాగా, ఉపాధి అవకాశాలు చూస్తే ఎం.ఒ.యు.ల ప్రకారం 6,84,389 మందికి ఉపాధి లభించాల్సి ఉండగా, 56,436 మందికి మాత్రమే ఉపాధి లభించినట్లు తెలుస్తోంది.

## విడుదల కాని విద్యార్థుల మెస్ ఛార్జీలు

షెడ్యూల్డ్ కులాల సంక్షేమ శాఖ పరిధిలో రాష్ట్రవ్యాప్తంగా 320 గురుకుల పాఠశాలలు ఉన్నాయి. వీటిలో లక్షా యాభై వేల మంది విద్యార్థులు వసతి పొందుతున్నారు. ఎస్.సి. గురుకులాలనికి ప్రత్యేక బడ్జెట్ ఉంటుంది. ప్రత్యేకించి మెస్, కాస్మెటిక్, ఆశ్రమ పాఠశాలల నిర్వహణ ఛార్జీలను క్రమం తప్పకుండా విడుదల చేసేందుకు నిధులపై ఎలాంటి ఆంక్షలు ఉండవు. కానీ ఈ ఏడాది అనేక ఆంక్షలు విధించడంతో గురుకుల విద్యార్థుల పరిస్థితి దయనీయంగా మారింది. ఐదు నెలలుగా బిల్లులు రాకపోవడంతో టీచర్లు చందాలు వేసుకొని నడిపే ప్రయత్నమూ వారికే జీతాలు అందక కొనసాగలేదు.

## ధర్మభిక్షం కన్నుమూత

తెలంగాణ రైతాంగ సాయుధ పోరాట యోధుడు బొమ్మగాని ధర్మభిక్షం గత కొంతకాలంగా అనారోగ్యంతో హైదరాబాద్ కామినేని ఆస్పత్రిలో చికిత్స పొందుతూ మార్చ్ 26న కన్నుమూశారు. సంసార జీవితం ఉద్యమానికి ఆటంకం అవుతుందని ఆయన వివాహం చేసుకోలేదు. నల్గొండ జిల్లా మునుగోడు మండలం ఊకొండి గ్రామంలో బొమ్మగాని ముత్తిలింగం, గోపమ్మ దంపతులకు ధర్మభిక్షం 1922లో జన్మించారు. విద్యార్థి దశలోనే ప్రగతిశీల భావాలతో ఉండిన ధర్మభిక్షం అనంతర కాలంలో కమ్యూనిస్టు అయ్యారు. పేద ప్రజల పక్షాన క్షేత్రస్థాయిలో అనేక పోరాటాలు చేస్తూనే అటు లోక్‌సభ సభ్యుడిగా ఢిల్లీ దాకా బడుగు ప్రజల వాణి వినిపించారు.

## సాంబశివుడి హత్య

మాజీ మావోయిస్టు, టి.ఆర్.ఎస్. పొలిట్‌బ్యూరో సభ్యుడు కోనపూరి ఐలయ్య అలియాస్ సాంబశివుడు మార్చ్ 26 అర్ధరాత్రి హత్యకు గురయ్యారు. నల్గొండ జిల్లా వలిగొండ మండలం సంగెంలో టి.ఆర్.ఎస్. ఆధ్వర్యంలో జరిగిన ధూంధాం కార్యక్రమంలో పాల్గొని వస్తుండగా గోకారం గ్రామ స్టేజి వద్ద రాత్రి 11.30 గంటలకు హత్యకు గురయ్యారు.

## నటుడు నూతన్ ప్రసాద్ మృతి

హాస్య పాత్రల నుంచి విలన్ పాత్రల దాకా అనేక పాత్రలలో నటించిన సినీ నటుడు నూతన్ ప్రసాద్ (65) మార్చ్ 30న ఉదయం హైదరాబాద్‌లో గుండెపోటుతో మరణించారు. ఆయన 475 చిత్రాలలో నటించారు. 1989లో ఒక చిత్రం షూటింగ్‌లో పై నుంచి కిందకి పడి వెన్నెముక దెబ్బతిని వీల్ ఛైర్‌కు పరిమితమైనా ఆత్మస్థైర్యాన్ని కోల్పోకుండా నట జీవితాన్ని కొనసాగించారు.

## రాష్ట్ర జనాభా - 8,46,65,533

2011 జనాభా లెక్కల ప్రకారం ఆంధ్రప్రదేశ్ జనాభా అక్షరాలా ఎనిమిది కోట్ల నలభై ఆరు లక్షల అరవై ఐదు వేల ఐదు వందల ముప్పై మూడుకు చేరింది. ఇందులో పురుషుల జనాభా 4,25,09,881 (50.20 శాతం) కాగా, మహిళల జనాభా 4,21,55,652 (49.80 శాతం) గా ఉంది. సెన్సెక్స్ డైరెక్టర్ వై.వి. అనురాధ ఈ వివరాలను మార్చ్ 31న వెల్లడించారు.

## నటి సుజాత మృతి

సినీ నటి సుజాత (58) ఏప్రిల్ 6న గుండెపోటుతో చెన్నైలో మృతి చెందారు. ఆమె కొంతకాలంగా కిడ్నీ సమస్యతో బాధపడుతున్నారు. ఆమె శ్రీలంకలో జన్మించి పాఠశాల విద్య తరువాత కేరళకు వచ్చారు. ఆమె తెలుగు, తమిళం, మళయాళం, కన్నడం, ఒడియా, హిందీ భాషాలలో మూడు వందలకు పైగా చిత్రాలలో నటించారు. అన్ని భాషల్లోనూ మంచి నటిగా గుర్తింపు పొందారు.

## ఆశా వర్కర్లపై లాఠీఛార్జ్

నాలుగు నెలలుగా జీతాలు రాకపోవడంతో, వెంటనే తమ జీతాలు చెల్లించాలంటూ శాంతియుతంగా విజయనగరంలో ఏప్రిల్ 7న ప్రదర్శనకు పూనుకున్న ఆశా వర్కర్ల పట్ల పోలీసులు అమానుషంగా ప్రవర్తించారు. వేతనాలు పెంచాలనే డిమాండ్ సహా పలు సమస్యల పరిష్కారానికి రాష్ట్ర వ్యాప్తంగా ఇచ్చిన పిలుపు మేరకు విజయనగరం జిల్లా ఆశా వర్కర్లు డి.ఎం.ఎచ్.ఒ. కార్యాలయం ముట్టడించాలని నిర్ణయించారు. అందులో భాగంగా శాంతియుతంగా ర్యాలీగా వెళ్తున్న మహిళలపై పోలీసులు విరుచుకుపడ్డారు. లాఠీలతో చితకబాదారు. మహిళల జుట్లు పట్టి తీవ్రంగా కొట్టారు. వీ

పాలక విధానాలలోనే అవినీతికి మూలాలు ఉన్నాయని, వ్యవస్థీకృతమైన అవినీతిపై సంఘటితంగా పోరాడాలని అంటున్నారు ఎ. నర్సింహారెడ్డి

# అవినీతి నిర్మూలనకు అవినీతిపరుల మద్దతా?

**1947** ఆగస్ట్ 15న బ్రిటిష్ వారి నుండి అధికార మార్పిడి జరిగిన నాటి నుండి నేటి వరకు జాతీయ స్థాయిలో రాజకీయ అవినీతి విచ్చలవిడిగా చెలరేగిపోతున్నా, కోటానుకోట్ల ప్రజాధనం కొల్లగొట్టేస్తున్నా వారిపై ఇప్పటివరకు ఎలాంటి చర్యలు లేవు. దేశంలో ఇప్పటి వరకు 73 లక్షల కోట్ల రూపాయలు కుంభకోణాల రూపంలో గల్లంతైనట్లు ఓ సర్వే నివేదిక తెలిపింది. రాష్ట్రాల స్థాయిలో, వివిధ ప్రభుత్వ శాఖల్లో విచ్చలవిడిగా సాగిన అవినీతినిగూడా పరిగణనలోకి తీసుకుంటే ఈ మొత్తం కోటి కోట్ల రూపాయలు దాటుతుంది. ప్రజా జీవితంలో అంతులేని అవినీతికి పాల్పడిన రాజకీయ నాయకులు, అగ్రస్థాయి అధికారులు, వాణిజ్యవేత్తలు, సైనికాధికారులు, న్యాయమూర్తుల అక్రమ సంపాదనపై చర్యలు తీసుకొని శిక్షలు విధించే అవకాశమున్నా ఏ చర్యా తీసుకోకుండా వదిలి వేసేందుకు అసలు కారణమేమిటి? పాలకుల నిర్లిప్తతా? లేక చట్టాల లోపమా? అంటే, రెండూ నిజమేననిపిస్తాయి.

దేశం ముందున్న సమస్య అవినీతి అని సాక్షాత్తూ రాష్ట్రపతి ప్రతిభాపాటిల్ దేశ ప్రజలనుద్దేశించి గణతంత్ర దినోత్సవ సందేశంలో చెప్పారు. అవినీతిపరులని తెలిసినా ప్రభుత్వ మనుగడ కోసం రాజా వంటి వారిని మంత్రి వర్గంలో చేర్చుకోక తప్పడం లేదని ప్రధాని మన్మోహన్‌సింగ్ వెల్లడించడం హాస్యాస్పదం. పెట్టుబడిదారీ సమాజంలో ఏ అనైతిక మార్గం ద్వారా నైనా అధిక లాభాలనార్జించడం, ఎదుటివాడి కంటే హెచ్చు సంపదను పోగు చేసుకోవడం వ్యాపార సంస్కృతిలో ఒక భాగం. దోపిడి వ్యవస్థ సృష్టించిన విషపుత్రిక అవినీతి. అందువల్లనే ధనార్జన కోసం దేనికైనా తెగబడటం పెట్టుబడిదారుల సహజ స్వభావం. దానిని అదుపు చేయడం కాకుండా ప్రోత్సహించడమే ప్రభుత్వ విధానమైనపుడు ప్రజాగ్రహం పెరుగక తప్పదు. అవినీతి అక్రమాలే అధికారానికి ఆధారాలవుతున్న పరిస్థితుల్లో పౌర సమాజం నుండి ఒత్తిడి లేకుండా అవినీతిపై చర్యలు తీసుకోగలరని ఆశించడం అమాయకత్వమే అవుతుంది.

గత రెండేళ్లుగా దేశంలో పెద్దయెత్తున అవినీతి కుంభకోణాలు వెల్లడికావడం ముఖ్యంగా 2జి స్పెక్ట్రమ్ కుంభకోణంలో ప్రభుత్వ ఖజానాకు లక్షా 75 వేల కోట్ల రూపాయల నష్టం. కామన్వెల్త్ క్రీడల నిర్వహణలో కోట్లాది రూపాయలు స్వాహా కావడం, అవినీతి ఆరోపణలు వచ్చినప్పటికీ సుప్రీంకోర్టు మందలించేంత వరకూ కేంద్ర విజిలెన్స్ కమిషనర్‌గా థామస్‌ను కొనసాగించడం మొదలైనవి మధ్యతరగతిని కదిలించివేశాయి. ఇవి కాక రాష్ట్ర స్థాయి నాయకుల అవినీతి కార్యక్రమాలపై ప్రజలు విసిగిపోయారు. ఏ రాజకీయ పార్టీని, ఏ నేతను కదిలించినా అవినీతి పుట్టలు కదులుతున్నాయి. బడా పారిశ్రామిక సంస్థలకు, సెజ్‌లకు భూములు కేటాయింపులు, ఆశ్రితులకు కాంట్రాక్టుల మంజూరు, ఎన్నికల్లో విజయానికి వేల కోట్లు ఖర్చు పెట్టడం మరింత తీవ్రతరమైంది. ఈ నేపథ్యంలో సామాజిక కార్యకర్త అన్నా హజారే ఏప్రిల్ 5న ప్రారంభించిన ఆమరణదీక్షతో లోక్‌పాల్ బిల్లు దేశ వ్యాప్తంగా మరోసారి చర్చనీయాంశమైంది.

ప్రజా జీవితంలో అవినీతి జాడ్యం విస్తరిస్తున్న తరుణంలో 1960ల్లో లోక్‌పాల్ ఆలోచన తెరపైకి వచ్చింది. తొలిసారిగా 1968లో పార్లమెంట్ ముందుకొచ్చిన ఈ బిల్లు 43 ఏళ్లయినా బయటి ప్రపంచాన్ని చూడలేకపోయింది. గడచిన 43 ఏళ్లలో లోక్‌పాల్ బిల్లు ఎనిమిది సార్లు పార్లమెంట్ ముందుకు వచ్చింది. కానీ ... చట్టరూపం దాల్చలేదు. ఇప్పటివరకూ మూడు కమిషన్లు లోక్‌పాల్ బిల్లు ఆవశ్యకతపై అధ్యయనం చేశాయి.

## పాలనా సంస్కరణ కమిషన్ నివేదిక (1966)

మంత్రులు, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ కార్యదర్శుల స్థాయి అధికారులపై వచ్చే ఫిర్యాదులను పరిశీలించి, దర్యాప్తు జరపడానికి లోక్‌పాల్ ఏర్పాటు చేయాలని, ఇతర అధికారులపై ఫిర్యాదుల విచారణకు లోకాయుక్త ఏర్పాటు చేయాలని పేర్కొంది.

- లోక్‌పాల్, లోకాయుక్తలను కార్యనిర్వాహక, శాసన, న్యాయ వ్యవస్థలకు అతీతంగా స్వతంత్రంగా ఏర్పాటు చేయాలి.
- లోక్‌పాల్‌కు సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి హోదా, లోకాయుక్తలకు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తుల హోదా కల్పించాలి.
- నియామకాలను సాధ్యమైనంతలో రాజకీయాలకు అతీతంగా చేపట్టాలి.
- లోక్‌పాల్ స్వతంత్రంగా గానీ, లేదంటే పౌరుల నుంచి అందిన ఫిర్యాదుల ఆధారంగా చర్యలు తీసుకోవాలి. అవినీతి, అన్యాయం, ఆశ్రిత పక్షపాతం వంటి పాలనాపర రుగ్మతలపై లోకాయుక్తగా విచారణ చేపట్టవచ్చునని కమిషన్ సిఫారసులు చేసింది.

ఈ కమిషన్ నివేదిక ఆధారంగా 1968లో లోక్‌పాల్ బిల్లు

లోక్‌సభ ముందుకొచ్చింది. 1969లో ఈ బిల్లు లోక్‌సభలో పాసైనా రాజ్యసభలో గట్టెక్కలేకపోయింది. 1985లో ప్రభుత్వం దీన్ని ఉపసంహరించుకొంది.

### రాజ్యాంగ పనితీరుపై జాతీయ కమిషన్ (2002)

లోక్‌పాల్ బిల్లు పరిధినుంచి ప్రధానమంత్రిని తొలగించాలి, అవినీతి ఫిర్యాదులపై విచారణ జరిపిన తర్వాత లోక్‌పాల్‌దే అంతిమ నిర్ణయం. అది చెప్పినట్లుగానే ప్రభుత్వం చర్యలు తీసుకోవాలి.

- ఓటు వేసేందుకు లేదా వేయకుండా ఉండేందుకు పార్లమెంట్ సభ్యులు ఆర్థికంగా, ఇతరత్రా విలువైన ప్రయోజనం పొందినట్లు తెలిస్తే వారిని ప్రాసిక్యూట్ చేసేలా రాజ్యాంగాన్ని సవరించాలి.
- రాష్ట్రపతి ఏర్పాటు చేసిన కమిటీ ద్వారా ముందస్తు అనుమతి తీసుకున్న అనంతరం ఏదైనా దర్యాప్తు సంస్థ ఎంపీలను ప్రాసిక్యూట్ చేయొచ్చు. లోక్‌సభ స్పీకర్, రాజ్యసభాధ్యక్షుల అనుమతి తీసుకున్న తర్వాత రాష్ట్రపతి ఐదుగురు ఎం.పి.లతో దర్యాప్తు కమిటీ ఏర్పాటు చేయాలని కమిషన్ సిఫారసు చేసింది.

### రెండవ పాలనా సంస్కరణల కమిషన్ (2007)

మొయిలీ నేతృత్వంలోని కమిటీ లోక్‌పాల్ పరిధిలోకి ప్రధాన మంత్రిని తప్ప ముఖ్యమంత్రులు, కేంద్ర మంత్రులు, ఎం.పి.లను తీసుకురావాలని పేర్కొంది.

- దర్యాప్తులో ప్రభుత్వ ఉద్యోగుల పాత్ర ఉన్నట్లు తేలితే సంబంధిత అధికారులకు వ్యతిరేకంగా దర్యాప్తు చేపట్టవచ్చు.
- లోక్‌పాల్‌ను విశ్రాంత సుప్రీంకోర్టు జడ్జి నేతృత్వంలో ఏర్పాటుచేసి, అందులో ప్రఖ్యాత న్యాయనిపుణులను సభ్యులుగా నియమించాలి.
- సెంట్రల్ విజిలెన్స్ కమిషనర్‌ను ఎక్స్ అఫిషియో సభ్యుడిగా నియమించాలి. ఛైర్మన్‌గా నియమితులయ్యే వ్యక్తి కేవలం మూడేళ్లు మాత్రమే కొనసాగాలి. ఆ తర్వాత సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి పదవి తప్ప మరే ఇతర పదవీ చేపట్టకుండా నిబంధన విధించాలని కమిషన్ సిఫారసు చేసింది.

ప్రజా ప్రతినిధులు, ప్రభుత్వాధికారుల అవినీతికి అడ్డుకట్ట వేసేందుకు స్కాండినేవియా తదితర దేశాల్లో అమల్లో ఉన్న 'అంబుడ్స్‌మన్' (స్వీడిష్ పదం-ఫిర్యాదులను పరిశీలించే అధికారి) అనే స్వతంత్ర నియంత్రణ వ్యవస్థను భారత్‌లో ప్రవేశపెట్టేందుకు 1960ల నుంచి ప్రయత్నాలు జరుగుతూనే ఉన్నాయి. దాన్ని కేంద్ర ప్రభుత్వ స్థాయిలో 'లోక్‌పాల్' అని, రాష్ట్ర ప్రభుత్వాల స్థాయిలో 'లోకాయుక్త' అని పిలుస్తారు. లోక్‌పాల్ వంటి వ్యవస్థలు ఫిన్లాండ్, నార్వే, డెన్మార్క్, స్వీడన్, ఇంగ్లండ్, న్యూజిలాండ్ వంటి దేశాల్లో అమల్లో ఉన్నాయి. స్వీడన్, డెన్మార్క్ ఫిన్లాండ్‌లలో అంబుడ్స్‌మెన్ కార్యాలయం ప్రజల నుంచి నేరుగా ఫిర్యాదులు స్వీకరించడంగానీ, లేదంటే తానే స్వయంగా జోక్యం చేసుకోవడం ద్వారా సమస్యల్ని పరిష్కరిస్తోంది.

మన దేశంలో అమలులో ఉన్న అవినీతి నిరోధక చట్టాలు పాలక వర్గాలకు జేబు సంస్థలుగా పనిచేస్తున్న తీరు గమనిస్తే మనకు ఆశ్చర్యం కలుగక మానదు. ఒక వ్యక్తిపై వచ్చిన ఆరోపణలు పూర్తిగా రుజువై శిక్ష పడిన తర్వాత కూడా, అతని వలన ప్రభుత్వానికి ఏర్పడిన నష్టం మొత్తాన్ని వసూలు చేయడానికి ఎలాంటి అవకాశాలు లేవు. ఏ వ్యక్తి అయినా శిక్ష పూర్తి చేసి జైలు నుండి బయటకు వచ్చిన తర్వాత తన అక్రమ సంపాదనను యథేచ్ఛగా అనుభవించవచ్చును. నిజంగా అవినీతిని నిరోధించే సంకల్పం ఉన్నట్లైతే చట్టాలకు మరింత పదును పెట్టాలి. అక్రమ సంపాదనను స్వాధీనం చేసుకునేలా అవినీతి నిరోధక యంత్రాంగాన్ని పరిపూర్ణంగా పటిష్టపరచాల్సి ఉంది.

జనవరి 30న గాంధీ వర్ధంతి నాడు నల్ల దొరలపై పోరాటానికి గాంధేయవాదులతో ఏర్పడిన 'సత్యాగ్రహ బ్రిగేడ్' అనే స్వచ్ఛంద సంస్థ అవినీతికి వ్యతిరేకంగా సత్యాగ్రహ ఉద్యమానికి శ్రీకారం చుట్టింది. ఆ సంస్థ కార్యదర్శి 93 ఏళ్ల శంభుదత్తాతో సహా మరో ఆరుగురు ఢిల్లీలో నిరాహారదీక్షకు దిగారు. కామన్‌వెల్త్ గేమ్స్, ఆదర్శ్, 2జీ స్పెక్ట్రమ్ వగైరా కుంభకోణాలకు పాల్పడడమే కాకుండా లక్షల కోట్ల రూపాయల ప్రజా ధనాన్ని సరిహద్దులు దాటిస్తున్న నల్లదొరల కబంధ హస్తాల నుంచి దేశాన్ని విముక్తి చేసేందుకు గాంధేయ మార్గంలో మరో స్వాతంత్ర్య పోరాటానికి వారు సమాయత్తమయ్యారు. మాజీ ఐ.పి.ఎస్ అధికారి కిరణ్‌బేడీ, సామాజిక కార్యకర్త అగ్నివేశ్, ప్రముఖ సంఘ సేవకుడు అన్నాహజారే తదితరులు గాంధీ వర్ధంతి సందర్భంగా అవినీతికి వ్యతిరేకంగా న్యూఢిల్లీలో భారీ ర్యాలీ నిర్వహించారు. 'ఇండియా అగెనెస్ట్ కరప్షన్' అనే ఉద్యమంలో భాగంగా నిర్వహించిన ఈ ర్యాలీలో వేలాది మంది పాల్గొన్నారు. అవినీతిని దేశం నుంచి తరిమికొట్టాలని, నేర చరిత్ర ఉన్న నాయకులు ఎన్నికల్లో పాల్గొనకుండా కట్టడి చేయాలని, అవినీతి నాయకుల, అధికారుల అక్రమ ఆస్తులను జప్తు చేయాలని, అవినీతిని ప్రోత్సహించే రాజకీయ పార్టీలకు ఓట్లు వెయ్యరాదని వారు నినదించారు.

లోక్‌పాల్ లాంటి స్వతంత్ర, సాధికార, పారదర్శక, అవినీతి నిరోధక సంస్థ ఏర్పాటు చేయాలని, తక్షణమే తగు మార్పులు చేర్పులతో లోక్‌పాల్ బిల్లును పార్లమెంట్‌లో ప్రవేశ పెట్టాలని దేశవ్యాప్తంగా ప్రజలు డిమాండ్ చేస్తున్నారు. అవినీతి నల్లధనం సమస్యలను పరిష్కరించే విషయంలో ప్రభుత్వాలు రాజకీయ పార్టీలు నిద్ర నటిస్తున్నాయని ట్యునీషియా, ఈజిప్టు, యెమన్, అల్జీరియాలలో వలె ఈ అవినీతి ప్రభుత్వాలకు వ్యతిరేకంగా ప్రజలు తిరుగుబాటు చేయడమొకటే పరిష్కారమని ప్రముఖులు పేర్కొన్నారు.

మన రాజకీయ నాయకులు ఏ అవినీతి వ్యవస్థ ద్వారా అధికారం లోకి వచ్చారో దాన్ని ఇబ్బందుల పాలు చేసే విశ్వాస ఘాతకులు కారు. రాజకీయాలు నేరపూరితం కావడంతో నేరగాళ్లు, రాజకీయ నాయకులు, ప్రభుత్వాధికారులు దేశంలో అపవిత్ర కూటమిగా ఏర్పడ్డారని వోహ్రా కమిటీ 1963 అక్టోబర్‌లోనే పేర్కొంది. మన ప్రభుత్వ వ్యవస్థలో అవినీతికి వ్యతిరేకంగా కృషి చేసే సంస్థలు మొక్కుబడిగా ఎంతో బలహీనంగా ఉన్నాయి. కేంద్ర స్థాయిలో సెంట్రల్ విజిలెన్స్ కమిషన్ (సివిసి), డిపార్ట్‌మెంటల్ వారీ విజిలెన్స్ విభాగాలు, సి.బి.ఐ. పని చేస్తున్నాయి. విజిలెన్స్ కేసులన్నింటికీ అత్యున్నత సంస్థ సి.వి.సి. కేంద్ర ప్రభుత్వంలోని 1500 శాఖలు, మంత్రిత్వ శాఖల్లోని అవినీతిని ఇది అదుపు చేయాలి. దీనికున్న సిబ్బంది 200 లోపు. ఇది పేరుకు స్వతంత్ర

సంస్థ అయినా వాస్తవానికి ఒక సలహా సంస్థ మాత్రమే. దాని సలహాలను ప్రభుత్వం అంగీకరించవచ్చు అంగీకరించక పోవచ్చు. నిఘా క్రమశిక్షణ వ్యవహారాలు చూడడం తప్ప క్రిమినల్ కేసు రిజిస్టర్ చేసే అధికారం సి.వి.సి.కి లేదు. రాజకీయ నాయకులపై చర్య తీసుకునే అధికారం అసలే లేదు. ఇక సి.బి.ఐ. నేరుగా కేంద్ర ప్రభుత్వం కింద ఉన్నందున అది రాజకీయ ఒత్తిడికి లోనవుతుంటుందని, ఎవరైనా మంత్రి, పాలక రాజకీయవేత్త లేదా అతనికి సన్నిహితుడైన ఉన్నతాధికారిపై ఫిర్యాదు వస్తే దాన్ని సవ్యంగా దర్యాప్తు చేయకుండా నీరు గారుస్తుందన్న అపప్రథను అది మోస్తున్నది. విచిత్రమేమిటంటే స్వతంత్రత ఉన్న సి.వి.సి.కి అధికారాలు లేవు, అధికారాలు ఉన్నా సి.బి.ఐ.కి స్వతంత్రత లేదు. అందువల్ల కేంద్ర ప్రభుత్వంలోని ఒక రాజకీయ వేత్త, ఉన్నతాధికారి అవినీతిపై ఏ పౌరుడైనా ఫిర్యాదు చేయదలిస్తే విచారణ జరిపి శిక్షించి అక్రమార్జనను స్వాధీనం చేసుకునే ఒక స్వతంత్ర సంస్థ ఆవశ్యకత నేడు ఎంతైనా ఉంది.

తాజాగా కేంద్ర ప్రభుత్వం ప్రతిపాదించిన లోక్‌పాల్ బిల్లు దేశ ప్రజల తెలివితేటల్ని మోసపుచ్చేదిగా ఉంది. లోక్‌పాల్ కేవలం సలహాలు ఇచ్చే సంస్థగా మాత్రమే ఉంటుందని, అది తన నివేదికను తగిన సంస్థకు సమర్పించవలసి ఉంటుందని బిల్లులో పేర్కొన్నారు. పోలీసు అధికారాలు కానీ, అవినీతిపరుడైన మంత్రి లేదా ఎం.పి.పై ప్రాథమిక సమాచార నివేదిక (ఎఫ్.ఐ.ఆర్.) నమోదు చేసే అధికారాలుకానీ దానికి ఉండవు. అవినీతిపై పోరాటంలో ప్రధానాస్త్రమని భావిస్తున్న సి.బి.ఐ. సైతం దాని అధికార పరిధిలోకి రాదు. తనంతట తానుగా సుమోటోగా కేసులపై చర్యలను తీసుకోవడానికి, అవినీతిపరులపై పౌరుల నుంచి స్వయంగా ఫిర్యాదులు స్వీకరించడానికి ఈ లోక్‌పాల్‌కు అధికారాలు ఉండవు. లోక్‌సభ స్పీకర్ లేదా రాజ్యసభ ఛైర్మన్ (వీరిద్దరూ రాజకీయంగా నియమితులైనవారే) అనుమతిస్తేనే అది ముందుకు వెళ్లగలుగుతుంది. ఇది పచ్చి బూటకపు బిల్లు అని, ఇది కోరలు లేని పాము లాంటిదని ప్రజల్ని మోసగించడానికి ఉద్దేశించిందనేది తేటతెల్లం. అందుకే దానికి బదులు సుప్రీంకోర్టు న్యాయవాది ప్రశాంత్ భూషణ్, కర్ణాటక లోకాయుక్త జస్టిస్ సంతోష్ హెగ్డే, మెగసేసే అవార్డు గ్రహీత అరవింద్ కేజ్రీవాల్ కలిసి రూపొందించిన ప్రత్యామ్నాయ జన లోక్‌పాల్ బిల్లును ముందుకు తెచ్చారు. దాని ప్రకారం ఎన్నికల సంఘం లాగా లోక్‌పాల్ స్వతంత్ర సంస్థగా ఉంటుంది. స్వయం నిర్ణయాధికారాలు ఉంటాయి. మంత్రులు, ఎం.పి.లు, న్యాయమూర్తులు ఉన్నతాధికారులపై వచ్చే ఫిర్యాదులపై సొంతంగా దర్యాప్తు చేయగలుగుతుంది. పైపెచ్చు ప్రజల నుంచి నేరుగా ఫిర్యాదులు స్వీకరించి, చర్యలు చేపట్టగలుగుతుంది. ప్రభుత్వం ప్రతిపాదించిన ముసాయిదాకు, జన లోక్‌పాల్ ముందుకు తెచ్చిన బిల్లుకు మధ్యగల ప్రధాన తేడా ఇది.

విదేశీ వ్యవహారాలు, భద్రత - రక్షణపరమైన అంశాలకు సంబంధించి ప్రధానమంత్రి తీసుకునే నిర్ణయాలపై దర్యాప్తు జరిపే అధికారం లోక్‌పాల్‌కు ఉండకూడదని ప్రభుత్వం అంటుంది. పౌర సమాజం ప్రతిపాదించిన ముసాయిదాలో అలాంటి మినహాయింపులేమీ లేవు. శిక్షల విషయంలోనూ సర్కారు నేరగాళ్ల పక్షమే వహించింది. ఆరు నెలల నుంచి ఏడేళ్ల దాకా జైలు శిక్ష విధించాలని తన బిల్లులో పేర్కొంది. పౌర సమాజం బిల్లు ప్రకారం జైలు శిక్ష కనీసంగా అయిదేళ్లు గరిష్టంగా జీవితఖైదు. తప్పుడు ఫిర్యాదులు చేసేవారికి జరిమానాలు విధించాలని జైలుకు పంపాలని ప్రభుత్వ బిల్లులో ప్రతిపాదించారు. లోక్‌పాల్‌కు ఫిర్యాదు చేయడానికే వెనకాడే విధంగా సామాన్యుల్ని భయభ్రాంతులకు గురి చేయరాదని జన లోక్‌పాల్ బిల్లులో సూచించారు. అవినీతి నేరగాళ్లను శిక్షించడమే కాకుండా అవినీతికి పాల్పడిన సొమ్మును తిరిగి రాబట్టే విధంగా, న్యాయ వ్యవస్థను లోక్‌పాల్ బిల్లు పరిధిలోకి తేవాలని కూడా జన లోక్‌పాల్ పేర్కొంటుంది.

హజారే అవినీతి వ్యతిరేక ఉద్యమానికి సంఘీభావం ప్రకటించిన, మద్దతు తెలిపిన కొందరు నేతలను, పారిశ్రామిక నేతలను చూసి ప్రజలు ముక్కున వేలేసుకున్నారు. ముంబాయికి చెందిన పద్నాలుగు మంది ప్రముఖులు జనవరి 17న దేశంలో వెలుగులోకి వస్తున్న ఆందోళన కరమైన ధోరణులపై ఒక బహిరంగలేఖను విడుదల చేశారు. ఆ లేఖపై సంతకాలు చేసినవారిలో అజీమ్ ప్రేమ్‌జీ, కేశవ్ మహీంద్ర, జంషెడ్ గోద్రెజ్, దీపక్ పరేఖ్, బిమల్ జలాన్, ఎం నరసింహం, బిఎన్ శ్రీకృష్ణ తదితరులున్నారు. ఇక్కడ గమనించవల్సినదేమంటే వీరిలో పది మంది వివిధ వ్యాపారాలలో, లేదా రిజర్వ్ బ్యాంక్ వంటి ఆర్థిక సంస్థలలో అత్యున్నత స్థాయి సంబంధాలు కలిగి ఉండినవారు, లేదా ఇప్పటికీ ఉన్నవారే. నేర పరిశోధన సంస్థలకు కార్యనిర్వాహక వ్యవస్థతో నిమిత్తం లేని స్వతంత్ర ప్రతిపత్తి ఇవ్వాలన్నది వీరి ప్రధాన సూచన. ఇంతకీ ఎవరు అవినీతిపరులు? ఎవరిపై ఎవరు పోరాడాలి? ఎవరినైతే అవినీతి పరులుగా మీడియా ఎత్తిచూపిందో వారే నేడు ఈ ఉద్యమానికి మద్దతు నీయడంలో అందరికన్నా ముందున్నారు. ఈ ఉద్యమానికి బడా వాణిజ్య సంస్థలు, కార్పొరేట్లు సైతం విరాళాలిచ్చారు. జిందాల్ అల్యూమినియం సంస్థ అత్యధికంగా రు.25 లక్షలు ఇవ్వగా, మరో వాణిజ్యవేత్త సురేందర్‌పాల్ సింగ్ రు.10 లక్షలు, రాంకీ సంస్థ రు.5 లక్షలు, ఐషర్‌గుడ్ ఎర్త్ ట్రస్ట్ 3 లక్షల చొప్పున భారీ విరాళాలు సమర్పించుకున్నాయి. అరుణ్ దుగ్గల్ అనే వ్యక్తి కూడా రు. 3 లక్షలు విరాళంగా ఇచ్చినట్లు 'ఇండియా అగెనెస్ట్ కరప్షన్' సంస్థ ప్రతినిధి తెలిపారు. మరో వైపు కర్ణాటక ముఖ్యమంత్రి యడ్యూరప్ప సంబరాలు జరుపుకున్నారు. భారతీయ జనతాపార్టీ అవినీతి వ్యతిరేక పోరాట యోధురాలుగా పోజులిస్తోంది. దీక్షకు సంఘీభావం తెలియజేస్తూ హజారేకు ఉత్తరం రాశారు. ఓబుళాపురం గనుల్లో అక్రమంగా ఇనుప ఖనిజం కొల్లగొట్టిన గాలి జనార్దన్‌రెడ్డి, మన రాష్ట్రాన్ని కొల్లగొట్టిన వై.ఎస్. జగన్‌మోహన్‌రెడ్డి, పప్పు యాదవ్, రామోజీరావు, అనేక ఆరోపణలు ఎదుర్కొన్న తెలుగుదేశం పార్టీ అధినేత చంద్రబాబునాయుడు లాంటి లూటీదారులు ఉద్యమంలో దూరడం హాస్యాస్పదంగా ఉంది. కాంగ్రెస్, బిజెపిలు ఉత్తమ పార్టీలే అయితే దేశంలోని సొమ్మంతా వారికి తెలియకుండానే విదేశాలకు తరలిపోతుందా? ఐపిఎల్ కుంభకోణంలో పదవి నుండి తొలగించబడ్డ లలిత్‌మోడీ క్రికెట్ అభిమానులంతా హజారే బొమ్మ పెట్టుకొని స్టేడియంకు రావలసిందిగా పిలుపునిచ్చారు. బడా పారిశ్రామిక సంస్థలు, సిఐఐ, అసోచామ్, ఫిక్కీ ఈ ఉద్యమానికి మద్దతునిచ్చాయి. అవినీతి పరులు, నీతిపరులు ఇద్దరూ ఒకేవైపు ఉండగలరా?

గుజరాత్ ముఖ్యమంత్రి నరేంద్రమోడీని అన్నా హజారే

ప్రశంసించడాన్ని ఎలా అర్థం చేసుకోవాలి? చట్టం వచ్చి ఎనిమిదేళ్లయినా మోడీ ఇంతవరకు లోకాయుక్తను నియమించలేదు. పైగా ఆ చట్టం పరిధిలోకి ముఖ్యమంత్రిని తీసుకురాలేదు. గుజరాత్ ప్రజాపంపిణీ వ్యవస్థలో చోటు చేసుకున్న అవినీతి స్వయానా మోడీ సోదరుడే మీడియాకు తెలిపాడు. ఇక ముస్లిం ఊచకోతకు ట్రేడ్‌మార్క్‌గా మారిపోయిన విషయాన్ని గురించి చెప్పవలసిన అవసరమే లేదు. గుజరాత్‌లోని ముస్లిం ప్రజలను భయభ్రాంతులకు గురిచేసి, బిజెపికి ఓటు వేయడం తప్ప గత్యంతరం లేని స్థితికి కారణమైన మోడీ ప్రజాస్వామికవాదా? ఈ సందర్భంలో ఒక విలేకరి 2002లో మోడీ అధికారంలో ఉన్నప్పుడు జరిగిన మత ఘర్షణలను గుర్తు చేయగా... నేను రాజకీయాలు మాట్లాడటం లేదని, అభివృద్ధి కార్యక్రమాలనే చెబుతున్నానని హజారే అన్నారు. కార్పొరేట్ దోపిడీని ధర్మబద్ధ సంపదగా హజారే భావిస్తున్నట్లు ఉంది. అంతేకాకుండా మోడీ అనుసరిస్తున్న సామ్రాజ్యవాద నమూనా అభివృద్ధి పట్ల హజారేకు అభ్యంతరం లేదన్నట్లుగానే అర్థం చేసుకోవల్సి ఉంది. రాజకీయాలకు వ్యతిరేకంగా అవినీతి ఉద్యమం అంటున్న హజారే రాజకీయ బాబాగా గుర్తించబడే రామ్‌దేవ్‌ను దీక్షా శిబిరంలోకి ఎలా ఆహ్వానించారు?

సంస్కరణల యుగంలో అవినీతి వ్యవస్థాగతమై పోయింది. గత రెండు దశాబ్దాల అభివృద్ధికి ప్రధాన ఇంధనం అవినీతే అంటే అతిశయోక్తి కాదు. పేద ప్రజలకు వ్యతిరేకమైన ఆర్థిక సంస్కరణలకు, వ్యవస్థాగత మార్పులకు ప్రతిఘటన రాకుండా ఉండడం కోసం అవినీతిని ఇన్సెంటివ్‌గా చూపించారు. అడ్డగోలుగా సంపాదించుకోవడానికి అవకాశం కల్పించారు. ఫలితంగా వ్యవస్థకు బయట ఉండిన అవినీతి సంస్కరణలలో భాగంగా (ఇన్‌బిల్ట్‌గా) మారిపోయింది. తర్వాత ఇంకాస్త ముందుకు వెళ్లి అవినీతి కోసమే విధానాలు (ప్రాజెక్టులు) రూపొందించే కొత్త సంస్కృతి వచ్చింది. ఇలాంటి సంస్కృతిలో భాగమై, లబ్ధిపొందిన వారిలో పలువురు నాయకులు, పారిశ్రామికవేత్తలు ఇప్పుడు అవినీతి వ్యతిరేక పోరాటంలో ముందుండటానికి ప్రయత్నించడం విశేషం. 'మూడు తరాల నుంచి వ్యాపారంలో ఉంటున్నా మాకన్నా నిన్నా మొన్నా వచ్చిన అతి మామూలు వాళ్లు నాలుగైదేళ్లలోనే వందల కోట్లకు పడగలెత్తారు. ఇప్పుడు వాళ్లే అవినీతి వ్యతిరేక పోరాటానికి మద్దతుగా ముందు వరుసలో నిలుస్తున్నారు. దీన్ని ఎలా అర్థం చేసుకోవాలో అంతుపట్టడం లేదు' అని ప్రఖ్యాత పారిశ్రామికవేత్త రాహుల్ బజాజ్ వాపోయారు. సి.ఐ.ఐ., ఫిక్కీ వంటి కంపెనీల సమాఖ్యలు ఇప్పుడు హజారే అవినీతి పోరాటానికి మద్దతు ప్రకటించాయి. సెజ్‌ల పేరుతో అప్పనంగా రైతుల భూములు లాక్కుని, రియల్ ఎస్టేట్ వ్యాపారంతో కోట్లకు పడగలెత్తిన వారు, మీడియాను అడ్డుపెట్టుకొని భూముల్లో పాగా వేసినవారు సైతం అవినీతి వ్యతిరేక పోరాటానికి ఛాంపియన్లుగా అవతారమెత్తడం గమనార్హం. హజారేకు మేము మద్దతునిస్తున్నామంటూ ముందుకొస్తున్న కొందరిని చూస్తుంటే నవ్వాలో ఏడవాలో అర్థం కావడం లేదు.

సంస్కరణల యుగం తెచ్చిన ప్రధాన మార్పు క్రోనీ క్యాపిటలిజం (ఆశ్రిత పెట్టుబడిదారీ విధానం). అంటే ప్రభుత్వంలో ఉన్నవారు, వ్యాపారవేత్తలు కుమ్మక్కై పరస్పర ఆర్థిక ప్రయోజనాల కోసం పని చేయడం. అంటే ప్రభుత్వంలో ఉన్న వారు తమ చేతిలోని అధికారంతో పారిశ్రామికవేత్తలకు కావాల్సిన అనుమతులు ఇస్తారు. పనులు చేస్తారు. అందుకు ప్రతిఫలంగా వారికి వ్యాపారవేత్తలు ఆర్థిక ప్రయోజనాలు అందిస్తారు. ఈ క్రోనీ క్యాపిటలిజం విస్తృతికి, తత్ఫలితంగా పడగవిప్పిన అవినీతి విశ్వరూపానికి, తెరపైకి వచ్చిన నయా కోటీశ్వరులకు ఆంధ్రప్రదేశే ప్రత్యక్ష సాక్ష్యం. ఇలాంటివాటిలో భాగస్వాములైనవారూ, క్షణాల్లో బిలియనీర్లుగా మారిపోయిన వారూ ఇప్పుడు అవినీతి వ్యతిరేక పోరాటం చేస్తామంటుండటం గమనార్హం. కానీ, ఈ రాజకీయ నాయకులను నమ్మేదెవరు? అవినీతిపూరిత వ్యవస్థలో బతుకుతున్నప్పటికీ జనం అవినీతిని ఏవగించుకుంటున్నారు. సరైన వ్యక్తి వచ్చినపుడు వెంట నిలుస్తున్నారు. హజారేకు లభించిన మద్దతే అందుకు నిదర్శనం. అదే సమయంలో అవినీతికి ప్రధాన కారకులైన రాజకీయ నాయకులు మాత్రం ప్రజలను అర్థం చేసుకోలేక వెనకబడి పోతున్నారు. హజారే శిబిరానికి వెళ్లడానికి ప్రయత్నించిన చౌతాలా, అజిత్‌సింగ్, ఉమాభారతిలను కార్యకర్తలు వెనక్కు పంపడమే ఇందుకు నిదర్శనం.

'నేను కూడా అవినీతికి వ్యతిరేకంగా పోరాడతాను, మద్దతిస్తాను' అని ఎవరికి వారు ప్రకటించగానే నమ్మే కాలం ఎప్పుడో పోయింది. చేసిన తప్పులకు చెంపలేసుకుని ... 'అవినీతికి పాల్పడ్డాం, ఇంత సొమ్మును మెక్కేసాం, అక్రమ సంపాదనను తిరిగి ప్రభుత్వానికి అప్పగిస్తాం' అని ఉంటే, ఈ నేతలను నిజంగా నమ్మే వాళ్లేమో! కానీ అలా అనగలిగేంత ధైర్యం వాళ్లకుందా? అది మన నేతలకు లేకపోవడం వల్లే జనం వారి వెంట నిలబడడం లేదు. 'శరద్‌పవార్‌పై నేను పోరాడినప్పుడు బిజెపి, శివసేన నా చుట్టూ తోక ఊపుకుంటూ తిరిగాయి. ఈ పార్టీలపై పోరాడితే వాటి ప్రత్యర్థులు నాకు మద్దతు ప్రకటిస్తారు. మేం చేస్తున్న పోరాటం నుంచి ఖ్యాతి పొందాలని వీరు ప్రయత్నిస్తారు. ఈ ఉద్యమంలో పాల్గొనే వారికి స్వచ్ఛమైన ఆచారం, నడవడిక, వ్యవహార శైలి ఉండాలి. నిష్కళంకులు, నీతిపరులు కావాలి' అని హజారే స్పష్టం చేశారు. అయినా, హజారే వ్యవహార శైలి, అతని చుట్టూ తిరుగుతున్న వ్యక్తుల చరిత్రలను ఎరిగినవారు ఒకింత అసహనాన్నే వ్యక్తం చేస్తున్నారు. కార్పొరేట్ శక్తులు, ప్రతిపక్షాలు ప్రభుత్వాన్ని బ్లాక్‌మెయిల్ చేయాలను కుంటుంటే ప్రభుత్వమేమో అవినీతి వ్యతిరేక ఉద్యమాన్ని పక్కదారి పట్టించే ప్రయత్నాలు చేస్తుంది. దిగ్విజయసింగ్ పౌర సమాజం పక్షాన సంయుక్త కమిటీలో ఉన్న శాంతి భూషణ్, ప్రశాంత్ భూషణ్, హజారేలపై ఆరోపణలు చేయడం, వాటిని పార్టీ శ్రేణులు సమర్థించడం చూస్తుంటే కాంగ్రెస్ కుటిలత్వం అర్థమవుతుంది. శాంతి భూషణ్ లోగడ ఇందిరా గాంధీకి వ్యతిరేకంగా కోర్టుల్లో వాదించాడు. అంతేగాకుండా మానవ హక్కుల కేసులో అవినీతి వర్గాలను, ప్రభుత్వాలను తన న్యాయ పరిజ్ఞానం ద్వారా ముప్పు తిప్పలు పెట్టారు. భూషణ్‌పై లేనిపోని ఆరోపణలు చేసి బలహీన పర్చాలన్నది ప్రభుత్వం ఎత్తుగడగా కనిపిస్తోంది. లోక్‌పాల్ బిల్లును గట్టెక్కించాల్సిన ఎం.పి.ల్లోనే 150 మందికి నేర చరిత్ర ఉంది. 72 మందిపై హత్య, అత్యాచారం వంటి తీవ్రమైన అభియోగాలున్నాయి. లోక్‌పాల్ బిల్లు రూపొందించడానికి ఏర్పాటైన 'సంయుక్త ముసాయిదా సమితి' లోని మంత్రులపైన కూడా ప్రజలకు అనేక సందేహాలున్నాయి. వారంతా సామ్రాజ్యవాద ఏజెంట్లేనన్నది జగద్విదితం.

**దేశ ప్రజలను రకరకాల ప్రలోభాల మత్తులో ఉంచి పబ్బం గడుపుకుంటున్న పాలకుల కుటిల ఎత్తులను అర్థం చేసుకొని పోరాడే దాకా ఈ అవినీతి కొనసాగుతూనే ఉంటుందని అంటున్నారు జి. లచ్చయ్య**

# అవినీతి - పౌర సమాజం - నైతికత

'అన్నా హజారేకు సోనియా గాంధీ, మన్మోహన్ సింగ్ మద్దతు' అనే వార్త ఏప్రిల్ ఒకటిన అయితే వచ్చేదేమో! కాని హజారే దీక్షను ఏప్రిల్ 5న ప్రారంభించడంతో ఈ వార్తా శీర్షికను చదివే భాగ్యాన్ని భారతీయులు నిజంగా కోల్పోయారు. దేన్నైనా సొమ్ము చేసుకోవడంలో ఆరితేరిన అవినీతిపరులున్న దేశంలో ఇలాంటి వార్తలు వింత కాదు. ఇలాంటి కథనాలు హజారే దీక్ష సందర్భంగా చదివి ఆశ్చర్యపోవాల్సిన పని బుద్ధిజీవులదైంది. యెడ్యూరప్ప, గాలి జనార్ధనరెడ్డి, జగన్, చంద్రబాబుల దాక మద్దతు పొందడమే కాకుండా కార్పొరేట్ దిగ్గజాలు నారాయణమూర్తి నుంచి మొదలుకుంటే బడా పెట్టుబడిదారులైన రాహుల్ బజాజ్, బయోకాన్ గ్రూప్ చైర్మన్ మజుందర్ షా, గోద్రేజ్ గ్రూప్ చైర్మన్ ఆదీ గోద్రేజ్ దాకా మద్దతు తెల్పడాన్ని చూస్తుంటే ఈ దేశంలో అసలు అవినీతి పరులెవరో తెలియని స్థితి ఏర్పడింది. జెడి (యు) నేత శరద్ యాదవ్ కూడా జంతర్ మంతర్ దగ్గరకు మద్దతు తెల్పడానికి వెళితే అన్నా హజారే వారించడం, రాజకీయ వాదుల మద్దతు వద్దనడం సంతోషాన్ని కలిగించింది. కాని ఈ సంతోషం నాలుగు రోజుల్లోనే గుజరాత్ ముఖ్యమంత్రి నరేంద్ర మోడిని మెచ్చుకోవడంతో నీరుగారి పోయింది.

దేశంలో అవినీతికి వయస్సు లేదు. నాలుగు దశాబ్దాలు కాదు - 1947కు ముందూ, తర్వాతా అవినీతి ఉన్నట్లు, కొనసాగుతున్నట్లు మనకు అనేక కథనాలు ఉన్నాయి. జవహర్‌లాల్ నెహ్రూ గురించి అందరూ పొగుడ్తూ ఉంటారు. స్వాతంత్ర్య పోరాట యోధుడే కాక, నవభారత నిర్మాత అని కొనియాడే వాళ్లకు లెక్కేలేదు. కాని 1948లోనే ఆర్మీజీపుల కుంభకోణంలో ఇరుక్కున్న కృష్ణ మీనన్‌ను తన మంత్రివర్గంలో చేర్చుకొని గౌరవించాడు నెహ్రూ. ఈ కుంభకోణంపై ఏర్పాటైన నాటి కాంగ్రెస్ సబ్-కమిటీ రిపోర్ట్‌ను కూడా వెలుగు చూడనీయ లేదు నెహ్రూ. ఆయనకు ఆర్థిక మంత్రిగా పనిచేసిన టి.టి. క్రిష్ణమాచారిపై, గనుల, ఇందన శాఖ మంత్రిగా పనిచేసిన కె.డి. మాలవీయ పై ఇలాంటి ఆరోపణలు వచ్చినా, సంబంధించిన కమిటీ రిపోర్టులను నెహ్రూ కూడా వెలుగు చూడనీయలేదనే ఆరోపణలు ఉన్నాయి. నెహ్రూ వద్ద కార్యదర్శిగా పనిచేసిన మత్తయ్ రచనలు చదివితే నెహ్రూ ఎలాంటి పార్లమెంటేరియనో అర్థం కావడమే కాకుండా, చైనా యుద్ధానికి ఎలా కారకుడో కూడా అర్థమవుతుంది.

నెహ్రూ తర్వాత ఆయన వారసురాలైన ఇందిరాగాంధీ గురించి దాదాపుగా అందరికీ తెలిసిందే. బంగ్లాదేశ్ యుద్ధం తర్వాత ఇందిరాగాంధీని 'దుర్గ'గా కీర్తించిన రెండు సంవత్సరాలకే అంటే 1975, జూన్ 25న అత్యయిక పరిస్థితి (ఎమర్జెన్సీ) విధించి ఆమె తన నిజ స్వరూపాన్ని నిరూపించుకున్నది. ఆమె మరణానంతరం సానుభూతితో పదవిలోకి వచ్చిన రాజీవ్‌గాంధీ స్వయంగా బోఫోర్స్ కుంభకోణంలో

వ్యవస్థీకృతమైన అవినీతి మూలాలు పరిష్కరించకుండా పై పై చర్యల ద్వారా తగిన పరిష్కారం దొరకదు. అనేక విధాలైన ఆర్థిక దోపిడీపై ఆధారపడిన భూస్వామ్య ధనస్వామ్య వ్యవస్థ సరళీకరణ యుగంలో మరీ దుర్గంధభరితమై, దుర్మార్గమైపోయిందనేది అసలు వాస్తవం. ప్రపంచబ్యాంక్ నిర్దేశిత విధానాల అనివార్య ఫలితం అవినీతి అని అంతర్జాతీయ అనుభవం చెబుతుంది. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ అంటేనే అవినీతి నేరాల సరళీకరణ తప్ప పరిష్కారాల సరళీకరణ కాదు. అవినీతిపరులను శిక్షించడం ద్వారా మాత్రమే అవినీతిని అరికట్టలేము. అందుకు తగిన సామాజిక సంస్కృతి సమాజంలో చోటుచేసుకోవాలి. అందుకు తగ్గట్టు అవినీతి వ్యతిరేక ప్రజా సాంస్కృతిక ఉద్యమాలు, ఉనికిలోకి రావలసి ఉంటుంది. అలాంటి ప్రజా సాంస్కృతిక వాతావరణం, చట్టాలు, నియంత్రణ సంస్థలు ఉండాలి. అవి నిరంతరం సమకాలీన ప్రజావసరాలు తీర్చే విధంగా మెరుగుపడేందుకు చైతన్యవంతమైన ప్రజా ఉద్యమాలు తప్పనిసరి.

అవినీతిపై నిజాయితీతో, లోతుల్లోకి వెళ్లి చర్యలు తీసుకుంటే రాజకీయ అధికార వ్యవస్థలోని వేలాది అవినీతి తిమింగలాలు బయట పడతాయి. అంతేకాక, అవినీతితో అంతస్సంబంధం ఉన్న మాఫియా, నేర వ్యవస్థ మూలాలు కదిలిపోతాయి. అందుకే ఈ పోరాటాన్ని విస్తృతం చేస్తే అన్నాహజారే అన్నట్టు 'నల్ల ఆంగ్లేయులపై జరిపే రెండవ స్వాతంత్ర్య ఉద్యమమే' అవుతుంది. అందుకు మరింత జన చైతన్యం అవసరం. అవినీతిరహిత పాలన ప్రజల ప్రజాస్వామిక హక్కు. అందువలన వ్యవస్థీకృత అవినీతిని సంఘటితంగా ఢీకొనాలి. దానికి ప్రజల మద్దతు చాలా కీలకం. అది పౌర సంఘాల ద్వారా మాత్రమే జరిగే పని కాదు. చైతన్యవంతమైన, నిబద్ధత కలిగిన ప్రజా సంఘాలు, మేధావులు, రాజకీయ పార్టీలు, ప్రజాస్వామికవాదులు ఉమ్మడిగా ప్రజా ఉద్యమాన్ని నిర్మించాలి. అప్పుడే అవినీతి కొంతవరకు తగ్గుతుంది. లేకుంటే జనలోక్‌పాల్ తిరిగి గుంటనక్కల పాలు అవుతుంది.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)* వీ

ఇరుక్కోవడం తెలిసిందే! (ఇందులో రాజీవ్‌గాంధీకి సంబంధం లేదని ఈ మధ్యన వచ్చిన కథనాలు ఎంత మేరకు నమ్మాలో అందరికీ తెలిసిందే) ఇక పి.వి. నర్సింహారావు తెహల్కా టేపుల్లో ఇరుక్కున్నది గుర్తించిందే! పోతే మొరార్జీ దేశాయ్, వి.పి. సింగ్ బహుశా ఎలాంటి ఆరోపణలు ఎదుర్కోలేదేమో! పోతే వి.పి. సింగ్ స్వయంగా అవినీతి నిర్మూలన నినాదంతోటే కాంగీ నుంచి బయటకు రావడం జరిగిందనేది గమనార్హం. ఇదే పంథాలో నేడు రామ్‌దేవ్ బాబా స్వాభిమాన్ యాత్రను మొదలు పెట్టాడు. ఈయన రాజకీయం ఎలా ఉంటుందో వేచి చూడాల్సిందే.

ఇకపోతే సౌమ్యుడు, మితభాషి మన్మోహన్ సింగ్ గురించి ఇంట్లో స్వయంగా ఆయన భార్య చేసిన వంట తింటూ, అతి సాధారణ జీవితం గడుపుతాడనేది ప్రచారం. ఇందులో వాస్తవముంటే ఉండవచ్చు. అయితే ప్రధానమంత్రిగా ఆయన ఎవరి ప్రయోజనాలను కాపాడుతున్నాడనేది ప్రధానం. పి.వి. నర్సింహారావు ప్రధానమంత్రి కొలువులో ఆర్థిక మంత్రిగా ఉన్న ఈ మాజీ రిజర్వ్ బ్యాంక్ గవర్నర్ చలవ చేతనే ఈరోజు దేశం ఈ సౌభాగ్యపు స్థితినెదుర్కుంటోంది. ఆయన పనిచేస్తున్నది సోనియా నాయకత్వాన్ని కాపాడి కొనసాగించడానికీ, ఈ అధినాయకురాలును నమ్ముకున్న అనుచరగణాన్ని, వారి సంపదను రక్షించడానికే.

భారతదేశపు రాజకీయ నాయకులు మూడు రకాల విధానాలపై పనిచేస్తారని నాలుగు దశాబ్దాల క్రితం ప్రొఫెసర్ మెర్రిజోన్స్ అన్న మాటల్ని ఈ సందర్భంగా గుర్తించుకోవాలి. అవి సనాతన, ఆధునిక, ఆధ్యాత్మిక చింతనలని విశ్లేషించడం జరిగింది. కాని ఇవేవి ఈనాటి రాజకీయ నాయకులకు వర్తించవని గత నాలుగు దశాబ్దాల కాలంలోనే నిరూపణ జరిగింది. ఒక్క రాజకీయ నాయకుల్లోనే కాదు, అవినీతిని భారతీయ సంస్కృతిగా మార్చివేసిన ఘనత ఈ రాజకీయ నాయకులదే. దీనికి నేడు తమిళనాడులో జరుగుతున్న ఎన్నికల ప్రచారాలు, వాగ్దానాలే చక్కని ఉదాహరణ. దేశాన్ని తాకట్టు పెట్టైనా వరాల జల్లులు కురిపించి, పదవిలోకి వచ్చిన తర్వాత దోచుకోవడం, దాచుకోవడానికి అలవాటు పడిన నేతలున్న ఈ దేశంలో పౌరులే నీతి నియమాలను రూపొందించుకోవాలి. ఈ పనిని ప్రజలెక్కడ చేసుకుంటారోనని భయంతోటే, వీధికో బెల్టుషాపును పెట్టి ప్రజల్ని మత్తులో ముంచుతున్న గాంధీ వ్యవస్థ మనది.

ఇక ఈ దేశ యువత గురించి, వారి మనస్తత్వం గురించి, వారి భవిత గురించి ఎంత తక్కువ మాట్లాడుకుంటే అంత తక్కువ మంచిది. నేటి తరాన్ని, రేపటి అమెరికా పౌరులుగా తీర్చిదిద్దుతున్న విద్యా విధానం, మత్తెక్కించే ఆధునిక సంస్కృతీ విధానాలు, ప్రచార సాధనాలు యువతను ఎంత పెడధోరణి పట్టించాలో అంతకంటే ఎక్కువే పనిచేస్తున్నాయి. పక్కదారి పట్టిస్తున్నాయి. ఇక అన్నింటికి మించి ప్రపంచంలో ఏ దేశం ఎక్కించనంత క్రికెట్ మత్తును భారతీయ యువకుల కెక్కిస్తూ నిద్రమత్తులో ఊగిస్తున్న పాలకులను కనీసం ప్రశ్నించే స్థాయిలో యువత లేకపోవడం ఈ దేశ ప్రజల దౌర్భాగ్యం కాదా! మొన్నటి హజారే దీక్ష శిబిరం జంతర్ మంతర్‌ను ఈజిప్ట్ తెహ్రీర్ స్క్వేర్‌తో పోల్చిన మీడియా, మొన్న జరిగిన ప్రపంచ (బిచ్చమెత్తుకునే దేశాల ప్రపంచం) కప్పు సందర్భంగా భారత యువతనే కాదు, యావత్ ప్రజానీకం మత్తుకు గురైన అంశాన్ని మర్చిపోయింది. 1921లో గాంధీజీ కూడా బ్రిటిష్ పాలకులకు వ్యతిరేకంగా విద్యార్థులు పాఠశాలల్ని, కళాశాలల్ని బహిష్కరించాలని, లాయర్లు కోర్టుల్ని బహిష్కరించాలని, ఉద్యోగస్తులు ప్రభుత్వ సర్వీసులకు రాజీనామాలను చేసి నిరసన తెలపాలని పిలుపునిస్తే రవీంద్రనాథ్ టాగూర్ లాంటి వారు కూడా వ్యతిరేకించారు. ఆనాడు గాంధీజీకి వచ్చిన స్పందన అంతంత మాత్రమే! కానీ, అన్నా హజారేకు ఆ అయిదు రోజులలో వచ్చిన స్పందన అమోఘమనే చెప్పాలి. కాని క్రికెట్‌కు వచ్చిన స్పందనతో పోలిస్తే హజారేకు వచ్చిన స్పందన ఎంత అని బేరీజు వేసుకుంటేనే కాని ఈ దేశ పౌర సంస్కృతి అర్థం కాదు.

ఇకపోతే ఈ ఉద్యమం సందర్భంగా అన్నా హజారేకు రవీంద్రనాథ్ టాగూర్ పేరున ఇచ్చే ప్రపంచ శాంతి బహుమతిని వెనువెంటనే ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ప్లానింగ్ అండ్ మేనేజ్‌మెంట్ కోటి రూపాయలను ప్రకటించడం గమనార్హం. ఈ అవార్డును హజారే ఆహ్వానించడం, దాన్ని 9 మే 2011న ఆయన అందుకోబోవడం ఆలోచించాల్సిన అంశాలే. ఈ అవార్డును ఏ శాంతికాముకులో, ప్రజాస్వామికవాదులో ఇస్తే అంత సమస్య కాకపోవచ్చు. ప్రపంచస్థాయిలో పేరు ప్రఖ్యాతులున్న ఈ సంస్థ ప్రపంచస్థాయి బిజినెస్ గ్రాడ్యుయేట్లను ఉత్పత్తి చేస్తోంది. ఇందులో సామాన్యులు చదువుకునే అవకాశమే లేదు. ఈ సంస్థపై ప్రభుత్వ నియంత్రణ లేదు. వివిధ ప్రపంచ బిజినెస్ స్కూళ్లతో, విశ్వ విద్యాలయాలతో అనుబంధం గలిగిన ఈ సంస్థ నుంచి బయటకు వచ్చిన కొంతమంది సాలీనా 15 నుంచి 18 లక్షల రూపాయల వేతనాన్ని పొందుతుంటారు. దీన్ని బట్టి ఈ సంస్థ ఏ లక్ష్యంతో, ఏ దృక్పథంతో పనిచేస్తున్నదో అర్థం చేసుకోవచ్చు. ఇదే సందర్భంగా ప్రతి సంవత్సరం యాభై మంది గ్రామీణ ప్రాంత యువకులకు గ్రామీణ వ్యవహారాలు, అభివృద్ధి, నాయకత్వ లక్షణాలపై శిక్షణపై ప్రతి నెలా నాలుగు వేల రూపాయలు ఫెలోషిప్‌ను కూడా ఈ సంస్థ ప్రవేశపెట్టబోతున్నది.

ఇదే సంస్థ కిరణ్ బేడీకీ, కృష్ణ అయ్యర్‌కూ, సామాజిక కార్యకర్త ప్రకాశ్ కౌర్‌కూ భారతీయ మానవతా వికాస్ పురస్కారం కింద ఐదు లక్షల రూపాయల చొప్పున ఇవ్వడమే కాకుండా, దేశ ద్రోహ నేరం కింద జైల్లో మగ్గుతున్న డా. బినాయక్ సేన్‌కు, ఆయన భార్య ఇలినాకు కూడా ఇవ్వడం గమనార్హం. అయితే ఇక్కడ గమనించాల్సిన అంశాలు రెండున్నాయి. ఒకటి ఈ సంస్థ ఈ అవార్డుల్ని ఎందుకిస్తుందని. రెండవది, కిరణ్‌బేడి, బినాయక సేన్‌లను ఒకే గాట కింద కట్టడం.

ఇక అన్నా హజారే గుర్తించాల్సిన అంశాలు మరికొన్ని. ఆయన ఉద్యమానికి (దీక్షకు) నిజంగా అనూహ్య మద్దతే లభించింది. ఇది కాదనలేని నిజం. బహుశా గాంధీజీకి కూడా ఇంత స్వల్పకాలంలో ఇంత స్పందన రాలేదు. అయితే ఈనాడు ఉన్న మీడియా ఆనాడు లేకపోవడం ఒకటి అయితే, ఈనాడున్నట్లే పాలక కోవర్టులు. ఆనాడు బ్రిటిషు వారికి భారతీయులు కోవర్టులుగా పనిచేసారు. హజారేకు మద్దతు ప్రకటించిన వారిలో అనుపమ్ ఖేర్, అమితాబ్ బచ్చన్‌లేకాక, సమరయోధులు కూడా ఉన్నారు. కాని ఒక్కరంటే, ఒక్క పద్మ పురస్కార గ్రహీతలు గాని, నామినేట్ ద్వారా రాజ్యసభ సభ్యులైన వివిధ రంగాలకు చెందిన ఎం.పి.లు గాని లేకపోవడం గమనించాలి. వేదికల మీద, జాతీయ పర్వదినాల సందర్భంగా ప్రవచనాలు చెప్పే ఈ బుద్ధిమంతులు ప్రజల సొమ్మును దర్జాగా తింటూ, పాలకపక్షాలకు వత్తాసు పలికే ఈ వర్గానికి అన్నా హజారే దీక్ష పట్టలేదంటే, ఈ దేశంలో రాజకీయాలెంత

ప్రణాళికా బద్ధంగా పనిచేస్తున్నాయో అర్థమవుతోంది. అలాగే బినాయక్ సేన్‌ను బేషరతుగా విడుదల చేయాలని దాదాపు 40 మంది ప్రపంచ వ్యాపిత నోబెల్ బహుమతి గ్రహీతలు భారత పాలకవర్గాన్ని కోరినా, భారత దేశ పద్మ పురస్కార గ్రహీతలకు చీమ కుట్టినట్టు కూడా లేదు. వీరంతా భారత పుత్ర రత్నాలు. వీరి దృష్టిలో ప్రజలే సోమరిపోతులు.

ఇకపోతే ఈ సందర్భంగా గుర్తించాల్సిన అంశం మరొకటి ఉంది. అవినీతి అనేది ఏ ఒక్క రాజకీయ పార్టీకో ఉన్న లక్షణం కాదని. దాదాపు అన్ని రాజకీయ పార్టీలకు ఇందులో భాగస్వామ్యం ఉందనేది చరిత్ర చెపుతున్న పాఠాలు. ప్రత్యామ్నాయ రాజకీయ అవకాశాలు వచ్చినప్పుడల్లా ఈ దేశ ప్రజలు తమ ఓటు హక్కును చక్కగా వినియోగించుకున్నారు. ఇదే నేపథ్యంలో కాంగ్రెస్‌కి ప్రత్యామ్నాయంగా జనతా, జనతాదళ్, ఎన్.డి.ఎ. ప్రభుత్వాలు పాలనకు రాగలిగాయి. కాని ఈ పార్టీలు కూడా గతంలో కాంగ్రెస్ తాను గుడ్డలు కావడంతోటి పార్టీలు మారినా అవినీతి ఆగిపోలేదు. అందుకే 1970లో జయప్రకాశ్ నారాయణ్ 'సంపూర్ణ విప్లవం' అనే నినాదాన్ని ఇచ్చాడు. ఫలితంగా ఎమర్జెన్సీలో ఆయన జైలు జీవితాన్ని అనుభవించాడు. నిజానికి ఇప్పుడు నాలుగు దశాబ్దాలు గడిచినా, అవినీతి అంతమొందకపోగా, అది మరింత వికృత రూపం దాల్చింది. ఈ సందర్భంగా ఈ దేశానికి 'జన లోకపాల్ బిల్లు' పరిష్కారాన్ని చూపగలదా అనేది సందేహం.

నిజానికి ఈ రోజు జరగాల్సింది రాజకీయ ప్రక్షాళన. ఈ దిశగా హజారే ఎందుకు ఆలోచించలేకపోయాడనేది ప్రశ్న. పైగా దీక్ష విరమణ సందర్భంగా నరేంద్ర మోడీ, నితీష్ కుమార్ ప్రభుత్వాలను పొగడడం జరిగింది. తర్వాత, వ్యక్తుల్ని కాదనీ, వారి అభివృద్ధిని పొగిడాననీ హజారే మాట మార్చారు. ఏది ఏమైనా, కేంద్ర ప్రభుత్వం హజారే షరతులను ఒప్పుకున్న ఏప్రిల్ 8ననే, మోడీపై సుప్రీంకోర్టు తీవ్ర వ్యాఖ్యలు చేసింది. 22 నవంబర్ 2005 అర్థరాత్రి ఆంధ్రప్రదేశ్ పోలీసుల సహకారంతో గుజరాత్ పోలీసులు అరెస్టు చేసిన సొహ్రాబుద్దీన్, ఆయన భార్య కౌసర్‌బీలు బూటకపు ఎన్‌కౌంటర్‌లో చంపబడ్డారని, దీని వెనక మోడీ మంత్రివర్గ సభ్యుడైన అమిత్ షాకు సంబంధం ఉందని, వీరితో పాటుగా తులసీరాం ప్రజాపతి అనే మరో వ్యక్తిని రాజస్థాన్ పోలీసుల సహకారంతో 28 డిసెంబర్ 2005న మరో బూటకపు ఎన్‌కౌంటర్ చేసారని సుప్రీం కోర్టు మోడి ప్రభుత్వంపై ఆరోపణ చేసింది. బాబ్రి మసీదు ధ్వంసం తర్వాత జరిగిన గోద్రా మారణకాండతో సంబంధం ఉన్నట్లు ఆరోపణ ఎదుర్కొంటున్న మోడీ ప్రభుత్వం హజారేకు ఆదర్శంకావడం ఆశ్చర్యకరం.

ఈ ఉద్యమం సందర్భంగా హజారేతో వెన్నంటే ఉన్న స్వామి అగ్నివేశ్ ఇప్పటికే ఆజాద్ ఎన్‌కౌంటర్ విషయంగా కేంద్ర ప్రభుత్వంతో కుస్తీ పడుతూనే ఉన్నాడు. మరోపక్క మేధాపాట్కర్ మోడికి వ్యతిరేకంగా పోరాడుతూనే ఉంది. అయినా వీరందరికి జనలోక్‌పాల్ బిల్లుపై దృష్టి మళ్లడం, ఆ బిల్లు అశేష భారత ప్రజానీకానికి మోక్షాన్ని కలిగిస్తుందని నమ్ముతున్నారంటే ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. ఈ దేశంలో చట్టాలకేమి కొదవలేదు. ఇప్పటికే రాష్ట్రాల్లో లోకాయుక్తలున్నాయి. అవి ఎంత మేరకు పనిచేస్తున్నాయో అందరికీ తెలుసు. ఎంతమంది తెల్లచొక్కా వాళ్లని, బ్యూరోక్రాట్లను చువ్వల వెనక్కి తోసిందో తెలుసు. ఇదే గుజరాత్‌లో గత ఏడు సంవత్సరాలుగా ఈ లోకాయుక్త చైర్మన్ పదవి ఖాళీగా ఉంది. అయినా హజారేకు మోడి, ఆయన విధానాలు నచ్చాయి?

ఇప్పటికే ఐక్యరాజ్య సమితికి తలొగ్గి వివిధ చట్టాలకు భారత ప్రభుత్వాలు రూపకల్పన చేసాయి. ఇదే విధంగా అవినీతికి వ్యతిరేకంగా 31 అక్టోబర్ 2003న న్యూయార్క్‌లో జరిగిన సదస్సులో రూపొందించిన అంశాల్ని 2005 నుంచి అమల్లోకి తీసుకురావాలని నిర్ణయించడం కూడా జరిగింది. ఈ సదస్సు జరిగి ఎనిమిది సంవత్సరాలు గడుస్తున్నా, నాటి ఎన్.డి.ఎ. ప్రభుత్వం గాని, నేటి యు.పి.ఎ. ప్రభుత్వం గాని ఈ దిశగా ఆలోచించింది లేదు. పైగా మన్మోహన్‌సింగ్‌ను అమెరికా ప్రభుత్వం సగర్వంగా గౌరవించి పంపించింది.

మానవ హక్కుల రక్షణ చట్టం, బాలల హక్కుల చట్టం, మహిళా హక్కుల చట్టం, సమాచారాన్ని పొందే హక్కు చట్టం, ఈ మధ్యనే వచ్చిన విద్యా హక్కు చట్టం ఏ విధంగా ఈ దేశంలో అమలవుతున్నాయో తెలిసిందే. ఈ దశలో కొత్తగా రూపొందబోతున్న జనలోక్‌పాల్ బిల్లు అమలు ఎలా ఉంటుందో ఊహించవచ్చు. ఇవన్నీ సాధించబడాలంటే రాజకీయ ప్రక్షాళన అనివార్యం అని గుర్తిస్తే తప్ప భారత ప్రజల కష్టాలకు విముక్తి లేదు. దీంతోపాటుగా నైతిక విలువలు గల పౌరసమాజ నిర్మాణం జరగాలి. దీనికనుగుణమైన విద్యా విధాన రూపకల్పన జరగాలి. అప్పుడే అవినీతి లాంటి సమస్యలకు పరిష్కారం లభిస్తుంది. ఇప్పుడన్నా వీటి కోసం ఆలోచిద్దాం. ఏది ఏమైనా, ఈ సందర్భంగా ఈ మాత్రమన్నా ఒక సెక్షన్ ప్రజల్లో స్పందన తెచ్చినందుకు అన్నా హజారే నిజానికి పెద్దన్ననే!

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)* వీ

**రాబోయే సంచికలలో...**

- **భారతదేశ ఆర్థిక అభివృద్ధి - సామాజిక న్యాయం - డా. గోలక్ బిహారీనాథ్**
- **మైక్రో ఫైనాన్స్ సంస్థల పక్షమా? ప్రజల పక్షమా? - సిలువేరు హరినాథ్**
- **స్త్రీ విముక్తి మరో కోణం - ఆశాలత**
- **దేశాన్ని మార్చవలసింది యువతే - వి. హనుమంతరావు**
- **నిర్దిష్ట దృక్పథానికి పునాది ఈ 'కొత్తచూపు' - విద్యాభూషణ్**

ప్రజా ప్రతినిధులనూ, ప్రజాస్వామిక వాదులనూ మొత్తంగా పరిపాలననూ నిలువరించగలిగే శక్తి ఎస్.పి.ఒ.లకూ, సల్వాజుడుం కార్యకర్తలకూ ఎక్కడి నుంచి వచ్చిందని ప్రశ్నిస్తున్నారు **కవితా శ్రీవాస్తవ**

# బాధిత ఆదివాసులను కలవడమే నేరమా?

తన కమిషనర్లు, జిల్లా కలెక్టర్ సంయుక్తంగా వెళ్లి దంతెవాడ జిల్లాలోని తాడిమెట్ల, మోరపల్లి, తిమ్మాపురం గ్రామాలను పర్యవేక్షించాలని మార్చ్ 29, 2011న సుప్రీంకోర్టు ఒక ముఖ్య ఆదేశాన్ని జారీచేసింది. ఈ అత్యున్నత న్యాయస్థానం చొరవతో ప్రభుత్వం దీర్ఘకాలిక ప్రాతిపదికన పనులు చేబట్టి ఆదివాసుల్ని ఆదుకుంటుందని ఆశిద్దాం.

మార్చ్ 11 నుండి 16 వరకు కోబ్రాలు, కోయ కమాండోలు కలిసి పై మూడు గ్రామాల్లో బీభత్సకాండ సృష్టించడం అందరికీ తెలిసిన విషయమే. ఈ విషయంలో ప్రభుత్వం వేసిన పథకం సులభంగా అర్థం చేసుకోవచ్చు. సల్వాజుడుంను, స్పెషల్ పోలీస్ ఆఫీసర్స్ (ఎస్.పి.ఒ.) లను అడ్డుపెట్టుకొని ఆదివాసుల మీద దాడులు చేస్తే, వాళ్లు తమ తమ గ్రామాల్ని విడిచిపెట్టి పారిపోవడమో, సల్వాజుడుం క్యాంపుల్లో చేరిపోవడమో, ఖమ్మం (ఆంధ్రప్రదేశ్)లో గల పునరావాస కేంద్రానికి పోవడమో, అడవి లోతట్టు ప్రాంతాలకు పోయి మావోయిస్టులలో చేరిపోవడమో, అక్కడే స్వంత గ్రామాల్లో ఉండి ఆకలితో చచ్చిపోవడమో ఏదో ఒకటి చేస్తారు. ఈ మాయోపాయం కొత్తదేమీ కాదు. ఇదంతా మావోయిస్టులకు ప్రజల్లోగల పునాది మీద దెబ్బ కొట్టడానికి చేస్తున్నారనేది సుస్పష్టం.

## నమోదైన రాజ్యహింస

ఈ బీభత్సకాండను పి.యు.సి.ఎల్., పి.యు.డి.ఆర్. సంస్థలు స్పష్టంగా 2005లోనే రిపోర్ట్ చేశాయి. డా. బినాయక్ సేన్ ఇచ్చిన రిపోర్ట్‌లో 'రాజ్యం ప్రజల మీద యుద్ధం ప్రకటించింద'ని పేర్కొన్నారు. ఛత్తీస్‌ఘడ్‌లో మానవ హక్కుల ఉల్లంఘనను అనేక సంస్థలు, వ్యక్తులు ఇప్పటికే తమ రిపోర్ట్‌ల ద్వారా బట్ట బయలు చేశారు.

సాధారణంగా సల్వాజుడుం కార్యక్రమం రెండు విధాలుగా కొనసాగుతుంది. మొదటి దశలో, వాళ్లు వందలాది గ్రామాల మీద దాడులు చేసి వాళ్లను ఇళ్ల నుండి, పొలాల నుండి దౌర్జన్యంగా తరిమి వేస్తారు. వాళ్ల ఇండ్లను, ధాన్యపు కొట్లను దగ్ధం చేసి, నోటికాడి కూడు అందకుండా జేస్తారు. ఇక రెండో దశలో, వాళ్లు తమ తమ ఊళ్లకు తిరిగి రాకుండా కట్టుదిట్టం చేసి, ఎటువంటి సహాయమూ, సమాచారమూ అందకుండా చేసి, వాళ్లు 'తమ' (సల్వాజుడుం) లోనో, 'వాళ్ల' (మావోయిస్టు)లలోనో కలవడమో లేదా ఆకలితో చావడమో జరగాలని చూస్తారు. అడవి మీద ఎవరికి పట్టు ఉండాలనేదే వాళ్ల తాపత్రయం.

రాయ్‌పూర్ - జగ్‌దల్‌పూర్ - సుక్మా దారుల గుండా పోయి బాధిత గ్రామాల్ని దర్శించాలని బైటివాళ్లు ఐదుసార్లు చేసిన ప్రయత్నాల్ని అనేక విధాలుగా అడ్డంకులు సృష్టించి విఫలం చేశారు. ఈ నేపథ్యంలో సుప్రీంకోర్టు కమిషనర్లు అక్కడికి వెళ్లగలగడం ఒక పెద్ద పరీక్షనే. ఒకవేళ అక్కడికి వెళ్లగలిగినా బాధితులకు దీర్ఘకాలిక ప్రాతిపదికన సహాయ సహకారాలు అందివ్వగలరా అనేది మరో పెద్ద ప్రశ్న.

ఇతరుల సంగతేమో గాని, సల్వాజుడుం ఏకంగా ఎం.ఎల్.ఎ.లను సైతం ఆపేశారు. మార్చ్ 29నాడు పది మంది కాంగ్రెస్ ఎం.ఎల్.ఎ.లు నిత్యావసర వస్తువుల్ని తీసుకొని బయలుదేరితే వాళ్లను సల్వాజుడుం వాళ్లు తిప్పి పంపారు.

## వాపసొచ్చిన మాజీ హోంమంత్రి

ఆరోజు కాంగ్రెస్ టీంకు మాజీ హోంమంత్రి నందకుమార్ పాటిల్ నాయకత్వం వహించారు. వాళ్లు ఆహార పదార్థాలతో సుక్మా గ్రామం నుండి ఉదయం పది గంటలకు చింతల్‌నార్ వైపుగా బయలుదేరారు. ఈ టీంను సల్వాజుడుం వాళ్లు కలెక్టర్‌ను అడ్డగించిన ప్రాంతం (పోలంపల్లి)లోనే అడ్డగించారు. వాళ్లలో ఇరవై ఐదు మంది ఎస్.పి.ఒ.లు, ఇతర సల్వాజుడుం కార్యకర్తలున్నారు. విచిత్రమేమంటే ఈ టీంకు రక్షణగా ఏకంగా ఐ.జి. లాంగ్ కుమార్ (బస్తర్) రావడం విశేషం. ఆయన సల్వాజుడుం మూకలకు బుద్ధి చెప్పాల్సిందిపోయి, ఎం.ఎల్.ఎ.లకే నచ్చచెప్పాలని చూశాడు. ఇక ముందుకు వెళితే తానేమీ రక్షణ కల్పించలేనని చేతులెత్తేశాడు.

కాని ఎం.ఎల్.ఎ.లు మొండికేశారు. ప్రజాప్రతినిధులైన తమకు ఇవన్నీ సాధారణమేనని, తాము ముందుకే వెళ్తామని భీష్మించుకు కూచున్నారు. అయితే ఐ.జి. లాంగ్‌కుమార్, సల్వాజుడుంను పక్కన బెట్టి, ఎం.ఎల్.ఎ.లందర్నీ అరెస్ట్ చేసి పోలీసు స్టేషన్‌కు తరలించాడు. వాళ్లను ఆ తర్వాత వ్యక్తిగత పూచీకత్తుపై విడుదల చేశాడు. వాళ్లు సాయంత్రం రాయ్‌పూర్‌కు వెళ్లిపోతూ ఈ విషయాన్ని అసెంబ్లీలో లేవనెత్తుతామని ప్రకటించారు.

అంతకుముందు రోజు (మార్చ్ 28) జిల్లా కలెక్టర్ ఆదేశానుసారం దోర్నపాల్ గ్రామానికి చెందిన నాయబ్ తహసీల్దార్ విజేంద్ర పాటిల్ పై మూడు గ్రామాలకు ఆహార ధాన్యాలను తీసుకొని బయల్దేరాడు. సుమారు మధ్యాహ్న ప్రాంతంలో వాళ్లను ఎస్.పి.ఒ.లు, సల్వాజుడుం

కార్యకర్తలు ఆపేశారు. ఎ.ఎస్.ఐ. ధ్రువ్, రోడ్డుకు వేసిన అడ్డకుంల్ని తొలగించాలని ప్రయత్నిస్తే అతడిని అడ్డుకున్నారు.

## స్పెషల్ పోలీస్ ఆఫీసర్స్ (ఎస్.పి.ఒ.)

పోలీసుల అధికార వ్యవస్థలో ఎస్.పి.ఒ.లు అందరి కన్నా తక్కువ స్థాయికి చెందినవారు. కాని అడవిలో వాళ్లే రాజులు. వాళ్లే యుద్ధ ప్రభువులు. మార్చ్ 24న దంతెవాడ జిల్లా కలెక్టర్, డివిజనల్ కమిషనర్లు కలిసి బాధిత గ్రామాలకు ఆహార పదార్థాలు తీసుకుపోతుంటే దౌర్జన్యంగా అడ్డుకున్నారు. వాళ్లు ఎస్.డి.ఎన్.ను కూడా బెదిరించారు. మార్చ్ 26న స్వామి అగ్నివేశ్‌ను రెండు సార్లు అడ్డుకున్నారు. అవమానపరిచారు. ఆయన ఆరోజు అడిషనల్ ఎస్.పి. మార్వారి వాహనంలో ప్రయాణించడం గమనార్హం. ఎస్.పి.ఒ.లు తమ పై అధికారుల మాటల్ని లెక్కచేయకపోవడమే కాదు, వాళ్లపై రాళ్లు రువ్వారు. వాళ్ల వాహనాల్ని ధ్వంసం చేశారు. స్వయంగా ఎ.ఎస్.పి.కి వాళ్లపై ఎఫ్.ఐ.ఆర్. నమోదు చేయించడానికి రెండు రోజులు కష్టపడాల్సి వచ్చిందంటే ఆశ్చర్యపోతాం. సాధారణంగా స్థానిక పోలీసులకు సల్వాజుడుం మీద ఎఫ్.ఐ.ఆర్.లు నమోదు చేయడం ఇష్టం ఉండదు. ఇకపోతే ఐ.జి. లాంగ్‌కుమార్ కూడా వీళ్ల విషయంలో చూసీ చూడనట్టుగా ఉంటాడు.

ఇప్పటిదాక బాధిత గ్రామాల్ని దర్శించడానికి సుక్మా ప్రాంతం నుండి బయలు దేరే వాళ్లని ప్రభుత్వమే అడ్డుకునేది. మార్చ్ 20, 21 తేదీలలో అక్కడికి వెళ్లడానికి ప్రయత్నించిన 'టైమ్స్ ఆఫ్ ఇండియా', 'ది హిందూ' పత్రికా విలేకరులను పోలీసులు అడ్డుకున్నారు. వాళ్లు అక్కడికి చేరుకోవడానికి మరో కష్టతరమైన, సుదీర్ఘమైన బాటను ఎంచుకోవాల్సి వచ్చింది. ఆఖరికి అఖిల భారత ప్రజాస్వామిక హక్కుల సంస్థకు కూడా తిప్పలు తప్పలేదు. వాళ్లు స్వామి అగ్నివేశ్ బయలుదేరే తేదీలనే ఎంచుకొని ఆయన లాగే మూడోమార్గం గుండా వెళ్లి నిజనిర్ధారణ చేయగలిగారు.

ఈ ప్రాంతంలో 'నిజ నిర్ధారణ' కేవలం సెప్టెంబర్ 2009లో మాత్రమే చేయగలిగారు. గ్రీన్‌హంట్ ఆపరేషన్‌లో సి.ఆర్.పి.ఎఫ్., ఇతర పోలీసులు గలిసి గోంపడ్ ప్రాంతంలో పదహారు మందిని చంపేశారు. అప్పుడు పీపుల్స్ యూనియన్ ఫర్ డెమోక్రటిక్ రైట్స్ (పి.యు.డి.ఆర్.) వాళ్లు అతికష్టం మీద అక్కడికి వెళ్లి నిజనిర్ధారణ చేయగలిగారు. ఆ తర్వాత ఇంకెవరినీ అనుమతించలేదు. (సోమిశెట్టి గ్రామంలో డిసెంబర్ 5, 2009న జరిగిన సామూహిక అత్యాచారం విషయంలో పరిశోధించడానికి ప్రయత్నించిన ఒక స్త్రీల సంస్థను అక్కడికి అనుమతించ లేదు. అక్కడికి వెళ్లాలని చూసిన ప్రొఫెసర్లు నందినీ సుందర్, ఉజ్జల్ కుమార్‌లను దంతెవాడ, సుక్మా ప్రాంతాల నుండి తరిమేయడమే గాక 2010 కొత్త సంవత్సరం సందర్భంగా హోటళ్లలో ఎక్కడా చోటు దొరక్కుండా చేశారు. ఆ తర్వాత మేధాపాట్కర్, సందీప్ పాండేలతో కలిసి జనవరి 2010 నాడు వెళితే వాళ్లను విపరీతంగా వేధించారు. ఆదివాసుల గోడు విందామనుకున్న వాళ్లను స్వేచ్ఛగా తిరుగనీయలేదు. మే 2010న ప్రొ. యశ్‌పాల్ నాయకత్వంలో వెళ్లిన నలభై మంది టీంకు కూడా ఇదే గతి పట్టింది.)

## అత్యవసర ప్రశ్నలు

సుప్రీంకోర్టు కమిషనర్లను హెలికాప్టర్ ద్వారా ఆ ప్రాంతాలకు తీసుకుపోగలరనుకుందాం. కాని, వాళ్లకు ఆయా ప్రాంతాలకు చెందిన వాస్తవ విషయాలు తెలిసిన విలేకరులు గానీ, స్థానిక ప్రజలు గానీ అందుబాటులో ఉండరు. ఒకవేళ అక్కడికి పోగలిగినా ఆదివాసులకు నిరంతరం ఆహార పదార్థాల్ని సరఫరా చేయగలరా? వీటిని ఎవరు అజమాయిషీ చేస్తారు? ఎవరైనా స్వేచ్ఛగా బాధిత గ్రామాలకు వెళ్లగలిగినపుడు మాత్రమే అక్కడేం జరుగుతుందో మనకు తెలుస్తుంది.

ఇక జాతీయ ఛానెళ్ల విషయానికొద్దాం. ప్రభుత్వమూ, సల్వాజుడుం సంయుక్తంగా జరిపే దమనకాండలో 'తక్కువ మనుషులు' (ఆదివాసులు) ఘోరంగా చంపబడినా, అత్యాచారం గావించబడినా, వాళ్ల ఇళ్లు, ధాన్యపు కొట్లు దగ్ధం చేయబడినా, చెట్ల కింద బతుకుతున్నా, ఆకలి చావులకు గురవుతున్నా సదరు జాతీయ ఛానెళ్లకు చీమకుట్టి నట్టయినా ఉండదు. వాళ్లివన్నీ సులువుగా మర్చిపోతారు. మావోయిస్టులు మళ్లీ దాడులు చేస్తారనుకోండి. ఇక ఛానెళ్లన్నీ గుండెలు బాదుకుంటూ వాళ్ల మీద విరుచుకుపడుతూ సంచలన వార్తల (బ్రేకింగ్ న్యూస్)ను పదే పదే ప్రచారం చేస్తాయి. నిరుపేద ఆదివాసుల్ని ఉగ్రవాదులుగా, రాక్షసులుగా, హంతకులుగా చిత్రీకరిస్తాయి. అంతేకాదు, మానవ హక్కుల కార్యకర్తల మీద గొంతుచించుకుని అంతెత్తున ఎగిరిపడతాయి.

ఇపుడు జరుగుతున్న, జరగబోయే ఘటనలకు, దమనకాండకు ఛత్తీస్‌ఘడ్ ప్రభుత్వానిది బాధ్యత కాదా? ఇవన్నీ జరుగకుండా మనమంతా ముక్తకంఠంతో నినదించాలి.

*(కవితా శ్రీవాత్సవ పి.యు.సి.ఎల్., రాజస్థాన్‌లో ప్రధాన కార్యదర్శిగా ఉన్నారు. ఆమె. పి.యు.సి.ఎల్. తరఫున 'ఆహారంపై హక్కు' (రైట్ టు ఫుడ్) గురించి సుప్రీం కోర్టులో పిటిషన్ వేశారు.)*

*(స్వేచ్ఛానువాదం ఉదయమిత్ర, కవి)*

ప్రజాభిప్రాయ సేకరణ కోసమంటూ వచ్చిన శ్రీకృష్ణ కమిటీ, ప్రజల అభిప్రాయాలతో సంబంధం లేకుండా పాలకులకు అనుకూలంగా వ్యవహరించిదంటున్నారు **మాడభూషి శ్రీధర్**

# బయటపడిన శ్రీకృష్ణ రెండో నాలుక

అందరూ చదివే బహిరంగ నివేదికలో నీతి వాక్యాలు, న్యాయమనిపించే ధర్మసూత్రాలు. కేవలం హోంశాఖకు రహస్యంగా ఇచ్చిన నివేదికలో తెలంగాణ ఇవ్వకుండా ఉండడానికి కుట్రలు కుతంత్రాలు, పథకాలు పన్నాగాలూ. ఇదా ఒక జస్టిస్ ఇచ్చిన నివేదిక? సుప్రీంకోర్టు మాజీ న్యాయమూర్తి బి ఎన్ శ్రీకృష్ణ రెండు నాల్కల ధోరణిని, పైకి ఒకటి లోపల మరొకటి చెప్పే హిపోక్రసీని రాష్ట్ర హైకోర్టు న్యాయమూర్తి ఎల్. నరసింహారెడ్డి తన తీర్పులో బయటపెట్టారు. బహిరంగ సంప్రదింపుల కమిటీ నివేదికను రహస్యంగా ఉంచడం పౌరుల ప్రాథమిక హక్కుకు విరుద్ధం అని తీర్మానించారు. కీలకమైన అధ్యాయాన్ని పార్టీల ముందు ఉంచకుండా, వారిని అభిప్రాయం చెప్పమనడం సరికాదని, ప్రజాధనంతో పనిచేసిన కమిటీ ప్రజలకు సమాచారం చెప్పకుండా దాచడం వాక్స్వాతంత్ర్యానికి అభిప్రాయ స్వేచ్ఛకు భంగకరమని, నివేదిక రహస్యనోట్‌ను బయటపెట్టి తీరాలని హైకోర్టు ఆదేశించింది. రహస్యంగానే ఉంచడం న్యాయమా, రహస్యంగా ఉంచిన అంశాలు సమంజసమైనవా అనే రెండు ప్రశ్నలను సునిశితంగా పరిశీలించిన తరువాత న్యాయమూర్తి నరసింహారెడ్డి మార్చి 23న చారిత్రాత్మకమైన తీర్పు ఇచ్చారు.

తెలంగాణ ఇవ్వాలా కూడదా అనే విషయంలో ఏ అభిప్రాయం చెప్పినా దాన్ని సహేతుకంగా ఆ నివేదికలోనే సమర్థించుకోవాల్సిన చట్టపరమైన న్యాయబాధ్యత కమిటీపైన ఉంటుంది. కాని ఆ బాధ్యతను కమిటీ వారు గాలికి వదిలేశారు. ప్రజల మధ్య బహిరంగంగా సంప్రదింపులు జరపవలసిన విధిని చట్టమే విధించింది. కనుకనే కోర్టు విచారణలన్నీ పారదర్శకంగా సాగుతాయి. ఒక్క న్యాయవ్యవస్థ మాత్రమే జనం మధ్యపని చేస్తున్నది. ఆ తరువాత అందరి మధ్య పనిచేసే వ్యవస్థ శాసనసభ మాత్రమే. ఆ విధంగా అందరికీ తెలిసేవిధంగా పనిచేయడమే రాజ్యాంగ మౌలిక సూత్రం.

### కమిటీ నివేదిక వెల్లడి బాధ్యత

కోర్టుల్లో తేలడానికి కష్టమైన విస్తృత అంశాలపైన ప్రజా ప్రయోజనం ముడిపడి ఉన్నఅంశాలపైన విచారణ సంఘాలను (నిజనిర్ధారణ) నియమించడం పాలనా న్యాయంలో ఒక భాగం. కమిటీ నివేదికను వెల్లడించడం ప్రభుత్వంపైన ఉన్న చట్టపరమైన బాధ్యత అని 1952 విచారణ సంఘాల చట్టం వివరించింది. జాతీయ భద్రతా కారణాల ఆధారంగా నివేదికను వెల్లడిచేయకుండా ఆపడానికి అధికారం ఇస్తూ ఒక సవరణచేసారు. కాని మరొక సవరణ ద్వారా ఈ అధికారాన్ని తొలగించి నివేదికను దానిపైన తీసుకున్న చర్యలను వివరించడం చట్టపరమైన బాధ్యత అని పునరుద్ఘాటించారు. శ్రీకృష్ణ కమిటీ న్యాయ విచారణ కమిషన్ కాదు. అంతకన్న తక్కువ స్థాయి కమిటీ. కనుక వెల్లడించడం తప్పనిసరి. భారతదేశ చరిత్రలో ఇంతవరకు ఒక ప్రజా సంప్రదింపుల కమిటీ నివేదిక బహిర్గతం చేయకుండా లేదన్న పిటిషనర్ల వాదనను న్యాయమూర్తి అంగీకరించారు. ఈ విషయం న్యాయమూర్తి శ్రీకృష్ణకు తెలియదంటే నమ్మలేము. చట్టం చెప్పిన న్యాయపరమైన ఈ బాధ్యతను గుర్తు చేస్తూ జస్టిస్ ఎల్ నరసింహారెడ్డి రహస్య నివేదికను వెల్లడించాలని కేంద్రాన్ని ఆదేశిస్తూ ఇవ్వడం విశేషం.

ఈ కమిటీ పేరే ఆంధ్రప్రదేశ్ వ్యవహారాలపై సంప్రదింపుల సంఘం. ఇది చేయవలసిన పని సంప్రదింపుల ద్వారా సేకరించిన అభిప్రాయాలను ఆధారం చేసుకుని నిర్మాణాత్మకంగా తగిన సూచనలు చేయడం. 20 కోట్ల రూపాయల దాకా ప్రజాధనం ఖర్చుచేయించిన ఈ కమిటీ ఒక పద్ధతి ప్రకారం సమాచారం సేకరించకపోయినా. తనముందుకు వచ్చిన సమాచారాన్ని పరీక్షించి సరైనదని భావిస్తే దానికి తగిన అభిప్రాయాన్ని ఏర్పరచుకోవడం న్యాయం. కాని ఆ పనిచేయక పోవడం బాధ్యతారాహిత్యమే అవుతుంది. దీన్ని ప్రజాధన దుర్వినియోగం అనవలసిందే. ఈ కమిటీ అడుగడుగునా అర్ధసత్యాలు, అసత్యాలు రాసింది. అభాండాలు వేసింది. చివరకు అనైతికంగా, బాధ్యతారహితంగా అప్రజాస్వామికంగా నివేదిక రచించి దిగజారుడుసూచనలు చేసేందుకు ఏ మాత్రం సిగ్గుపడలేదు. చాలా విలువైన నిజాలను పక్కకు బెట్టడం, ఏమాత్రం ఆధారాలు లేని అనేక అంశాలను పచ్చి నిజాలుగా అభివర్ణించడం, తీరా ఖండించడానికి వీల్లేని నిజాలు చూపితే, అది కావాలని చేసింది కాదనో, అట్లా భావించకూడదనో, దాని వల్ల నష్టం ఇప్పుడు పూడ్చలేమనో, తేలికచేసి వదిలేసారు. ఇదంతా వందలాది పేజీల్లో నింపిన అన్యాయం. ఉదాహరణకు న్యాయాధికారుల ఉద్యోగాలలో తెలంగాణకు తీరని అన్యాయం జరిగిందని లెక్కలతో సహా రుజువు చేస్తే, కమిటీ చెప్పిందేమంటే 'ఒక మాజీ న్యాయమూర్తిని సంప్రదిస్తే ఆయన అదేమీ లేదని అన్నారు. కనుక ఆ అన్యాయం జరగలేదు' అని. దీన్ని బట్టి కమిటీ ఎంత దారుణంగా పక్షపాతాన్ని ప్రదర్శించిందో అర్థం చేసుకోవచ్చు.

### లేని అధ్యాయంలో ఉన్న అన్యాయాలు

అయిదు వందల పేజీల నివేదికలో అసలు సిసలైన ఎనిమిదో అధ్యాయం లేదు. 423వ పేజీలో ఓ డజను లైన్లు మాత్రం రాసారు. అందులో బహిరంగ సంప్రదింపులు జరపలేదనీ, అందరు కమిటీ సభ్యులముందు కాకుండా కేవలం హోంశాఖ మాజీ అధికారి వి కె దుగ్గల్ 17 జిల్లాల అధికారులతో జరిపిన సంప్రదింపులు (లిఖిత

పూర్వకం కాకుండా ఆ సంప్రదింపులు జరిగాయోలేదో, ఎవరు ఎక్కడ ఎవరితో ఏం మాట్లాడారో తెలియదు, రాయలేదు) ఇక ఆ దుగ్గల్ శ్రీకృష్ణ ఒక్కడికే ఆ సారాంశం చెప్పాడా లేక సభ్యులందరితో చర్చించాడా అనేది కూడా రాయలేదు. వీరితో సంప్రదింపుల ఆధారంగా ఒక నోట్ తయారు చేసామని అది రహస్యంగా సీల్డు కవరులో విడిగా హోం మంత్రికి ఇచ్చామని, ఆ అంశాల ఆధారంగానే 9వ అధ్యాయం ఆరు ప్రత్యామ్నాయాలను ఇచ్చామని 423వ పేజీలో కమిటీ స్పష్టంగా పేర్కొంది. అంటే తెలంగాణ భవిష్యత్తును నిర్ణయించేంత ముఖ్యమైన నిర్ణయాన్ని ఒక రహస్య నివేదికలో భద్రపరిచారన్నమాట. పారదర్శకత తో అభిప్రాయాల సేకరణ, సహేతుకమైన నిర్ధారణ, నిష్పాక్షికమైన సిఫార్సులు చేయవలసిన కమిటీ రహస్యాల చీకటిని ఆశ్రయించడం అసమంజసం. ఈ విషయాన్ని రాష్ట్రహైకోర్టు న్యాయమూర్తి ఎల్ నరసింహారెడ్డి సకారణంగా నిర్ధారించారు. కమిటీ పరిశీలనలో సూచనల్లో రహస్యాలకు తావుండరాదని వివరించారు.

శ్రీకృష్ణ కమిటీ నివేదికలో కీలకమైన భాగాన్ని రహస్యంగా ఉంచారంటే దానివెనుక ఎంతో తీవ్రమైన కారణం ఉండే ఉంటుందని అనుకుంటాం. జాతి భద్రత, నక్సలైట్ల సమస్య, మత కలహాల వంటి అంశాలను ప్రస్తావించారనీ అనుకున్నారు. ఒకవేళ ఆ కారణాలే అయితే అందులో దాచవలసిందేమీలేదు. ఆ సమస్యలు బహిరంగంగా అందరికీ కనిపించేవే.

ప్రజా కమిటీ నివేదికలో కొన్ని భాగాలను రహస్యాలుగా కాపాడడ మెందుకు? అని ఈ రచయిత రాసిన ఒక వ్యాసంలోని అంశాల ఆధారంగా దాఖలైన ఒక రిట్ పిటిషన్‌లో భారత ప్రభుత్వం తరపున అటార్నీ జనరల్ వాహనవతి వచ్చి, శ్రీకృష్ణకమిటీకి చట్టబద్ధత లేదని, దాని సిఫార్సులు ఖచ్చితంగా అమలు చేయాల్సిన అవసరం లేదని, హోంశాఖ అంతరంగిక పరిశీలనకు ఇచ్చిన ఒక సమాచారంగా కాకుండా మరే చట్టపరమైన విలువా దానికి లేదని చెప్పి అందరినీ ఆశ్చర్యపరిచారు. అయితే ఎవరిని మోసం చేయడానికి ఈ కమిటీ అని అందరూ ప్రశ్నించారు?

ఈ కేసు విచారణలో భాగంగా ఆ నివేదికను చదివి నిర్ణయించడానికి గాను ఆ రహస్య నోట్‌ను భారత ప్రభుత్వ అదనపు సొలిసిటర్ జనరల్ హైకోర్టు న్యాయమూర్తి నరసింహారెడ్డికి ఇచ్చారు. ఒక రెండు గంటలపాటు న్యాయమూర్తి అందులో అంశాలు చదివిన తరువాత, రహస్యంగా ఉంచడానికి కారణాలు కనిపించలేదనే అభిప్రాయానికి వచ్చారు. కొన్ని భాగాలను చదవి చూడమని ప్రభుత్వ న్యాయవాదికి సూచించారు. ఆయన చదివిన తరువాత ఇదంతా రాయవలసిన అవసరం లేదనే అభిప్రాయాన్ని వెల్లడించారు. ఇది ఎట్లా ఉందంటే ఒక అధికారపార్టీ వ్యక్తి అనుకూలంగా రాసుకున్న నోట్ వలె ఉంది అని వ్యాఖ్యానించారని పత్రికల్లో రాసారు.

ఈ నివేదిక ఎందుకు వెల్లడించకూడదో వివరించే అఫిడవిట్ వేస్తామని ప్రభుత్వ న్యాయవాది చెప్పారు. అందులో భద్రతా కారణాలపైన రహస్యాలను కాపాడాలని వాదించకుండా దేన్నయినా రహస్యంగా ఉంచాలని నిర్ణయించే అధికారం ప్రభుత్వానిదేనని, ఒక ఎగ్జిక్యూటివ్ లేదా లెజిస్లేచర్ నిర్ణయాన్ని సమీక్షించే అధికారం కోర్టులకు లేదని, అయినా సమాచార హక్కు చట్టం ఉండగా దాని ద్వారా రహస్యం వెల్లడించాలని కోరకుండా కోర్టును ఆశ్రయించడానికి వీల్లేదని ప్రభుత్వం వాదించింది. ఈ విధంగా అన్నీ టెక్నికల్ వాదాలే కాని అందులో రహస్యంగా ఉంచడం వల్ల నెరవేరే ప్రజాప్రయోజనం ఏమిటో చెప్పలేదు. సెక్షన్ 123, 124, సాక్ష్య చట్టం ప్రకారం ఇటువంటి అంశాలు దాచే అధికారం తిరుగులేనిదని మరో వాదన లేవనెత్తినా ఈ వాదాన్ని సమర్థించే వివరాలేవీ ప్రభుత్వం చెప్పలేదంటూ కోర్టు ఆ వాదాలను కొట్టివేసింది.

ఆర్టికల్ 19(1)(ఎ) కింద భారత రాజ్యాంగం ఇచ్చిన భావ స్వాతంత్ర్యం, అభివ్యక్తి స్వాతంత్ర్యం విశాలమైందని, సమాచార హక్కు చట్టం ఉన్నంత మాత్రాన రాజ్యాంగం ఇచ్చిన ప్రాథమిక హక్కును అమలు చేసే అధికారం కోర్టుకోల్పోదని న్యాయమూర్తి వివరించారు. ఈ నివేదిక చదివి సరైన అభిప్రాయానికి వచ్చి తమకు తెలియజేస్తే తగిన నిర్ణయం తీసుకుంటామని హోం మంత్రి చిదంబరం అఖిల పక్షం సమావేశంలో చెప్పిన విషయం కోర్టు ఉటంకించింది. కీలకమైన భాగం రహస్యంగా ఉంచితే ఆ యా పార్టీల నాయకులు ఏవిధంగా నిర్ణయం తీసుకుంటారనీ ప్రశ్నిస్తూ, కీలకమైన సమాచారం ఇవ్వకుండా పార్టీల వారు నిర్ణయాలు తీసుకోవాలని కోరడం కూడా భావస్వేచ్ఛకు భంగకరమైన వ్యవహారమని జస్టిస్ నరసింహారెడ్డి వివరించారు.

జస్టిస్ నరసింహారెడ్డి నివేదికలోని రహస్య అధ్యాయం వెలికి తీయాలని ఆదేశించాలంటే అందులోని కొన్ని చర్చించకతప్పడం లేదని అన్నారు. చాలారోజులు నివేదికలో ప్రధానాంశాలు అవసరమైనంత వరకైనా చెప్పాలా లేదా అనే తీవ్ర సంఘర్షణకు లోనైన తరువాత రహస్యం వెల్లడించడం వల్ల ప్రజాప్రయోజనం ఉంటుందని తేల్చడానికి ఆ అంశాలను చెప్పకతప్పలేదని జస్టిస్ వివరించారు. తెలంగాణ రాష్ట్ర సమితిని ఏవిధంగా దువ్వాలో, మీడియాను ఏవిధంగా రాజకీయంగా వాడుకోవాలో, విద్యార్థుల ఉద్యమాలు ఏవిధంగా అణచాలో చెప్పడానికి శ్రీకృష్ణ తన పరిధిని దాటి మితి మీరి వ్యవహరించిందని ఆ రహస్యం తేల్చింది.

ఇక ఆ అంశాలు చదివితే శ్రీకృష్ణ కమిటీ హోంమంత్రికి అనుకూలమైన రీతిలో నివేదిక ఇవ్వడానికి నిష్పాక్షికతను ఏవిధంగా పాతిపెట్టిందో, ఎంత నీతిమాలిన రీతిలో తన స్థాయిని దిగజార్చే విధంగా సూచనలు చేసిందో అర్థమవుతుంది. ఎట్టి పరిస్థితిలోనూ తెలంగాణ రాష్ట్రం ఇవ్వకూడదని ఈకమిటీ చెప్పి ఉంటే దాన్ని వ్యతిరేకించే వారేమో కాని కమిటీ తీవ్రమైన విమర్శలకు గురికాకుండా కాస్త గౌరవంగా ఉండేది. కాని న్యాయమూర్తి శ్రీకృష్ణ ఉన్నత విద్యా సంపన్నులైన సభ్యులు ఆ గౌరవాన్ని కోల్పోవడానికి వెనుకాడకపోవడం విచిత్రం. బొంబాయి అల్లర్లలో నిష్పాక్షికమైన తీర్పు చెప్పి సంపాదించుకున్న ప్రతిష్టను ఫణం పెట్టి ఇటువంటి నివేదిక రాసినందుకు ప్రతిఫలంగా మరో కమిషన్ చైర్మన్‌గా పదవిని పొందారు.

తెలంగాణ న్యాయాన్యాయాల సంగతి వదిలేసి, తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం డిమాండ్ సమంజసమైనదేనని అంగీకరించిన మాట మరిచిపోయి, రెండో ప్రత్యామ్నాయంగా తెలంగాణ ఇవ్వడాన్ని సమర్థించిన విషయం పట్టించుకోకుండా శ్రీకృష్ణ కమిటీ తెలంగాణ ఇవ్వకుండా చేయవలసిన కుట్రలను కుహకాలను సర్కారుకు బోధించడానికి నడుం కట్టడం చాలా హేయమయిన పని. ఈ పని దుగ్గల్ చేసారంటే, ఆయన తను పనిచేసిన ప్రభుత్వ విభాగానికి తన విధేయతను, మంత్రిగారి పట్ల తన భక్తిని చాటుకున్నారని సరిపెట్టు కోవచ్చు. కాని న్యాయ విభాగంలో పనిచేసిన న్యాయమూర్తి న్యాయానికి విధేయత చాటకపోవడం, ఇతర సభ్యులు తమ హోదాకు అనుగుణంగా నిజాలు వక్రీకరించే నివేదికమీద సంతకం పెట్టడం ఏమాత్రం నీతివంతం కాదు.

భూస్వామ్య, ధనస్వామ్య, ముఠాతత్వ రాజకీయాల అసలు సారాన్ని గ్రహించి నిజమైన ప్రజాస్వామ్యం కోసం, ప్రజాస్వామ్యం దిశగా ప్రజలు ఇంకా అడుగులు వేయాల్సే ఉందంటున్నారు **పి. వరలక్ష్మి**

# ఎవరి కోసం ఈ ఉప ఎన్నికలు?

**ఎం.**ఎల్.సి. ఎన్నికల్లో ప్రజాస్వామ్య నాటకాన్ని తనివితీరా రక్తి కట్టించిన నాయకులు ఇప్పుడు కడప జిల్లాలో ఉపఎన్నికల రంగం మీదికొచ్చారు. గతంలో ఎం.పి.నో ఎం.ఎల్.ఎ.నో చనిపోతే ఉపఎన్నికలు వచ్చేవి. తర్వాత నువ్వెంత అంటే నువ్వెంత అని నాయకులు సవాళ్లు విసురుకొని రాజీనామాలు చేసి ఎన్నికల యుద్ధానికి దిగే పద్ధతి వచ్చింది. ఇప్పుడు తండ్రి సామ్రాజ్యాన్ని తాను తప్ప ఇంకొకరెవ్వరూ పరిపాలించడానికి వీల్లేదని వై.ఎస్. జగన్మోహన్ రెడ్డి కాంగ్రెస్ పార్టీ నుండి విడిపోయిన ఫలితంగా మనకీ ఉప ఎన్నికలొచ్చాయి. ఇది ఆత్మగౌరవానికి, నిరంకుశత్వానికి, విశ్వసనీయతకు, వంచనకు, నీతికి, అవినీతికి మధ్య పోటీ అని, ఒక రకంగా తనకు, సోనియా గాంధీకి మధ్య పోటీ అని జగన్ అంటున్నారు. జీవితాంతం వై.ఎస్. రాజశేఖరరెడ్డి ఇందిరా, రాజీవ్, సోనియాల భజన చేస్తే, ఇప్పుడు ఆయన వారసుడు తెలుగు ఆత్మగౌరవం గురించి మాట్లాడుతున్నాడు. ఆయన మాట్లాడేది ఎవరి ఆత్మగౌరవం గురించి? అందులో ప్రజలున్నారా? జగన్‌కు కాంగ్రెస్ అధిష్టానం ముఖ్యమంత్రి పదవి కట్టబెట్టి ఉంటే ఆత్మగౌరవం ఊసు ఉండేదా. అప్పుడు ఆయన కూడ సోనియాగాంధీని నియంత అనకుండా వై.ఎస్.ఆర్. అన్నట్లుగానే త్యాగశీలి అనేవాడు, కాంగ్రెస్‌ను ఇటలీ కాంగ్రెస్ అనకుండా ఇండియా కాంగ్రెస్ అనేవాడు. కేవలం ఆయన అధికార కాంక్షవల్లే రెండేళ్లకే కడప పార్లమెంటు స్థానానికి ఉప ఎన్నిక, పులివెందుల అసెంబ్లీ స్థానానికైతే ఇది రెండేళ్లలో మూడో ఎన్నిక. ఎవరు గెలిచి ఎవరు పాలించినా ఏమీ ఒరగదని నిరాసక్తంగా ఉన్న ప్రజలపై కోట్ల రూపాయల ఎన్నికల భారం మాత్రం తప్పడం లేదు.

గతంలో ఎన్నడూ లేనట్లు ఈ ఉపఎన్నికలు వాటి పరిధిలోకి వచ్చే ప్రాంతాలకో, జిల్లాకో పరిమితమై లేవు. రాష్ట్రంలో కడపకున్న ప్రత్యేకత వల్ల, అది రాష్ట్ర రాజకీయాలకు కేంద్రం కావడం వల్ల ఈ ఎన్నికలకు రాష్ట్రవ్యాప్త ప్రాధాన్యత వచ్చింది. రాష్ట్రంలోని ప్రధాన పార్టీలన్నీ వీటిమీద ప్రత్యేక దృష్టి సారించాయి. ఈ ఎన్నికలు మన 'ప్రజాస్వామ్య' తీరును తెలియజేస్తాయి కాబట్టి ప్రజాస్వామికవాదులు,

---

సీమాంధ్ర ఎం.ఎల్.ఎ.లు ఎం.పి.లు ఏ పార్టీవారైనా తెలంగాణను వ్యతిరేకించే పరిస్థితి ఉంది కనుక దానికి కేంద్రం తమకు అనుకూలంగా మలచుకుని, మీడియాలో సీమాంధ్ర ఆధిపత్యాన్ని వాడుకుని, ఉస్మానియా, కాకతీయ విశ్వవిద్యాలయాల్లో సాయుధ బలగాలను వ్యూహాత్మకంగా వాడుకుని, తెరాసను దువ్వి, పత్రికలకు వ్యాపార ప్రకటనలు ఇవ్వబోమని బెదిరించి కేంద్రం తెలంగాణ రాష్ట్రం ఇవ్వకూడదని రహస్యంగా ఈ నివేదికలో చెప్పింది ఈ కమిటీ. ఇది దిగజారుడులో అట్టడుగు స్థాయి కావచ్చు. బహిరంగ నివేదికలో ఒక నాలుక, రహస్యంగా మరొక నాలుకతో శ్రీకృష్ణ రెండు నాలుకల వాదాన్ని నిస్సిగ్గుగా ప్రకటించింది. తెలంగాణకు అనుకూలంగా ప్రజావెల్లువ ఉండడం, తెలంగాణకు అన్యాయాల మాట పూర్తిగా తుడిచి పెట్టడానికి వీల్లేదని గమనించి, ఈ కమిటీ తెలంగాణను బహిరంగంగా వ్యతిరేకించే సాహసం చేయలేకపోయింది. ఎందుకంటే అది అన్యాయం అని వారికి కూడా అర్థమైంది కనుక. కాని తెలంగాణ ఇవ్వకుండా ఉండడానికి పన్నే పన్నాగాలను కుతంత్రాలను రహస్య నివేదికలో వివరించడాన్ని బట్టి ఈ కమిటీ ఒక సీమాంధ్ర పక్షపాత బృందం వలె పక్షపాతంతో వ్యవహరించిందే కాని న్యాయమైన విధానాన్ని అనుసరించలేదని సామాన్యుడికి కూడా అర్థమవుతుంది. తెలంగాణను ఇవ్వకుండా కొందరు లాబీయిస్టుల ప్రభావానికి కేంద్రం లొంగిపోయిందని ఈ కమిటీ వేసిప్పుడే తేలింది. తాజా పరిణమమేంటే ఈకమిటీ నివేదిక ద్వారా తనకు అంతకు ముందున్న విశ్వసనీయత ఏదయినా ఉంటే దాన్ని పూర్తిగా కోల్పోయింది. ఇప్పటికీ పూర్తి నివేదిక ఇచ్చే ధైర్యం చేయలేదు. ఇంకా అనేక అంశాలు రహస్యంగానే ఉంచారు. హోం మంత్రిత్వ శాఖలో ఒక మాజీ అధికారి రూపొందించిన నివేదికపై సంతకం చేయడానికి ఒక మాజీ న్యాయమూర్తి సిద్ధంకావడంలో ప్రయోజనాలు ఏమిటో ఆలోచించాల్సిందే. ఇదివరకు దాదాపు అన్ని పార్టీల నాయకులు మాట తప్పారు. అందుకు సిగ్గుపడడం ఎందుకని వారి విధానం. అదే పని కేంద్రం కూడా చేసింది. మంత్రులు, కేంద్ర రాష్ట్ర నాయకులు తమ రెండునాల్కలను ఎడా పెడా వాడారు. చిదంబరం హోంమంత్రి హోదాలో పార్లమెంటులో చేసిన ప్రకటనకు కూడా విలువ లేకుండా చేసారు. చివరకు దిగజారుడులో తానూ ఏమీ తీసిపోనని జస్టిస్ కృష్ణ కూడా రెండునాల్కల ధోరణిని నివేదికలో స్పష్టంగా రచించారు. తరువాత ఆయన చిదంబరం పాదపద్మాలకు సమర్పించిన నివేదిక అనే కానుకకు ప్రతిఫలంగా, దుగ్గల్ పట్ల భక్తితో వ్యవహరించినందుకు కృతజ్ఞతగా జస్టిస్ శ్రీకృష్ణ కు ఆర్థిక వ్యవహారాల నియంత్రణ శాసనాలను సమీక్షించే ఒక కమిషన్‌కు అధ్యక్ష పదవిని గ్రహించారు. ఆయన జన్మ ధన్యమయింది. సుప్రీంకోర్టులో న్యాయమూర్తిగా పనిచేసినపుడు ఏం న్యాయం చేసి ఉంటాడో అని అనుమానం కలిగించే పనులు పదవీ విరమణ తరువాత చేయకూడదనేది ఒక నీతి. రిటైర్మెంట్ తరువాత ఇవ్వబోయే పదవులే అసలు ప్రలోభాలని, లంచాల కన్న ఈ లాంఛనాలే మరింత అవినీతి కరమైనవని ఇటువంటి నివేదికలు నమ్మకం కలిగిస్తాయి.

*(రచయిత నల్సార్ విశ్వవిద్యాలయంలో న్యాయశాస్త్ర ప్రొఫెసర్)* వీ

మేధావులు వీటిని జాగ్రత్తగా గమనించాలి, మాట్లాడాలి.

ఈ ఎన్నికల్లో ప్రధానంగా బరిలో ఉన్న పార్టీలు కాంగ్రెస్, తెలుగుదేశం, వై.ఎస్.ఆర్. కాంగ్రెస్. మొట్టమొదట ఈ మూడు పార్టీల విధానాల్లో తేడాలేమైనా ఉన్నాయా? ప్రపంచబ్యాంకు విధానాలను కొనసాగించడంలో, ప్రజా ఉద్యమాలను అణచివేయడంలో తెలుగుదేశం, కాంగ్రెస్‌లకు తేడాలేదని రుజువయ్యింది. కొత్తగా పుట్టుకొచ్చిన వై.ఎస్.ఆర్. కాంగ్రెస్ ఇంతవరకు దాని మానిఫెస్టో విడుదల చేయలేదు. జెండా, దానిపై ఉన్న పథకాలే విధానాలు కావు. ప్రపంచ బ్యాంకు విధానాల పట్ల, తెలంగాణ సమస్య పట్ల, సెజ్‌లు, థర్మల్ విద్యుత్ కేంద్రాలు, అణువిద్యుత్ కేంద్రాలు, బాక్సైట్ తవ్వకాలు వగైరా రాష్ట్రాన్ని కుదిపేస్తున్న సమస్యల పట్ల ఆ పార్టీ వైఖరి ఏమిటి? ఇవేవీ ప్రస్తావించ కుండా తండ్రి ఆశయాలను ముందుకు తీసుకుపోతానని మాత్రమే జగన్ చెప్తున్నాడు.

ఏ తండ్రి ఆశయాల్ని కొనసాగించాలని జగన్ అధికారాన్ని కోరుకుంటున్నాడో ఆ తండ్రి ఆశయాలు వేల కోట్లు దిగమింగుతూ కూడా ఓట్ల పథకాలతో ప్రజల్ని ఏమార్చడం. రాష్ట్రాన్ని దివాళా మార్గం పట్టించడం. బ్రాహ్మణి స్టీల్స్‌కోసం గాలి జనార్దనరెడ్డికిచ్చిన కేటాయింపులు వంటివి రాష్ట్రవ్యాప్తంగా వివిధ రూపాల్లో ప్రైవేటు కంపెనీలకు కారుచవకగా భూముల్ని వనరుల్ని కట్టబెట్టాయి.. గాలి జనార్దనరెడ్డికి బ్రాహ్మణి కోసం కేటాయించిన 10,700 ఎకరాల భూమిలో కడపజిల్లా జమ్మలమడుగు ప్రజలకు ఉపాధి ఆశ చూపిన ఫ్యాక్టరీ రాలేదు కాని దాన్ని పెట్టుకొని ఇటు బ్యాంకు రుణం పొందడమే కాక, అటు ఓబుళాపురం ఇనుప ఖనిజం ఇష్టారాజ్యంగా అమ్ముకొని ఆయన ఎన్ని వేల కోట్లు సంపాదించాడో లెక్కలేదు. వై.ఎస్. ఈ దోపిడీకి అండగా నిలిచాడు. జగన్ వ్యాపార భాగస్వామి కాబట్టి ఆ బంధం ఎలాగూ కొనసాగిస్తాడు. కాని జిల్లాలో ఏ ఒక్క నాయకుడూ దీనిపై మాట్లాడలేదు, ఉపఎన్నికల సందర్భంలో డి.ఎల్.రవీంద్రారెడ్డి తప్ప. గాలి జనార్దనరెడ్డి అవినీతి సామ్రాజ్యం బ్రాహ్మణి భూములు, ఓబుళాపురం గనులే కాదు. కర్ణాటక నుండి ఆంధ్రప్రదేశ్ దాక గనుల మాఫియా నడుపుతూ ఎం.ఎల్.ఎ.లను, మంత్రులనే కాదు, ఏకంగా ప్రభుత్వాన్నే కొనగలిగే స్థాయిలో ఉంది. అది కర్ణాటక ప్రభుత్వాన్ని అస్థిరపరచి అల్లకల్లోలం చేసింది. గాలి జనార్దనరెడ్డి బి.జె.పి. అయితే, రాజశేఖరరెడ్డి కాంగ్రెస్ అన్న విషయం ఇక్కడ గుర్తుపెట్టుకోవాలి. వై.ఎస్. కుటుంబం కూడ బైరైటిస్ గనుల అక్రమ తవ్వకాల పునాది మీదే తమ రాజకీయ సామ్రాజ్యాన్ని స్థాపించుకుందన్న విషయమూ మర్చిపోకూడదు. గాలి జనార్దనరెడ్డి ఏ బలంతో కర్ణాటక ప్రభుత్వాన్ని ఆడిస్తున్నాడో, తండ్రి ఇచ్చిన అంగబలం, అర్థబలంతో జగన్ కూడ ఏ పార్టీ నాయకులనైనా కొనగలననే ధీమాతో ఉన్నాడు.

ఈ ఉపఎన్నికల సందర్భంగానే కాదు, రాజశేఖరరెడ్డి కడపను ఎంతో అభివృద్ధి చేశాడని ఈ ప్రాంత ప్రజలు అందుకు రుణపడి ఉండాలని వై.ఎస్. కుటుంబం అంటూ ఉంటుంది. ఇప్పుడు ఈ అభివృద్ధిని కొనసాగిస్తామని జగన్, వివేకానందరెడ్డి ఇద్దరూ వేరువేరు పార్టీల తరపున చెప్తున్నారు. వివేకా అయితే తాను మంత్రి పదవి తీసుకుంది అందుకోసమేనని ఆయన ప్రచార కరపత్రాల్లో అన్నాడు. కడప అభివృద్ధి అంటే రాష్ట్రంలోని నిధులన్నీ కడపకు పారించి తమ బంధుగణానికి ఆదాయ మార్గాలు కల్పించడమే. తొండ ముదిరి ఊసరవెల్లిలా మారినట్లుగా వాళ్ల అక్రమ సంపాదన హైదరాబాద్‌లో సెటిల్‌మెంట్లు, రియల్ ఎస్టేట్ మాఫియాగా అభివృద్ధి చెందింది. అసలు ముఖ్యమంత్రిగా ఉండి సొంతూరును మాత్రమే అభివృద్ధి చేయడం ఏ ఆదర్శం అని సొంత జిల్లా ప్రజలు అడగలేరు. ఇటువంటి అభివృద్ధి ప్రాంతీయ విభేదాల్ని మరింతగా పెంచి పోషించదా అన్న ప్రశ్న ప్రజాస్వామిక వాదులకూ ఉదయించదు. 30 ఏళ్లుగా జిల్లా వెనుకబాటుతనానికి కారణం అసమ్మతి రాజకీయాలు, ఫ్యాక్షన్ ముఠాలు నడిపిన రాజశేఖరరెడ్డి, అన్న విషయం చాలా సౌకర్యంగా మర్చిపోతారు. చంద్రబాబు ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు నిధులన్నీ కుప్పానికేనా అని వై.ఎస్.ఆర్. విమర్శించారు. రేల్వేబడ్జట్ అంతా బెంగాల్‌కే తీసుకుపోయి మాకు అన్యాయం చేస్తోందని మన రాష్ట్రం తరపున మమతా బెనర్జీని అన్ని పార్టీలూ విమర్శిస్తాయి. ఈతరహా అభివృద్ధి అంతా ఎవరి ప్రాంతంలో వాళ్లు పట్టు పెంచుకొని అక్కడి నుండి అధికారాన్ని విస్తరించుకుంటారు. అందుకవసరమైన నిధుల్ని సమకూర్చుకుంటారు, అనుచరులను పోషిస్తారు, దౌర్జన్యాలు చేస్తారు. రాజశేఖరరెడ్డీ అంతే. ఇంకా మాట్లాడితే జిల్లాలో ప్రతిపక్షాల ఉనికే లేనంత పట్టు వై.ఎస్. కుటుంబం సాధించింది. అది ఎంతంటే పులివెందులలోనైతే తెలుగుదేశం పార్టీ కార్యాలయం కూడ పెట్టుకోలేనంత. సతీష్ రెడ్డి నామినేషన్ వేసినంత మాత్రానే ఆయనపై హత్యానేరం మోపబడి, ఊర్లో తెలుగుదేశం పార్టీ అద్దెకు తీసుకున్న ఇంటిని డి.ఎస్.పి. ఆఫీసు ముందు నుండే బుల్‌డోజర్లు పోయి నేలమట్టం చేసేంత.

జిల్లా రాజకీయాలు నేరమయం చేసి ప్రజాస్వామిక విలువల్ని అట్టడుక్కు దిగజార్చి పైకెదిగిన నాయకుడు. అదే పద్ధతిలో రాష్ట్రాన్నేలి ఇప్పుడు దేవుడై కూర్చోవడం, ఆయనపై భక్తి ప్రదర్శించడానికి అటు జగన్ వర్గం, ఇటు కాంగ్రెస్ పోటీపడ్డం ఇప్పుడు అసలు విషయం. ఆయన వారసులం మేమే అంటే, కాదు మేమే అంటూ వై.ఎస్. రాజశేఖరరెడ్డి దోపిడి రాజకీయ వారసత్వం కోసం రెండు పక్షాలు కలబడుతున్నాయి. వివేకానందరెడ్డి అయితే అసెంబ్లీలో వీధి రౌడీలా వై.ఎస్.ను విమర్శించిన ఎం.ఎల్.ఎ.లపై భౌతికంగా దాడిచేశాడు కూడ. ఆ రాజకీయ వారసత్వం పులివెందుల, కడప ప్రాంతాలకు సంబంధించింది మాత్రమే అయితే రాష్ట్రంలోని ప్రధాన పార్టీల నాయకులందరూ కడప చుట్టూ మూగేవారు కాదు. (తెలుగుదేశం మాత్రం రాజశేఖరరెడ్డి పోయాక జిల్లాలో పార్టీని నిలబెట్టే అవకాశం కాస్తైనా ఉంటుదేమోనని ఆరాటపడుతుండొచ్చు.) రాజశేఖరరెడ్డి 'ఛరిష్మా' మొదట్లో రాయలసీమలో ఉండే బలమైన భూస్వామ్య సంస్కృతి వల్ల కావొచ్చు కాని, దానితోపాటు తొలితరం ఫ్యాక్షన్ నాయకుల నుండి క్రమంగా ఎదిగివచ్చిన బూర్జువా నాయకత్వపు లక్షణాలు ఆయనలో కలగలిసి ఉండడంవల్ల ఉన్న సామాజిక స్థితికి సరిగ్గా సరిపోయే రాజ్యప్రతినిధి ఆయన వ్యక్తిత్వంలో ఉంది. ఈ వ్యక్తిత్వం ఈనాటి పాలక వర్గాలకు ఒక ఆదర్శ నమూనా. వై.ఎస్.ఆర్. వంటి వ్యక్తిని కేవలం మొరటు ఫ్యాక్షనిస్టుగా భావించిన వాళ్లు ఆయనలోని ఆధునిక బూర్జువా ప్రతినిధిని చూసి ఆశ్చర్యపోతారు. వై.ఎస్.ఆర్. ప్రతిపక్ష అసమ్మతి నాయకునిగా ప్రాంతీయవాదాలు (అటు తెలంగాణ, ఇటు రాయలసీమ కూడ), ముఖ్యమంత్రిగా సమైక్యవాదాలు వినిపించిన మామూలు స్థాయి రాజకీయ నాయకుడు కాదు. తెలంగాణకు సై అని, అక్కడ పోలింగైపోయిన గంటకే రాయలసీమలో తెలంగాణ వ్యతిరేక ప్రాంతీయ విద్వేషాలు రెచ్చగొట్టే ప్రమాదకరమైన ఆటలు ఆడగలడు. అందుకేనేమో సమైక్యవాదానికి ఆదర్శమూర్తైపోయాడు. అంతే కాదు ఒక వైపు ప్రపంచబ్యాంకు అభివృద్ధి నమూనాను కొనసాగిస్తూనే వివిధ పథకాలతో

సంక్షేమ రాజ్యమనే భావన పుట్టించగలిగాడు. అవి ఎంతటి లోపభూయిష్టమైన విధానాలో తెలిసినా ప్రతిపక్షాలు విమర్శించలేని పరిస్థితి. (అన్ని పక్షాలదీ సారాంశంలో ఒకే విధానం కాబట్టి.) అందుకే అవినీతి తప్ప వాళ్లకు మాట్లాండేదుకు ఏమీ ఉండదు.

ప్రతిపక్షంలో ఉన్నప్పుడు నల్గొండలో యురేనియం ప్రాజెక్టు ప్రాణాంతకం అని ఉద్యమించిన 'డాక్టర్' వై.ఎస్.ఆర్. గారు, అధికారం లోకి వచ్చాక కేంద్రం వద్ద తన ప్రాపకం పెంచుకోడానికి సొంత ఊరి ప్రజలపైనే యురేనియం నిప్పుల కుంపటిని పెట్టిన ఆదర్శాన్ని జగన్ అయినా, వివేకా అయినా కొనసాగించే వాళ్లే. అయితే తెలుగుదేశం, వామపక్షాలు దాని గురించి మాట్లాడే సాహసం చేయడం లేదు. ప్రజల వ్యతిరేకతను మన్నించి దేశంలో ఏ రాష్ట్ర ప్రభుత్వం దాన్ని ఆమోదించ లేదు, ఒక్క ఈ కడప 'ముద్దుబిడ్డ' తప్ప! కాకరాపల్లి పర్యటనలో థర్మల్ విద్యుత్ కేంద్రానికి వ్యతిరేకంగా పోరాడుతున్న అక్కడి ప్రజలు జగన్‌ను నిలదీశారు. ఇదంతా మీ నాయన తెచ్చిపెట్టింది కాదా అని గట్టిగా కడిగి పారేశారు. ఇక్కడ యురేనియం ప్రాజక్టును వ్యతిరేకిస్తున్న జనాన్ని తండ్రి అణచివేస్తే ఆయన ఆదర్శాలను నిలబెట్టే కొడుకు కాకరాపల్లి పోరాటానికి మద్దతు ప్రకటిస్తాడు! దీన్ని చైతన్యవంతమైన ప్రజలు మాత్రమే ప్రశ్నించగలరు. కాకరాపల్లిలోనో, తెలంగాణలోనో జనం ఆయన్ని అడ్డుకోగలరు. కడపలో ఆ పరిస్థితిలేదు. యురేనియం తవ్వకాలను గట్టిగా వ్యతిరేకించిన ప్రజలు తీవ్ర అణచివేత తర్వాత నష్టపరిహారం, ఉద్యోగాలు మాత్రం అడుగుతున్నారు. ఇప్పుడు కొత్తగా యురేనియం గనుల విస్తరణకు పబ్లిక్ హియరింగ్ జరగవలసి ఉండగా మా భూములు తీసుకుని మాకు పరిహారం, ఉద్యోగాలు ఇవ్వమని అర్జీలు పెట్టుకోడానికి అధికార్ల వద్ద బారులు తీరుతున్నారు.

తండ్రి బృహత్తర ఆశయాల కొనసాగింపు కోసం జగన్ మనపై రుద్దిన ఉప ఎన్నికలు చూస్తుంటే ఎవరికైనా ఎన్నికలు మాయ, ప్రజాస్వామ్యం మిథ్య అనాలనిపిస్తుంది. సిద్ధాంతాలకతీతంగా పార్టీలు, పార్టీలకతీతంగా నాయకులు మమ్మల్ని గెలిపించి ప్రజాస్వామ్యాన్ని నిలబెట్టండంటే, మమ్మల్ని గెలిపించి అభివృద్ధికి బాటలు వేయండి అంటున్నారు. ఎవరు ఎప్పుడు ఏపార్టీలో ఉంటారో, ఎవరి పక్షాన మాట్లాడతారో తెలీదు. తమ పార్టీ సభ్యుల నుండే కాదు, ఏ పార్టీ నుండైనా అభ్యర్థులను తీసుకుంటాయి పార్టీలు. పార్టీ మారక ముందే టికెట్ ఇస్తామని కూడ అంటారు. కొత్తగా పుట్టుకొచ్చే పార్టీల్లోనైతే అందరూ వలస పక్షులే.

నిన్నటిదాకా రఘురామిరెడ్డి తెలుగుదేశం నాయకుడు. ఆయన సొంతూరు నక్కలదిన్నెలో జగన్ సభ పెడితే ఆయన ప్రోద్భలంతో ఆ ఊరి జనం దాన్ని బహిష్కరించి ఇళ్లకు తాళాలేసి వెళ్లిపోయారు. బైటి జనంతో జగన్ సభ జరుపుకొని పోయాక వాళ్లు గ్రామాన్ని శుద్ధి చేసుకున్నారు కూడ. దాని తర్వాత రాజుకున్న ఘర్షణ మూలంగా జగన్ వర్గీయులు, రఘురామిరెడ్డి వర్గీయులు ఇద్దరిని హత్య చేయించారు. గ్రామంలో తగాదాలు, పంటలు నాశనం చేసుకోడాలు, పోలీస్ పికెట్‌లు ఇవన్నీ నడుస్తుండగానే, హత్యకేసు తెగకుండానే రఘురామిరెడ్డి జగన్ వర్గంలో చేరిపోయాడు. నిన్నటిదాకా తెలుగుదేశంలో ఉన్న కందుల సోదరులు ఇప్పుడు కాంగ్రెస్ పార్టీ. ప్రొద్దుటూరు మాజీ ఎం.ఎల్.ఎ. వరదరాజుల రెడ్డి మొదట తెలుగుదేశం, తర్వాత కాంగ్రెస్, క్షణకాలం జగన్ పార్టీ, మళ్లీ కాంగ్రెస్. బద్వేలు ఎం.ఎల్.ఎ. ఏ పార్టీలో ఉంటారనే విషయం రెండు రోజుల పాటు టివి ఛానళ్లకు పూటకో బ్రేకింగ్ న్యూస్‌తో రక్తి కట్టించే డ్రామానిచ్చింది. ఇలాంటివి ఎన్నెనా చెప్పుకోవచ్చు.

కడపజిల్లాను వై.ఎస్.ఆర్. జిల్లాగా పేరు మార్చాక చాలా ఆలస్యంగా నిద్ర మేల్కొన్న డి.ఎల్ రవీంద్రారెడ్డి 'కడప' పేరు కోసం ప్రాణత్యాగమైనా చేస్తానన్నాడు. వై.ఎస్.ఆర్. ఆర్థిక అరాచకత్వం మూలంగానే రాష్ట్రం సంక్షోభంలో పడిందని, ఆయన కుంభకోణాల గురించి మాట్లాడాడు. సంచలనాత్మకంగా వరుస పెట్టుకొని పత్రికా ప్రకటనలిచ్చి మంత్రి పదవి వచ్చేదాక వార్తల్లో నానాడు. ఎన్నికల బరిలో దిగాక వై.ఎస్. విధానాలను మాత్రమే విమర్శించానని అంటున్నాడు. కాంగ్రెస్ పార్టీ మాత్రం రాజశేఖరరెడ్డి విధానాలను కొనసాగిస్తానంటోంది. అంటే జనాకర్షక పథకాలు, ధన యజ్ఞం, సెజ్‌లు, భూకుంభకోణాలు వగైరానా? వై.ఎస్.ఆర్.ను పక్కన పెట్టి జగన్ అక్రమ ఆస్తుల గురించి కాంగ్రెస్ నాయకులు కొందరు మాట్లాడతారు. వై.ఎస్.ఆర్.ను విమర్శిస్తే సానుభూతి ఓట్లో, వై.ఎస్.ఆర్. పథకాలకు పడే ఓట్లో పోతాయనేమో. ఈ పథకాలన్నీ ప్రజలను లబ్ధిదారులను చేసి ప్రభుత్వ దయాదాక్షిణ్యాల కోసం ఎదురు చూసేలా చేసేవే.

నువ్వు దొంగ అంటే, నువ్వు దొంగ అని పరస్పరం తిట్టుకునే నాయకులు కూడ ఒకరి అవినీతి గురించి మరొకరు మీడియాకు బ్రేకింగ్ న్యూస్ ఇస్తారు కాని ఒకరి ఆర్థిక మూలాల్ని ఇంకొకరు తాకరు. తెలుగుదేశం అధికారంలో ఉన్నప్పుడు రెండెకరాల చంద్రబాబు రెండువేల కోట్ల ఆస్తులు ఎలా సంపాదించాడని రాజశేఖరరెడ్డి గొడవ చేసేవాడు. ఆయన అక్రమ ఆస్తులపై కోర్టులో కేసు వేశాడు కాని దాన్ని వెనక్కు తీసుకున్నాడు. అధికారంలోకి వచ్చాక చంద్రబాబు అక్రమాలపై విచారణ జరిపిస్తానని వై.ఎస్. చెప్పాడు కాని ఒక్క కేసూ నడపలేదు. వై.ఎస్. ముఠా రాజకీయాల గురించి, మతకలహాల్లో ఆయన పాత్ర గురించి తెలుగుదేశం వాళ్లు ఎన్నోసార్లు మాట్లాడారు కాని కేసులు పెట్టలేదు. వాళ్లు అధికారంలో ఉన్నప్పుడు కూడ విచారణ జరిపించలేదు. జగన్ అక్రమ ఆస్తుల గురించి కాంగ్రెస్‌వాళ్లు మాట్లాడతారు. కాని ఇటు రాష్ట్రంలో అటు కేంద్రంలో కాంగ్రెస్ అధికారంలో ఉన్నా కూడ విచారణ ఉండదు. దొంగలు దొంగలు ఊళ్లు పంచుకున్నట్లు వీళ్లు ఐదేళ్లకొకరు విడతల వారీగా దేశాన్ని పంచుకుతింటున్నారు. సారా కాంట్రాక్టులూ, మద్యం సిండికేట్లూ నడుపుతూ మద్యం అమ్మకాల రూపంలో ప్రజాసేవను విస్తరిస్తున్నారు. ప్రతి ఎన్నికకూ కోట్లు ఖర్చుచేస్తూ అందుకు ఎన్నో రెట్లు సంపాదిస్తూ ఏం చెప్పినా వినేవాళ్లు ఉన్నారు కదా అని నీతి నిజాయితీ, విశ్వసనీయత, ప్రజాసేవ అని మాట్లాడుతున్నారు. అన్నా హజారే అవినీతి వ్యతిరేక ఉద్యమానికి మా మద్దతు అని గాలిజనార్ధన రెడ్డి, జగన్, చంద్రబాబు వంటి వాళ్లు మాట్లాడతారు.

అన్ని పార్టీలూ అంతే అయినప్పుడు మరి ప్రజలకు ప్రత్యామ్నాయం ఏమిటి? ప్రజాస్వామ్యానికి ప్రతీక ఎన్నికలు అంటారు. ఓటు వేయటం తప్పనిసరిగా నిర్వర్తించాల్సిన బాధ్యత అంటారు. ఐదేళ్లకోసారి ఏ ప్రలోభాలకూ లొంగకుండా ఓటు వేసినంత మాత్రాన 'బాధ్యత' తీరిపోతుందా? ప్రజాస్వామ్యం అంటే ఎన్నికలేనా? ప్రజాస్వామ్యం అంటే ఎన్నికలే కాదు. ప్రజల భాగస్వామ్యంతో ప్రభుత్వాలు నడిస్తేనే అది ప్రజాస్వామ్యం. అంటే ప్రభుత్వ విధానాల గురించి ఎక్కడికక్కడ, ఎప్పటికప్పుడు చర్చించి, ప్రశ్నించి, అవసరమైతే నిలదీయగలగాలి. ఐదేళ్లూ ప్రభుత్వాలు ఏంచేసినా చెల్లుబాటు అయిపోయే స్థితి ఉంటే, ప్రజలకు ఐదేళ్లకోసారి ఓటు వేయడమొక్కటే మిగిలితే, ఆ ఎన్నికలు కూడా భ్రష్టు పట్టి పోయి వాటి వల్ల ఏ ప్రయోజనం లేకుండా పోతుంది. అప్పుడు బూటకపు ఎన్నికలను తిరస్కరిద్దాం, నిజమైన ప్రజాస్వామ్యం కోసం పోరాడదాం అని మాట్లాడాల్సి వస్తుంది.

*(రచయిత విరసం కార్యవర్గ సభ్యురాలు)* వీ

*ఎన్నికలంటే రాజకీయ పక్షాల బలాబలాల నిరూపణకే ఉపయోగపడుతున్నాయి తప్ప, ప్రజల ఆకాంక్షలను ప్రతిబింబించేవిగా లేవని అంటున్నారు* **సి. రాజశేఖర్**

# ఐదు రాష్ట్రాల్లో ఎన్నికలు

ఈ నెల ఎండ వేడిమికి తోడు ఎన్నికల వేడి కూడా రాజుకుంది. ఐదు రాష్ట్రాల్లోని అసెంబ్లీ సీట్లకు జరుగుతున్న ఎన్నికలతో ఈ వేడి అంటుకుంది. పశ్చిమ బెంగాల్, తమిళనాడు, కేరళ, అస్సాం, పుదుచ్చేరి రాష్ట్రాలలో పలు విడతలుగా ఎన్నికలు జరిగాయి, జరుగుతున్నాయి.

## పశ్చిమ బెంగాల్

మొత్తం 294 నియోజకవర్గాలకు గాను ఆరు దఫాలుగా ఎన్నికలు జరుగనున్నాయి. ఏప్రిల్, 18, 23, 27, మే 3, 7, 10 తేదీలలో ఎన్నికలు జరుగుతున్నాయి. మొత్తం ఓటర్ల సంఖ్య 5.6 కోట్లు.

ఏప్రిల్ 18న జరిగిన తొలి దశ పోలింగ్‌లో 54 నియోజకవర్గాల్లో ఎన్నికలు జరిగాయి. 74 శాతం మంది ప్రజలు ఓటు హక్కును వినియోగించుకున్నారు. ఏప్రిల్ 23న జరిగిన రెండో విడత పోలింగ్‌లో 50 స్థానాలకు గానూ 85 శాతం మంది ప్రజలు ఓటింగ్‌లో పాల్గొన్నారు.

మూడు దశాబ్దాలుగా తిరుగులేని ఆధిపత్యం చేస్తున్న సిపిఎం కు ఈసారి అధికారంలో రావడానికి చాలా కష్టపడాల్సిన పరిస్థితి ఏర్పడింది. ప్రధానంగా సిపిఎం, తృణమూల్ కాంగ్రెస్ మధ్యనే ఈ పోరు ఉంది.

ఈసారి సిపిఎం ప్రభుత్వ పనితీరుపై తీవ్ర విమర్శలు వస్తున్నాయి. ప్రజావ్యతిరేక విధానాలూ, బహుళజాతి కంపెనీల ప్రాజెక్టుల కోసం ప్రజల నుంచి బలవంతంగా భూమి సేకరించడం, మావోయిస్టులకు మద్దతు ఇస్తున్నారన్న నెపంతో ప్రజలపై దమనకాండ, నిర్బంధం విధించడం వీటన్నిటితో ఈసారి సిపిఎంకు ప్రజల్లో తీవ్ర వ్యతిరేకత వచ్చింది.

2009 లోకసభ ఎన్నికల ఫలితాల తరువాత తృణమూల్ అధ్యక్షురాలు మమతా బెనర్జీ బెంగాల్ ప్రజల్లోకి దూసుకెళ్లిపోతున్నారు. నందిగ్రామ్, సింగూర్‌లలో జరిగిన ప్రజా పోరాటాలు ఆమెకు మద్దతునిచ్చాయి. ఈ ఎన్నికల్లో 'మా, మాటి, మానుష్' (అమ్మ, జన్మభూమి, ప్రజ) అన్న నినాదంతో ఆమె ప్రజల ముందుకు వెళ్తున్నారు. కానీ కాంగ్రెస్‌తో పొత్తు ఈసారైనా తృణమూల్‌ను ఆధిక్యం దిశగా తీసుకెళ్తుందా చూడాల్సి ఉంది. స్వతంత్ర సర్వేలలో తృణమూల్‌కు స్వల్ప ఆధిక్యం వచ్చే సూచనలు కనిపిస్తున్నాయి.

## తమిళనాడు

మొత్తం 234 నియోజకవర్గాలకు గాను ఏప్రిల్ 13న ఎన్నికలు జరిగాయి. 75 శాతం పోలింగ్ జరిగింది. మొత్తం 2773 మంది బరిలో ఉన్నారు. ప్రధానంగా అధికార పక్షం డి.ఎం.కె., ప్రతిపక్ష అన్నా డి.ఎం.కె.ల మధ్యనే పోరు ఉంది.

డి.ఎం.కె. కాంగ్రెస్‌తో పొత్తుతో బరిలోకి దిగింది. డి.ఎం.కె. 119 సీట్లలో, కాంగ్రెస్ 63 సీట్లలో పోటీ చేశాయి. ప్రతిపక్ష పార్టీ అయిన ఎ.ఐ.ఎ.డి.ఎం.కె. 160 నియోజకవర్గాలలో పోటీ చేసింది. దేశీయ ముర్పొక్కు ద్రావిడ కజగం (డి.ఎం.డి.కె.) 41, సి.పి.ఎం. 12, సి.పి.ఐ. 10 నియోజకవర్గాలలో పోటీకి నిలబడ్డాయి. బి.జె.పి. 194 స్థానాలలో తన అభ్యర్థులను బరిలో దింపింది.

ఈ ఎన్నికలలో ప్రతిపక్ష అన్నా డి.ఎం.కె. నాయకురాలు జయలలిత ప్రధానంగా డి.ఎం.కె. మీద అవినీతి ఆరోపణలతో బరిలోకి దిగారు. 2జి కుంభకోణంలో మాజీ కేంద్ర మంత్రి రాజా అరెస్ట్, ఈ అవినీతిలో ముఖ్యమంత్రి కరుణానిధి కుటుంబ సభ్యుల పాత్ర ఇవన్నీ డి.ఎం.కె.కు వ్యతిరేకంగా పనిచేసే అవకాశాలు ఉన్నాయి.

## కేరళ

కేరళలో 140 నియోజకవర్గాలకు ఏప్రిల్ 13న ఎన్నికలు జరిగాయి. 74.4 శాతం పోలింగ్ జరిగింది. మొత్తం 971 మంది పోటీ పడ్డారు. ప్రధాన పోరు సి.పి.ఎం. నేతృత్వంలోని పాలక ఎల్.డి.ఎఫ్., కాంగ్రెస్ నేతృత్వంలోని యు.డి.ఎఫ్.ల మధ్య నడిచింది.

ఎల్.డి.ఎఫ్.లో అంతర్గత విభేదాలు పొడచూపాయి. ముఖ్యమంత్రి అచ్యుతానందన్, విజయన్ మధ్య ఆధిపత్య పోరు నడిచింది. ఈసారి అచ్యుతానందన్‌ను ఎన్నికల బరిలో దించడం లేదని సిపిఎం ప్రధాన కార్యదర్శి ప్రకాశ్ కారత్ తెలిపారు. పార్టీపై అచ్యుతానందన్ పట్టుకోల్పోవడం, ప్రజల్లో ఆయన ప్రతిష్ఠ తగ్గిపోవడంతో పార్టీ ఆయనను తప్పించించడానికి కారణం అని తెలుస్తోంది.

అయితే యు.డి.ఎఫ్. కూడా అంతర్గత కుమ్ములాటలతో బలహీన పడింది. కాంగ్రెస్ శాసనసభ అధ్యక్షుడు ఊమెన్ చాంది, ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ ప్రెసిడెంట్ రమేష్ చెన్నితల మధ్య పోరు నడిచింది. చాందిపై పామోలిన్ అక్రమ దిగుమతి చేశారంటూ ఆరోపణలు ఉన్నాయి.

## అస్సాం

అస్సాంలో 126 నియోజకవర్గాలకు గాను రెండు దశలలో పోలింగ్ జరిగింది. తొలి విడతగా 62 స్థానాలకు గాను ఏప్రిల్ 4న పోలింగ్ జరిగింది. ఈ పోలింగ్‌లో 75 శాతం మంది ఓటర్లు

పాల్గొన్నారు. తుది విడతగా 64 స్థానాలకు గాను ఏప్రిల్ 11న పోలింగ్ జరిగింది. 70 శాతం మంది ఓటింగ్‌లో పాల్గొన్నారు. రెండో విడత పోలింగ్‌లో రిగ్గింగ్‌కి పాల్పడ్డారు. రిగ్గింగ్‌కు పూనుకున్న వారిపై కోపంతో ఓటర్లు పోలింగ్ కేంద్రాలపై రాళ్లు రువ్వి, విధ్వంసం సృష్టించారు.

వరుసగా రెండు సార్లు అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ పార్టీకి ప్రఫుల్ కుమార్ మహంత పార్టీ అస్సోం గణపరిషత్ (ఎ.జి.పి.) నుంచి గట్టి పోటీ ఉంది. ఈసారి ఎన్నికలలో చిన్న పార్టీలే కీలక పాత్ర వహించబోతున్నాయి. అవినీతి, అధిక ధరలే ప్రతిపక్ష పార్టీల ఎన్నికల ప్రధాన ప్రచారాంశాలుగా ఉన్నాయి.

రెండుసార్లు ముఖ్యమంత్రిగా అధికారంలో ఉన్న ప్రఫుల్ కుమార్ ఈసారి ఎట్లాగైనా అధికారంలోకి రావాలని విశ్వ ప్రయత్నాలు చేస్తున్నారు. అవినీతి, అధిక ధరల వల్ల ముఖ్యమంత్రి తరుణ్‌గోగోయ్‌పై ప్రజల్లో తీవ్ర అసహనం వ్యక్తమవుతోంది. ఎన్నడూ లేని విధంగా ధరలు విపరీతంగా పెరిగిపోయి పేద, మధ్యతరగతి ప్రజలు తీవ్ర ఇబ్బందులకు గురవుతున్నారు.

### పుదుచ్చేరి

కేంద్ర పాలిత ప్రాంతం పుదుచ్చేరిలో మొత్తం 30 స్థానాలకు గానూ ఏప్రిల్ 13న పోలింగ్ జరిగింది. కాంగ్రెస్ 17 స్థానాల్లో, డిఎంకె 10, పిఎంకె 2, విడుతలై చిరుతైగల్ కచ్చి ఒక స్థానంలో పోటీ చేశాయి. ఎ.ఐ.డి.ఎం.కె. 10, ఎన్.ఆర్. కాంగ్రెస్ 17, సిపిఐ, సిపిఎం, డిఎంకె ఒక్కో స్థానంలో పోటీ పడ్డాయి.

కాంగ్రెస్ అంతర్గత కుమ్ములాటలతో తీవ్రంగా వెనకబడి ఉంది. పుదుచ్చేరిని చిన్న రాష్ట్రాల్లో అత్యుత్తమంగా తీర్చిదిద్దడంలో ఆల్ ఇండియా ఎన్.ఆర్. కాంగ్రెస్ అభ్యర్థి ఎన్.ఆర్. రంగస్వామి రెండు సార్లు ముఖ్యమంత్రిగా బాధ్యతలు చేపట్టారు. ఆయనకు ప్రజల్లో మంచి పేరు ఉంది. ఈసారి ఆయన అన్నా డి.ఎం.కె.తో పొత్తు పెట్టుకొని బరిలోకి దిగారు. కాంగ్రెస్ పార్టీకి ఆయన తీవ్ర పోటీ ఇచ్చారు.

ఈసారి ఎన్నికలలో డబ్బు ఏరులై పారింది. బరిలో నిలబడ్డ అభ్యర్థులు గెలుపే లక్ష్యంగా డబ్బులు ఖర్చు పెట్టారు. ఎన్నికలు జరిగిన, జరుగుతున్న ఐదు రాష్ట్రాల్లో ఇప్పటివరకు అధికారిక లెక్కల ప్రకారమే నలభై రెండు కోట్ల డెబ్బై ఐదు లక్షల రూపాయల వరకు స్వాధీనం చేసుకున్నారు. ఇందులో తమిళనాడుకు చెందిన డబ్బే రు. 28.39 కోట్లు. అంటే ఎన్నికలలో గెలవడానికి ఓటర్లను ప్రలోభపెట్టడానికి ఎంత ధన ప్రవాహం జరిగిందో ఊహించవచ్చు. ఇవి అధికారిక లెక్కలు మాత్రమే. అమలకు వీలుకాని వాగ్దానాలు చేస్తూ అభ్యర్థులు ఓటర్లను ప్రలోభపెట్టారు.

రోజురోజుకూ నిత్యావసర ధరలు పెరిగిపోయి ప్రజలు తీవ్ర అవస్థల పాలవుతున్నారు. అవినీతి, కుంభకోణాలతో ప్రజలు విసుగెత్తి పోతున్నారు. పాలకులు బహుళజాతి కంపెనీలు, బడా పెట్టుబడిదారీ కంపెనీలతో ఒప్పందాలు కుదుర్చుకొని వనరులను కొల్లగొట్టి ప్రజలపై ప్రపంచ బ్యాంక్ అప్పుల భారం మోపి వారి పరిస్థితి ఇంకా దిగజార్చుతున్నారు. వీటిని సరిదిద్దే విధానాలు పాలకుల వద్ద లేవు. ప్రజలను ప్రలోభ పెట్టి, ఎన్నికలపై ఖర్చు చేసిన సొమ్మును తిరిగి సంపాదించుకోవడానికి అధికారంలోకి రావడానికి చేసే ప్రయత్నాలుగానే ఎన్నికలు మారాయి తప్ప, ప్రజలకు చేసే మేలు ఏమీ లేదు. ప్రజాస్వామ్యం పేరుతో చేస్తున్న మోసాన్ని ప్రజలు చైతన్యంతో ఎదుర్కొనక తప్పదు.

*(రచయిత వీక్షణం ఉప సంపాదకులు)*

## వీక్షణం రచయితలకు సూచనలు

ఎనిమిది సంవత్సరాలలో, నూట పదమూడు సంచికలలో వీక్షణం దాదాపు పద్దెనిమిది వందల వ్యాసాలు, రచనలు ప్రచురించింది. వీటిలో నిడివిలోనూ, వస్తువులోనూ, చెప్పిన పద్ధతి లోనూ, సుబోధకత లోనూ చాల వైవిధ్యం ఉంది. ఈ వైవిధ్యాన్నంతా గౌరవిస్తూనే, పత్రికలో అచ్చయ్యే వ్యాసాలను ప్రామాణికం చేయడానికి రచయితలు ఈ కింది సూచనలు పాటిస్తే బాగుంటుందని భావిస్తున్నాం.

❖ రచన మరీ చిన్నది (ఒక పేజీ కన్న తక్కువ) కాకుండానూ, మరీ పెద్దది (ఐదు పేజీల పైన) కాకుండానూ ఉంటే బాగుంటుంది. రచన ఐదు పెజీలకు మించితే రెండు మూడు సంచికలలో వేయవలసి వస్తుంది గనుక రచయిత అభిప్రాయం పాఠకులకు అందడం కష్టమవుతుంది. మూడు-నాలుగు పేజీల రచన (1800 - 2500 పదాలు) వీక్షణం కు సరిగ్గా సరిపోతుంది. ❖ చేతిరాతతో పంపేవారయితే వీలయినంత కుదురుగా, చదవడానికి వీలుగా, పంక్తుల మధ్య ఖాళీ వదులుతూ, కాగితానికి ఒకవైపునే రాసి పంపాలి. కంపోజ్ చేసి పంపేవారయితే, డబుల్ లైన్ స్పేసింగ్ లో కాగితానికి ఒకవైపునే అచ్చువేసి పంపాలి. యూనికోడ్ లో గాని, పేజ్ మేకర్ లో గాని కంపోజ్ చేసేవారు సాఫ్ట్ కాపీ సి.డి. ద్వారాగాని, ఇ మెయిల్ లోగాని పంపితే మంచిది. ❖ రచయితలు తప్పనిసరిగా తమ రచన ఫొటో కాపీ తమ దగ్గర ఉంచుకోవాలి. ❖ రచనతో పాటు తప్పనిసరిగా రచయిత సంక్షిప్త పరిచయం, పూర్తి చిరునామా, ఫోన్ నంబర్లు, ఇమెయిల్ వగైరా వివరాలు పంపాలి. ❖ వీక్షణం కార్యాలయానికి రచన అందిన వెంటనే అందినట్టుగా రచయితలకు సమాచారం పంపుతాం. రెండువారాలలోగా ఆ రచనను ప్రచురణకు స్వీకరిస్తున్నదీ లేనిదీ తెలుపుతాం. తక్షణ ప్రాముఖ్యత ఉన్న అంశం మీద రచన అయితే రెండు-మూడు నెలల లోపు అచ్చువేస్తాం. సాధారణ రచనలు అచ్చువేయడానికి ఆరు నెలల వరకూ పట్టవచ్చు. ❖ మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణంకు పంపగూడదు. ❖ దీర్ఘకాలిక తాత్విక, రాజకీయార్థిక, సామాజిక అంశాల మీద మాత్రమే కాక, సమకాలీన రాజకీయార్థిక, సామాజిక పరిణామాలపైన కూడ రచనలు పంపాలని రచయితలకు విజ్ఞప్తి. ఆ విషయం మీదనే మరొకరు రాసినా, అన్ని దృక్పథాల రచనలు అచ్చు వేయడం వీక్షణం ఉద్దేశ్యం. క్షేత్ర పరిశోధనా నివేదికలు, విధానాల అమలు తీరుతెన్నులు, ప్రజాజీవితంలో మార్పులు, వివిధ దృక్కోణాలు, విభిన్న సామాజిక శాస్త్ర పరిశీలనాంశాలు వీక్షణంలో ప్రాధాన్య ప్రచురణాంశాలు. సాహిత్య రంగానికి సంబంధించిన రచనలకు వీక్షణంలో చోటు కల్పించడం సాధ్యం కాదు. ❖ రచయిత అభిప్రాయాలను మార్చడం ఎప్పుడూ జరగదు. కాని నిడివి దృష్ట్యాగాని, సాంకేతిక కారణాల దృష్ట్యాగాని రచనలు కుదించే, మార్చే పరిస్థితి రావచ్చు. ఇలా ఎడిట్ చేయడానికి రచయితలు ఆమోదించాలి. ❖ తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 23వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు.

*తెలంగాణ సాధించుకోవడం మాత్రమే కాదు, భవిష్యత్ తెలంగాణ ఎలా ఉండాలి అనే ఆలోచనలకు ప్రాతిపదికను ఇప్పటినుంచే రూపొందించుకోవాల్సిన అవసరమూ ఉందని అంటున్నారు* **సుధా కిరణ్**

# తెలంగాణానంతర దిశ ఆలోచిద్దాం...

*వర్తమానమూ, గతమూ బహుశా భవిష్యత్తులో కలగలిసి ఉంటాయి. భవిష్యత్తు గతంలో ఇమిడి ఉంటుంది. - టి.ఎస్. ఇలియట్*

ఎంత దగ్గరో అంత దూరం అన్నట్లుంది తెలంగాణ పరిస్థితి. అడుగడుగునా జరిగిన ఒప్పందాల ఉల్లంఘనలకీ, గత చరిత్రల అన్యాయాలకీ ప్రతీకారంగా (రివెంజ్ ఆఫ్ ది పాస్ట్) వర్తమానపు ప్రతిస్పందనగా ముందుకొచ్చిన తెలంగాణ ఉద్యమం ముందు అనేక ప్రశ్నలున్నాయి.

తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుతో, వేర్పాటుతో ఏమవుతుంది? దానితో ఒరిగేదేమిటి? జరిగేదేమిటి? అనే ప్రశ్నలున్నాయి. ఆంధ్రప్రదేశ్ నుండి తెలంగాణ వేర్పాటుతో ఏర్పడేది మరొక రాష్ట్రమే. ప్రత్యేక దేశమేమీ ఏర్పడబోవడం లేదు. దీంతో ఏర్పడే ప్రత్యేక రాష్ట్రం ప్రస్తుత వ్యవస్థ పరిధిలోనే, ఈ రాజ్యాంగ పరిధిలోనే ఏర్పడుతుంది. కాబట్టి దీనికి జవాబు తేలికగానే చెప్పుకోవచ్చు. కొందరు చెబుతున్నట్లు, నిజమే తెలంగాణ ఏర్పాటుతో ఉత్పత్తి సంబంధాలు మారవు, వర్గాల స్థితిగతులు మారవు. రాజ్యం మారదు. దోపిడీ తొలగిపోదుగాక తొలగిపోదు. ఒక పరిపాలనా యూనిట్ మాత్రమే ఏర్పడుతుంది.

అంతమాత్రాన తెలంగాణ ఏర్పాటుతో, రాష్ట్ర వేర్పాటు తప్ప సాధించవలసిందేమీ లేదా? ఉద్యమంలో పెద్ద ఎత్తున పాల్గొంటున్న ప్రజలు సాధించాలనుకుంటున్నది ఏమి లేదా? ఇది ఎవరికివారు వ్యక్తులు గానో, విడివిడి బృందాలుగానో కలగంటున్న ఊహాత్మక ఆదర్శమేనా? ఉమ్మడి వ్యూహాత్మక లక్ష్యాలు లేనేలేవా? అలాంటివి ఉండనవసరమే లేదా? సమీప గతంలో ఏర్పడ్డ ప్రత్యేక రాష్ట్రాల అనుభవం నుంచి తెలంగాణ ప్రజలు నేర్చుకోవలసిన పాఠాలు ఏమైనా ఉన్నాయా? ఏయే కారణాలు, అంశాల మీద ఆధారపడి ప్రత్యేక తెలంగాణ రాష్ట్రాన్ని కోరుతున్నామో ఆయా అంశాలపైన ఎంచుకోబోతున్న పరిష్కారాలు ఎలా ఉండాలి?

తెలంగాణ భవిష్యత్ చిత్రపటాన్ని గురించి ప్రశ్నలు రాగానే ఒక విధమైన అసహనం వ్యక్తమౌతోంది. ఈ ప్రశ్నలు లేవనెత్తడమంటే, రాబోతున్న తెలంగాణకి మోకాలడ్డు పెట్టడమేననీ, ముందరి కాళ్లకు బంధం వేయడం లాంటిదనీ కొందరు విమర్శిస్తున్నారు. ఇంకా కొందరు ఇది 'సమైక్యవాదుల' దారి మళ్లింపు ప్రయత్నమంటున్నారు. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటులో 'చివరి మెట్టు' పైన ఉన్న ఈ సమయంలో ఇలాంటి ప్రశ్నలతో గందరగోళం తలెత్తుతుందనీ, ఇది తెలంగాణ సాధన అనే ఏకైక లక్ష్యంపై నెలకొన్న విస్తృత ఐక్యతని బలహీనపరుస్తుందనీ అంటున్నారు. సమస్య పరిష్కారానికి గాక మరిన్ని చిక్కుముళ్లకి దారితీస్తుందని అంటున్నారు. అదే సమయంలో తెలంగాణ ఏర్పాటుని ఒక భావోద్వేగపు సమస్యగా మాత్రమే మార్చే వాతావరణాన్ని సృష్టిస్తున్నారు. పోరాటాలకి దారులు వేయకుండా 'ప్రాణార్పణ'లకి పురికొల్పుతున్నారు. అవసరమని భావించగానే మొదలయి, మీట నొక్కగానే ఆగిపోయే 'రిమోట్' కంట్రోల్ రాజకీయాల ఒరవడిని కొనసాగించాలని చూస్తున్నారు.

తెలంగాణ కోరుతున్న శక్తులలో బి.జె.పి. మొదలుకొని నక్సలైటు సంస్థల దాకా ఉన్నాయి. అధికార కాంగ్రెస్ మంత్రులు, శాసన సభ్యుల నుండి ప్రతిపక్షంలోని టిడిపి, టి.ఆర్.ఎస్. వరకూ అందరూ ముందు కొస్తున్నారు. రాజకీయ సంస్థలతో ప్రత్యక్ష సంబంధం లేని విద్యార్థి, యువజనులున్నారు. రాజకీయ సంస్థల ప్రభావంలో పనిచేసే వివిధ వేదికలున్నాయి. ఆధిపత్య కుల సమీకరణల నుండి అణగారిన కులాల వేదిక వరకూ ఇందులో చురుకుగా పాల్గొంటున్నాయి. తెలంగాణ జెండా కింద వేరు వేరు అజెండాలు, తెలంగాణ అజెండాతో వేరు వేరు జెండాలు రెపరెపలాడుతున్న నేపథ్యమిది. విభిన్న రాజకీయ సంస్థలు, శక్తుల ప్రాబల్యంలోని ఉద్యమంలో వైరుధ్యాలు తప్పకుండా ఉంటాయి. ఈ వైరుధ్యాల స్వభావమేమిటి తెలంగాణ రాష్ట్ర ఉద్యమ గమనం మీదా ఆ వైరుధ్యాల ప్రభావమేమిటి? ఈ ఉద్యమంలో కీలకపాత్ర నిర్వహిస్తున్న ఆధిపత్య శక్తుల లక్ష్య, లక్షణాలు ఏమిటి? అవి దీనిని ఏ దిశలో నడపదలచుకున్నాయి? ప్రస్తుతం ఇందులో చొరవ కోల్పోయిన శక్తులు చేస్తున్న ప్రయత్నాల తీరు ఏమిటి? ఎవరి అంచనాలు ఎలా ఉన్నా, ఆచరణలో నిగ్గు తేలాల్సిన విషయాలు ఇవి. వ్యక్తులుగా, సంస్థలుగా ఎవరి కోరికలు ఎలా ఉన్నా, ఈ వైరుధ్యాల గమనమే తెలంగాణ భవితవ్యాన్ని నిర్ధారించబోతోంది. వీటి విశ్లేషణ అసౌకర్యానికి దారితీస్తుందని దాటవేస్తే నష్టం జరిగేది తెలంగాణ భవిష్యత్తుకే. గతంలో తెగతెంపులు గురించి ఆలోచిస్తున్న సమయంలో భవిష్యత్తు గురించిన ప్రశ్నలు లేవనెత్తకుండా ఉండడమంటే గతాన్ని మరొక రూపంలో కొనసాగించడమే. అందుకని తెలంగాణ 'దిశ' ఏమిటనే ప్రశ్నని మరొక 'మలి దశ'కి వాయిదా వేయాల్సిన అవసరం లేదు. ఏర్పడబోయే రాష్ట్ర భవిష్యత్తు సమస్యని 'తెలంగాణ పెద్దమనుషుల' ఇష్టాయిష్టాలకి వదిలి వేయనవసరం లేదు.

ప్రస్తుత వ్యవస్థ చట్రంలో తెలంగాణ రాష్ట్ర డిమాండ్‌ని సామాజిక వ్యవస్థలో సమూలమైన మార్పుని కోరే విప్లవాత్మక కార్యక్రమానికి పోటీ పెట్టడం పొరపాటు, అమాయకత్వం. అలాగని వీటి మధ్య సంబంధం గురించి అసలు చర్చే ఉండకూడదనుకోవడం సంకుచిత దృక్పథ మవుతుంది. ప్రస్తుత రాజ్య చట్రాన్ని యథాతథంగా కొనసాగించ దలచుకొన్న వాళ్ళు, వీటి మధ్య పొసగని వైరుధ్యముందంటారు. వీటి మధ్య సంబంధాన్ని చర్చిస్తే, అది విశాల ఐక్యతకి ప్రతిబంధకమౌతుందని సంకోచించే ప్రజాస్వామికవాదులు తమకి తామే సంకెళ్లు వేసుకొంటున్నారు. సంఘర్షణే లేని, వైరుధ్యమే లేని ఐక్యత గురించిన ఊహా ప్రపంచంలో విహరిస్తున్నారు.

జాతీయోద్యమ చరిత్ర నుండి, నిన్నటి, నేటి తెలంగాణ ప్రాంతీయోద్యమం దాకా ఉన్న అనుభవం మనకి కనువిప్పు కావాలి. బ్రిటిష్ వలస పాలన కాలంలో సాగిన జాతీయోద్యమం, రైతాంగ పోరాటాలనీ, అణగారిన ప్రజల ఉద్యమాలనీ, ఆదివాసీ తిరుగుబాట్లనీ తనలో సంలీనం చేసుకోలేక పోయింది. ఫలితంగా అవి విడివిడి పాయలుగా మిగిలిపోయాయి. కొన్ని సందర్భాలలో ఆయా ఉద్యమాల ఆకాంక్షలు, కోరికలు జాతీయోద్యమ దిశకి సమాంతరంగానో, విరుద్ధంగానో ఉన్నట్లు కనిపించిన సందర్భాలు కూడా ఉన్నాయి. వివిధ శక్తుల మధ్య సామాజిక, రాజకీయ అంతరాలు దేశ చరిత్ర గమనంపైన వేసిన ప్రభావాన్నే మనం చూస్తున్నాం. దేశ విభజన, సంస్థానాలు భారత రాజ్యంలో విలీనమైన క్రమం, భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుపై చర్చోపచర్చలు, ఊగిసలాటలు – వీటన్నిటినీ ఈ నేపథ్యంలో విశ్లేషించుకోవచ్చు.

1956 ఆంధ్రప్రదేశ్ ఆవిర్భావం నాటి 'పెద్ద మనుషుల' ఒప్పందం నుండి నేటి దాకా కొనసాగుతున్న చరిత్రలో, పెద్ద ఎత్తున ప్రజలు ముందుకొచ్చినా పదే, పదే జరిగిన, జరుగుతున్న విద్రోహాలకి బయటి నుంచీ, లోపలి నుంచీ దోహదపడుతున్న కారణాలని తరచి చూసుకోవాలి. వైరుధ్యాలను గుర్తించకుండా, వాటి పరిష్కారాలు ఎలా ఉండాలనే దాని గురించి స్పష్టంగా ఆలోచించకుండా దాటవేస్తే తిరిగి తెలంగాణ భవిష్యత్తుని 'పెద్ద మనుషుల' చేతికే అప్పగించిన వాళ్లమౌతాం.

తెలంగాణ సమస్య బహుముఖమైనది. ప్రాంతీయ అసమానతలు, 'వెనుకబాటుతనం', విద్య, ఉద్యోగ అవకాశాలలో వివక్షత, సాగు నీటి వసతి కల్పనలో పక్షపాతం, వనరుల లూటీ, రాజకీయాలలో, సాంస్కృతిక రంగంలో స్థానీయతని గుర్తించకుండా కొనసాగుతున్న ఆధిపత్యం కలగలిసిన సంక్లిష్ట, సంక్షోభ సన్నివేశమే తెలంగాణ. తెలంగాణలో వెల్లువెత్తిన ఆక్రోశానికి ప్రత్యేక, నిర్దిష్ట నేపథ్యంగా ఉన్న అంశాలు ఇవి. వీటితోపాటు, మిగతా దేశ ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలని తెలంగాణ ప్రజలు కూడా ఎదుర్కొంటున్నారు.

అలాగే తెలంగాణ వలెనే వివక్షతకీ, దోపిడీకీ గురౌతున్న ప్రాంతాలూ, రాష్ట్రాలూ ఉన్నాయి. ఈ ప్రత్యేక, సాధారణ అంశాల మధ్య నుండే సంబంధాలు భారతదేశ సామాజిక వ్యవస్థతో ముడిపడి ఉన్నాయి. తెలంగాణ నిర్దిష్ట సమస్యలకి మూలాలని ఈ వ్యవస్థ చట్రంలో కొనసాగుతున్న రాజకీయ, ఆర్థిక విధానాలకి బయట వెదకడం వృథా ప్రయాస.

తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుతో ఈ సమస్యలన్నీ పరిష్కారమౌతా యనుకోవడం అత్యాశ. కానీ దానితో విద్య, ఉద్యోగ అవకాశాలు, సాగు నీటి వసతి కల్పనలో వివక్షతలని సరిదిద్దడానికి ఒక ప్రాతిపదిక మాత్రం ఏర్పడుతుంది. అయితే ఈ వివక్షతలనీ, అసమానతలనీ తొలగించేందుకు నిర్దిష్టమైన ప్రణాళిక, వ్యూహం, అందుకు తగిన కార్యాచరణలని కనీస స్థాయిలోనైనా రూపొందించుకోకపోతే ఆ అవకాశం వట్టిపోతుంది.

తెలంగాణలో ఉన్న వనరులేమిటి? ఉద్యోగ ఉపాధి అవకాశాలు ఏమిటి? సాగునీటి వసతి పథకాలు ఎలా ఉండాలి? తెలంగాణ జిల్లాల మధ్య ఇప్పటికే ఉన్న అసమానతలని ఎలా తగ్గించాలి? తెలంగాణలో తిరిగి కొన్ని పరిమిత ప్రాంతాలు, సామాజిక వర్గాలు, కులాల ఆధిపత్యమే నెలకొనకుండా తీసుకోవలసిన చర్యలు, జాగ్రత్తలు ఎలా ఉండాలి? ఆర్థిక సంస్కరణల పట్ల, సెజ్‌ల పట్ల, విద్య, వైద్య రంగాల కార్పొరేటీకరణ పట్ల, ఓపెన్ కాస్ట్ గనుల పట్ల రేపటి తెలంగాణ వైఖరి ఎలా ఉండాలి? ఆదివాసులు, అణగారిన దళిత, బహుజన ప్రజలు, మహిళలు, మైనారిటీల హక్కుల విషయంలో ప్రత్యేక రక్షణలేమిటి? తెలంగాణ ఉద్యమంలో, ఆందోళనల్లో తమదైన పాత్రని నిర్వహిస్తున్న సంస్థలు, శక్తులు, విడి విడిగానూ, ఉమ్మడిగానూ వేసుకోవలసిన ప్రశ్నలివి. ఐక్యతని సాధించి, నిలబెట్టుకోవాలనే లక్ష్యంతో లోతుగా చర్చించి దిశా నిర్దేశం చేసుకోవలసిన అంశాలివి. ఇందులో అందరూ అంగీకరించే కనీస అంశాలేమిటి, ఎక్కువ మంది అంగీకరించే గరిష్ట అంశాలేమిటి అన్నవి స్పష్టం చేసుకోవాలి. ఉమ్మడిగా అంగీకరించే అంశాలపైన నిర్దిష్టమైన భవిష్యత్తు ప్రణాళికని తెలంగాణ ప్రజల ముందుంచాలి. కొందరు అనుమానిస్తున్నట్లు, ఇది తెలంగాణ ఉద్యమాన్ని బలహీనపరచదు సరికదా ఐక్యతకి దోహదం చేస్తుంది. తెలంగాణ ఏర్పాటు దగ్గరపడుతున్న సమయంలో భవిష్యత్తు పట్ల ఈ అంతర్దృష్టి అవసరం.

తెలంగాణ భవిష్యత్తు దిశ గురించిన చర్చని ఇంకా దాటవేయడ మంటే అది ప్రజల ప్రయోజనాలని విస్మరించడమే. రాజకీయాలు నిర్దిష్టమైనవి. నిర్దిష్టమైన ప్రశ్నలని, స్పష్టమైన సమాధానాలని అవకాశ వాదంతో దాటవేసినా, ఆచరణలో వైరుధ్యాలని శాశ్వతంగా దాటవేయడం సాధ్యం కాదు. నిన్నటి వరకు 'భౌగోళిక' తెలంగాణ ఏర్పాటు మాత్రమే లక్ష్యమంటూ వచ్చిన వాళ్లు సైతం ఇప్పుడు 'తెలంగాణ విజన్' గురించి మాట్లాడడం మొదలుపెట్టారు. అయితే అది సి.ఇ.ఒ.ల మెప్పుదల కోసం, సి.ఇ.ఒ.ల సమక్షంలోనే ప్రారంభం కావడం యాదృచ్ఛికం కాదు. అందులో వాళ్ల సామాజిక ప్రయోజనాలున్నాయి. సి.ఇ.ఒ.ల సమక్షంలో రూపొందించిన ప్రణాళికలో వస్త్ర తయారీ కేంద్రం తిరుపూర్ (తమిళనాడు) ప్రశస్తి గురించి అధినేత మాట్లాడుతున్నారు. అదే సమయంలో తమిళనాట తిరుపూర్ వస్త్ర కార్మికుల ఆత్మహత్యల రాజధానిగా పరిఢవిల్లుతోందనే వాస్తవాన్ని విస్మరించడం కూడా యాదృచ్ఛికం కాదు.

తెలంగాణ భవితవ్యం అధినేతల 'విజన్'కి వదిలేయాల్సిన విషయం కాదు. అది ప్రజల అజెండాతో, విస్తృతమైన ప్రజాస్వామిక చర్చతో, చరిత్ర నుంచి నేర్చుకున్న పాఠాలతో రూపొందించుకోవలసిన విషయం.

*(రచయిత సాఫ్ట్‌వేర్ నిపుణులు)* వీ

**కార్మికులు సుదీర్ఘ త్యాగపూరిత పోరాటాలతో సాధించుకున్న హక్కులను తొక్కివేయడానికి ఉద్దేశించిన జి.ఒ.ను వెంటనే రద్దు చేయాలని అంటున్నారు లోకే రాజ్‌పవన్**

# అప్రజాస్వామిక ఉత్తర్వు - జి.ఒ. 177

సాధారణంగా ప్రభుత్వానికి అలజడులు, ఉద్యమాలు, తిరుగుబాట్లు అంటే నచ్చవు. అది ప్రభుత్వ సాధారణ స్వభావం. అలాంటి పరిస్థితులను, సంఘటనలను రాజకీయంగానో, బుజ్జగింపుల ద్వారానో, చివరికి అణచివేతల ద్వారానో రూపుమాపేందుకు ప్రభుత్వం నిరంతర ప్రయత్నాలు చేస్తూనే ఉంటుంది. ప్రజలను చైతన్యరహిత స్థాయిలో ఉంచి తన ప్రయోజనాలకు ఎలాంటి భంగం వాటిల్లే పరిస్థితులు తలెత్తకుండా జాగ్రత్తపడుతూనే ఉంటుంది. ప్రత్యేక తెలంగాణ ఉద్యమం లాంటి మహత్తర ఉద్యమం విషయంలో మరిన్ని జాగ్రత్తలు తీసుకుని తన రాజకీయ ఎత్తుగడలతో నయానో భయానో ఉద్యమ తీవ్రతను, విస్తృతిని తగ్గించే విధంగా పావులు కదుపుతుంది. అందులో భాగంగానే ప్రస్తుత సమైక్య ప్రభుత్వం విద్యార్థుల ఉద్యమాన్ని అతివాదుల ఉద్యమమనీ, ఉద్యోగుల ఉద్యమాన్ని క్రమశిక్షణను ఉల్లంఘించే ఉద్యమమనీ ముద్ర వేయగలిగింది. ఆ తప్పుడు ప్రచారానికి కొనసాగింపుగా వచ్చిందే జి.ఒ. 177. ప్రజాస్వామిక ఉద్యమంగా, శాంతియుతంగా నడుస్తున్న ఉద్యమాన్ని తగ్గించివేసే పథకంగా రూపుదిద్దుకుని జారీ చేయబడ్డ జి.ఒ. 177 అంతరార్థం ఉద్యోగవర్గ ఉద్యమాన్ని ప్రత్యేక తెలంగాణ డిమాండ్‌వైపు నుంచి జి.ఒ. 177 రద్దు వైపుకు మళ్లించడమే. ఈ ఉచ్చులో ఉద్యోగులను చిక్కుబడేటట్లు చేసి ఉద్యమ ప్రభావాన్ని తగ్గించివేయడమే జి.ఒ. లక్ష్యంగా కనబడుతున్నది.

ఇక జి.ఒ. 177 గురించి చూస్తే ఎస్.వి. ప్రసాద్, ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి పేరు మీద 13 ఏప్రిల్ 2011న ఈ జి.ఒ. జారీ చేయబడింది. సాధారణ పరిపాలన శాఖలో భాగంగా విడుదలైన ఇది రెండు పేజీల జి.ఒ. సంక్షిప్తంగా జి.ఒ. ఉద్దేశాన్ని ఇలా పేర్కొన్నారు– 'సమ్మెలు, బంద్‌లు, పెన్ డౌన్, చాక్ డౌన్, టూల్ డౌన్, సహాయ నిరాకరణ వంటి ఆందోళన కార్యక్రమాలలో పాల్గొనేటపుడు కార్యాలయాలలోని హాజరు రిజిష్టర్‌లలో సంతకాలు చేసి విధులకు హాజరు కాని ఉద్యోగులకు సంబంధించిన జి.ఒ.గా' దీన్ని పేర్కొన్నారు. కానీ తర్వాత ఉత్తర్వులను నిశితంగా పరిశీలిస్తే ఇది కేవలం అటువంటి ఉద్యోగుల కోసమే కాదని, తెలంగాణ ఉద్యమంలో పాల్గొంటున్న అందరు ఉద్యోగులకు వర్తింపచేసేదేనని అర్థమవుతుంది. అంటే ఉద్యోగులందరి మీద ఎక్కుపెట్టిన అస్త్రంగా ఈ జి.ఒ.ను పరిగణించాలి.

ఉత్తర్వులోకి వెళితే మొదటి పేరాలో ఈ జి.ఒ. ఎందుకు జారీ చేయవలసి వచ్చిందో ఈ విధంగా వివరించారు. 'ఈ మధ్య జరిగిన అనుభవాలలో రాష్ట్రంలోని ఉద్యోగ సంస్థలు తమ డిమాండ్ల సాధన కోసం పెన్ డౌన్, చాక్ డౌన్, టూల్ డౌన్, సహాయ నిరాకరణ వంటి జనామోదం లేని కొత్త తరహా ఆందోళన కార్యక్రమాలను చేపడుతున్నారని ఈ మధ్య జరిగిన అనుభవాలలో ప్రభుత్వ దృష్టికి వచ్చింది. ఈ సందర్భంలో ఎక్కువ మంది ఉద్యోగులు హాజరు రిజిష్టర్‌లో సంతకాలు చేసుకుని, పనికి హాజరు కాకుండా ఆందోళనలలో పాల్గొంటున్నారు. ప్రభుత్వం, ప్రజలు ఎదుర్కొన్న ఈ సమస్యల దృష్ట్యా అలాంటి జనామోదం లేని కొత్త తరహా ఆందోళన కార్యక్రమాలను భవిష్యత్‌లో ఎదుర్కొనేందుకు నిర్దిష్టమైన సూచనలు జారీ చేయవలసిన అవసరం ఏర్పడింది.'

పై పేరాలో ఉన్న ఈ ఉత్తర్వులను కేవలం హాజరు రిజిష్టర్‌లో సంతకాలు చేసుకుని పనికి హాజరు కాకుండా ఆందోళనల్లో పాల్గొనే ఉద్యోగుల కోసమే జారీ చేసినట్లుగా ప్రకటించారు. ఇందులో అంతర్గతంగా ఎంతటి కుట్ర దాగి ఉందో జాగ్రత్తగా గమనించాలి. తెలంగాణ ఉద్యమం ప్రభుత్వానికి తలనొప్పిగా మారిన నేపథ్యంలో ఆ ఉద్యమాన్ని రాజకీయేతర పక్షాలలో చురుకుగా ముందుకు తీసుకుపోతున్న వర్గాలలో ఉద్యోగులు, ఉద్యోగ సంఘాలు ముందున్న విషయం అందరికీ తెలిసిందే. ఈ విషయాన్ని గుర్తించిన ప్రభుత్వం తమ ఆధీనంలో ఉండాల్సిన ఉద్యోగులు తమను ఇరుకున పెట్టే ఉద్యమాలలో పాల్గొనటమేమిటనే దర్పంతో ఉద్యోగులను నైతికంగా దెబ్బతీయాలనే ఎత్తుగడలకు దిగింది. అందులో భాగంగానే పై పేరాలో అంతర్గతంగా ఒక నిందను ఉద్యోగుల మీద వేయదలచింది. ప్రజల నుండి మద్దతు కూడ గట్టుకునేలా ఆ అసత్య ప్రచారాన్ని సత్యవాక్యంగా బుకాయించదలచింది. అదేమిటంటే - 'ఉద్యోగులు సంతకాలు పెట్టుకుని కూడా పనికి హాజరుకారు' అనే ఆరోపణ. ఇదెంత ఘోరమైన ఆరోపణ అంటే ఉద్యోగవర్గాన్ని మొత్తం అవమానపరచడమే. నిజానికి మొదటి పేరా చదివిన ఏ ఒక్కరికైనా పనికి హాజరు కాని ఉద్యోగులపై చర్య కోసమే కదా ఈ జి.ఒ. అని భావించి ఈ జి.ఒ. సరైనదిగానే తోచవచ్చు. కానీ లోతుల్లోకి చూస్తే ఉద్యోగులను, సంతకం చేసుకుని పనికి హాజరు కాని పనిదొంగలుగా చిత్రీకరించే కుట్రకు ప్రభుత్వం దిగిందనేది తేట తెల్లమవుతుంది. అసలు ఉద్యోగులు సంతకాలు చేసుకుని పనికి ఎగనామం పెడుతున్నారని ఎవరు నిర్ణయించాల్సి ఉంటుంది? పై అధికారుల పరిశీలనలో తేలినపుడు వారు ఆ విషయాన్ని క్రమశిక్షణ చర్యల రూపంలో బహిర్గత పరుస్తారు. ఉదాహరణకు ఒక టీచర్ విషయంలో ఎం.ఇ.ఒ., తన కార్యాలయ సిబ్బందిపై ఎం.పి.డి.ఒ., ఎం.ఆర్.ఒ., అలాగే మిగతా శాఖల్లోని పై అధికారులు ఈ ఉద్యోగులపై పైస్థాయికి ఫిర్యాదు చేస్తారు. ఒక ప్రజాబాహుళ్య ఉద్యమం (మాస్ మూవ్‌మెంట్) గా సాగిన తెలంగాణ ఉద్యమ సమయంలో అలాంటి ఫిర్యాదులు గానీ, పరిశీలనలు గానీ జరిగాయా? అధికారికంగా ఉద్యోగులపైన క్రమశిక్షణ ఉల్లంఘనకు సంబంధించిన వివాదాలు బయటికి వచ్చాయా? ఇవేవీ జరగనపుడు ప్రభుత్వం ఉద్యోగులపై ఈ నిందను ఎలా వేయగలిగింది? ఒక అసత్య

ప్రచారం వల్ల ఉద్యమాన్ని తగ్గించాలనే దుర్బుద్ధి ప్రభుత్వానికి ఎందుకు కలిగింది? సహాయ నిరాకరణలో మాత్రం ఉద్యోగులు అటు ప్రభుత్వానికి, ఇటు ప్రజలకు తాము కార్యాలయాలకు హాజరవుతూనే పనిని మాత్రం నిరాకరిస్తున్నా మని చాలా స్పష్టంగా చెప్పారు. బ్రిటిష్ వలస ప్రభుత్వానికి వ్యతిరేకంగా గాంధీ (సహాయ నిరాకరణ అనేది గాంధీ కంటే ముందు చాలా మందే చేసిననూ, ప్రభుత్వానికి గాంధీ ఉదాహరణే ఒప్పుతుందేమో!) ప్రారంభించిన ఈ నిరసన రూపాన్ని ప్రస్తుత తెలంగాణ ఉద్యమ నేపథ్యంలో చాలా స్పష్టంగా ప్రకటిస్తూనే ఉద్యోగులు సహాయ నిరాకరణకు దిగారు. ఇందులో ఏ దోబూచులాటలూ లేవు. కనుక ఆయా సందర్భాల లోని నిరసన రూపాలను ప్రభుత్వం మాత్రం ' సంతకం చేసుకుని పని చేయని' పనిదొంగల ఉద్యమంగా మార్చివేసిందంటే తెలంగాణ ఉద్యమం పట్ల ఎంతటి చులకన భావం ఉందో స్పష్టమవుతోంది.

రెండవ పేరాలో, 'ఇక ముందు 'నో వర్క్ - నో పే' విధానాన్ని కఠినంగా అమలు పరచాలని ప్రభుత్వం ఆదేశించింది. ఆంధ్రప్రదేశ్ సివిల్ సర్వీస్ రూల్స్ - 1964, ఆంధ్రప్రదేశ్ సివిల్ సర్వీస్ రూల్స్ - 1991 (సిసిఏ రూల్స్)ను ఉద్యోగుల ప్రవర్తన (కండక్ట్) ను నియంత్రించడానికి, ఆ ప్రవర్తనకు విఘాతం కలిగినపుడు క్రమశిక్షణా చర్యలకు చొరవ చూపేందుకు గాను అమలు చేయడానికి ప్రభుత్వం సిద్ధంగా ఉంది' అని ప్రకటించింది. పై రెండు నియమావళుల ఆధారంగానే సాధారణంగా ఉద్యోగుల సత్ప్రవర్తనను కొలుస్తుంటారు. అయితే ఈ సందర్భంలో దీన్ని మరోసారి నొక్కి చెప్పడంలో ఆంతర్యం ఏమిటంటే తెలంగాణ ఉద్యమంలో పాల్గొంటే దానికి క్రమశిక్షణ రాహిత్యంగానే ముద్రవేసి ఆ నియమావళులను కఠినంగా అమలు పరుస్తామని బెదిరించడమే.

మూడవ పేరా విషయానికి వస్తే గతంలో సమ్మెలకు సంబంధించి సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పులను మూడింటిని ప్రధానంగా ప్రస్తావించారు. అవి 1) బంకింగ్‌హామ్ కార్నాటిక్ కంపెనీ లిమిటెడ్ వర్సెస్ వర్కర్స్ ఆఫ్ బంకింగ్‌హాం కార్నాటిక్ కంపెనీ లిమిటెడ్; 2) బి.ఆర్.సింగ్ వర్సెస్ యూనియన్ ఆఫ్ ఇండియా; 3) టి.ఆర్. రంగరాజన్ వర్సెస్ గవర్నమెంట్ ఆఫ్ తమిళనాడు. వీటిలో మూడవ కేసును ప్రస్తుత ప్రభుత్వం ఎక్కువగా నొక్కి మాట్లాడుతున్నది. ఇది గతంలో తమిళనాడుకు ముఖ్యమంత్రిగా ఉన్న జయలలిత ప్రభుత్వంలోని ఉద్యోగులు సమ్మె చేసినపుడు ప్రభుత్వం 'ఎస్మా' ప్రయోగిస్తే దానికి వ్యతిరేకంగా ఉద్యోగులు సుప్రీంకోర్టుకు వెళ్లినప్పుడు ఇవ్వబడిన తీర్పు. ఈ తీర్పు అక్కడి ఉద్యోగులకు వ్యతిరేకంగా ఇవ్వబడిన తీర్పు. సమ్మె అనేది ఉద్యోగులకు 'హక్కు కాదని ఇచ్చిన తీర్పు అది. దీనిని ఉటంకిస్తూ మూడవ పేరాలో ఈ విధంగా రాయబడింది. '(పై తీర్పు ఆధారం) చట్టబద్ధమైన హక్కులను దాటి, ఉద్యోగులు సమ్మె ద్వారా సమాజాన్ని ఆర్థిక ఇబ్బందులకు గురిచేసే దిశగా పోలేరు. కొంత అన్యాయం ఎక్కడైనా ఉన్నట్లు భావించిననూ, ఒక ప్రజాస్వామ్య సంక్షేమ రాజ్యంలోని ఉద్యోగులుగా వారి కష్టాల నివారణకు చట్టబద్ధమైన ఏర్పాట్లలో భాగంగానే ముందుకు పోవాలి. ఒక ఆయుధంగా సమ్మె అనేది చాలా సందర్భాలలో దుర్వినియోగమై అల్లర్లకు, నిర్వహణలో అపసవ్యతకు దారితీసింది. నిరుద్యోగం పెద్ద మొత్తంలో ఉన్న అర్హతగల వ్యక్తులు ఆతృతతో ఉద్యోగాల కోసం ఎదురుచూసే సమాజంలో సమ్మె తీవ్ర ప్రభావాన్ని చూపుతుంది. ప్రభుత్వ శాఖలలో గానీ, ప్రభుత్వంచే నిర్వహించబడే రంగంలో గానీ సమ్మె న్యాయబద్ధమైనది కాదు. వారి కష్టాల నివారణకు సమ్మెకు దిగే బదులు, ఉద్యోగులు మరింత పనిని నిజాయితీగా, శ్రద్ధగా, శక్తిమంతంగా చేస్తే పై అధికారులు, పెద్ద మొత్తంలో ప్రజలచే ప్రశంసించబడతారు.' ఇదీ ప్రభుత్వ వాదన. అసలు ఈ జి.ఓ.ను మొదటి పేరాలో రిజిస్టర్‌లో సంతకాలు చేసి పని చేయని ఉద్యోగుల కోసమేనని చెప్పి, ఈ మూడో పేరా అంతటా సమ్మె గురించి ఎందుకు మాట్లాడినట్లు? సమ్మె అనేది అందరు ఉద్యోగులకూ సంబంధించిన విషయం. కనుక ఈ జి.ఓ. ఉద్యోగులందరిపైనా ఎక్కుపెట్టిన బాణమని దీంతో తేటతెల్లమవుతుంది. భవిష్యత్‌లో తెలంగాణ ఉద్యోగులు సమ్మె బాట పట్టే ఆలోచన ఉన్న దృష్ట్యా, 'సమ్మె చేస్తే జాగ్రత్త!' అని హెచ్చరించడానికే సమ్మె గురించి ఈ సుదీర్ఘమైన అభిప్రాయాన్ని వెలిబుచ్చింది.

చికాగోలో కార్మికుల సమ్మె ఫలితంగానే ప్రపంచవ్యాప్తంగా 12 గంటల పని విధానం రద్దై ఎనిమిది గంటల పనివిధానం వచ్చిన విషయాన్ని మరచిపోయి, అటు తర్వాత అనేక సమ్మెల వల్ల కార్మికవర్గాలు లబ్ధిపొందిన, న్యాయమైన డిమాండ్లను సాధించుకున్న విషయాన్ని మరిచిపోయి, ఉద్యోగులపై 'ఎస్మా' ప్రయోగించిన జయలలిత సర్కారుపై అసెంబ్లీ వేదికగా నిప్పులు చెరిగిన రాజశేఖరరెడ్డి (ఆనాడు ప్రతిపక్ష నాయకుడు) ప్రభుత్వ వారసులు ఇప్పుడు అదే కేసును ఉదాహరణగా చూపిస్తూ సమ్మె వల్ల నష్టాలను ప్రబోధిస్తూ ఉద్యోగులపై జి.ఒ. 177ను ఎక్కు పెట్టారు. సమ్మె వల్ల ఒక పేరా నిండా రాసిన వారికి, సమ్మె వల్ల పొందిన విజయాలను గురించి, తీరిన కనీస డిమాండ్‌ల గురించి రాసిన వేలాది పుస్తకాలన్నీ చెత్త పుస్తకాలైపోయాయి. చివరలో ఉద్యోగులకు ఒక ఉచిత సలహా పారేశారు. అవసరానికంటే ఎక్కువ పని చేసి, కష్టాలన నివారించుకోమని, ఆనాడు గాంధీకి ఈ విషయం తెలిస్తే బాగుండేది, సహాయ నిరాకరణ చేసేవాడు కాదేమో. మరింత ఎక్కువగా పనిచేస్తే అది నిరసన రూపం ఎలా అవుతుంది? ఉద్యోగులను కష్టాలు పెడితే మరింత ఎక్కువ పని చేస్తారన్నపుడు, ప్రభుత్వాలు ప్రతిరోజూ లెక్కకు మించిన కష్టాలు పెట్టవా? అసలు సమ్మెకు ప్రత్యామ్నాయం ఎక్కువ పని చేయడమా? ఇదేం విచిత్రమైన వాదన? చిన్న పిల్లలైనా నవ్వుకునేటట్లు లేదా ఈ సలహా?

ఇక నాలుగవ పేరా విషయం చూద్దాం? పై విషయాలన్నీ పరిశీలించిన మీదట భవిష్యత్తులో బంద్‌లు, సమ్మెలు, సహాయ నిరాకరణ మొదలైన సందర్భాలలో అదనపు ఉత్తర్వులకై చూడకుండా ఈ కింది చర్యలు తీసుకోవచ్చునని చెప్పబడింది.

1) ఆందోళనకు సంబంధించి రోజువారి రిపోర్ట్ ప్రభుత్వానికి ఫాక్స్ ద్వారా పంపడం. 2) హాజరు రిజిస్టర్‌లో సంతకం చేసి విధులకు హాజరు కాని వారిని గమనించి, వారికి సంబంధించిన రికార్డు తయారు చేయడం. 3) ఆందోళనలలో పాల్గొనని ఉద్యోగులకు రక్షణివ్వడం. 4) అలాంటి వారిని అడ్డుకునే ఉద్యోగులపై క్రిమినల్ చర్యలకు చొరవ తీసుకోవడం. 5) కార్యాలయ ప్రాంగణంలో ప్రభుత్వ మర్యాదకు, హుందాతనానికి భంగకరంగా ఆటలు ఆడడం, డప్పులు కొట్టడం వంటి కార్యక్రమాలు చేసే ఉద్యోగులపై క్రమశిక్షణ చర్యలు తీసుకోవడం. 6) పనిచేయని రోజులకు 'నో వర్క్ - నో పే' విధానాన్ని కఠినంగా అమలు పరచడం. 7) ఆంధ్రప్రదేశ్ సివిల్ సర్వీస్ ప్రవర్తనా నియమావళి - 1964 ను భంగపరిచే విధంగా ఆందోళనలో పాల్గొన్న ఏ ఉద్యోగిపై నైనా ఆంధ్రప్రదేశ్ సివిల్ సర్వీస్ నియమావళి - 1991 (సిసిఏ రూల్స్) ప్రకారం తగిన క్రమశిక్షణ చర్యలు తీసుకోవడం.

తెలంగాణ ఉద్యమం లాంటి ప్రజాస్వామిక, శాంతియుత ఉద్యమం పైన ప్రభుత్వం తీసుకోదలచిన చర్యలివి. ఉద్యోగస్తులపై చర్యలు తీసుకునే విషయంలో ప్రవర్తనా నియమావళులలో తప్ప ప్రత్యేక జి.ఒ.లు తీసి వాటిలో కఠిన చర్యలను ప్రస్తావించడానికి సాధారణంగా వెనకడుగు వేసే

ప్రభుత్వం తెలంగాణ ఉద్యమాన్ని ఉద్యోగుల క్రమశిక్షణా వ్యతిరేక ఉద్యమంగా చూపి క్రమశిక్షణ చర్యలకు రంగం సిద్ధం చేసింది. ఏడవ చర్య చూడండి! ప్రభుత్వం తలచుకుంటే ఎంత సక్రమంగా పనిచేసినసూ దాన్ని క్రమశిక్షణా రాహిత్యంగా చిత్రీకరించవచ్చు. అలా చేసి ఏడవ చర్య ప్రకారం శిక్షిస్తుందన్న మాట. ఈ ఏడవ చర్యను సాధారణ మాటల్లో చెప్తే 'నువు ఏం చేసినా తప్పే!' అని ఉద్యోగులను బెదిరించడమే.

ఈ ఉత్తర్వులను రాష్ట్రంలోని ఉద్యోగులందరికీ పంచి, కార్యాలయాలలో నోటీస్ బోర్డులపై ఉంచుతామని ఐదవ పేరాలో, సచివాలయ శాఖలు, శాఖాధిపతులు, కలెక్టర్లు తదుపరి అవసరమైన చర్యలు తీసుకోవాలని ఆరో పేరాలో సూచించారు.

జి.ఒ. ముగింపులో ఒక వాక్యం ఇలా ఉంది – 'బై ఆర్డర్ అండ్ ఇన్ ది నేమ్ ఆఫ్ ది గవర్నర్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్.' ఆంధ్రప్రదేశ్ గవర్నర్‌కి ఈ విషయాన్ని తెలియపరుస్తూ వారి ఆజ్ఞతో, వారి పేరు మీద ఈ ఉత్తర్వు ఇవ్వబడిందని రాశారు. అంటే ఈ విషయం గవర్నర్‌కి కూడా తెలుసునన్నమాట. తెలిసీ ఏం అభ్యంతరం చెప్పలేదన్న మాట.

జి.ఒ. పొడుగునా 'తెలంగాణ' అనే పదం రాకుండా జాగ్రత్త పడింది. తెలంగాణ ఉద్యమం నేపథ్యంలో ఈ జి.ఒ. జారీ కాలేదని, ఇదొక సాధారణ ఉత్తర్వు అని నిరూపించుకోడానికి 'తెలంగాణ' అనే పదాన్ని ఎక్కడా ఉపయోగించలేదు. అయినా సరే, ఈ ఉత్తర్వు తెలంగాణ ఉద్యమాన్ని తగ్గించేందుకే చేసిందనడానికి మూడు కారణాలున్నాయి. 1) జి.ఒ.లో పేర్కొన్నట్లు 'ఇటీవల జరిగిన బంద్‌లు, ధర్నాలు, సహాయ నిరాకరణలు' తెలంగాణ ప్రాంతంలోనే జరిగాయి. 2) సమ్మె గురించి సుదీర్ఘంగా చర్చించినందు వల్ల, అసలు సమ్మె చేయాలని ఈ మధ్య ఎక్కువగా అంటున్నది తెలంగాణ ఉద్యోగులే కనుక. 3) ఇదొక సాధారణ ఉత్తర్వు అయితే, అలాగే రాష్ట్రంలోని అందరు ఉద్యోగులకు సంబంధించిందే అయితే ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని జె.ఎ.సి.లకు, సంఘాలకు జి.ఒ. ప్రతులు ఇవ్వాలి. కానీ రాష్ట్రంలోని అందరికీ ఈ జి.ఒ. ప్రతులు ఇస్తున్నట్లు ప్రకటిస్తూనే తెలంగాణ ప్రాంతంలోని ఉద్యోగులు, ఉపాధ్యాయులు, శ్రామికుల జె.ఎ.సి.లకు కూడా ఇస్తున్నట్లు ప్రత్యేకంగా రాశారు. వీటిని బట్టి అసలు ఈ జి.ఒ. తెలంగాణ ప్రాంత ఉద్యోగుల కోసం తీసిందేనని ప్రభుత్వం చెప్పకనే చెప్పుకున్నది.

కనుక జి.ఒ. 177 ఉద్యోగుల కనీస హక్కులను, డిమాండ్‌ల సాధన మార్గాలను తుడిచివేసే కఠిన ఉత్తర్వులు. ఏ పనుల ద్వారానైతే శ్రామికులు, కార్మికులు, ఉద్యోగులు సంవత్సరాల తరబడి హక్కులను పరిరక్షించుకుంటూ, సాధించుకుంటూ వస్తున్నారో వాటిని అప్రజాస్వామికమని చిత్రించే క్రమంలో తీసిన ఉద్యోగ వ్యతిరేక జి.ఒ. ఇది. ముఖ్యంగా తెలంగాణ ఉద్యమం వంటి శక్తిమంతమైన ఉద్యమాన్ని, దాని తీవ్రతను తగ్గించే ప్రయత్నంలో భాగమే ఈ జి.ఒ. కనుక ఆనాటి స్వాతంత్ర్యోద్యమ వ్యాప్తిని తగ్గించాలని బ్రిటిష్ వారు రౌలర్ చట్టాన్ని తీస్తే దాని పర్యవసానం సహాయ నిరాకరణోద్యమానికి దారితీసి స్వాతంత్ర్యోద్యమం మరింత శక్తిమంతమైనట్లు, జి.ఒ. 177ల వంటి ఉత్తర్వులతో తెలంగాణ ఉద్యమం మరింత శక్తిమంతమవుతుందని తమ ముమ్ముందు ఉద్యమాల ద్వారా నిరూపించవలసిన బాధ్యత తెలంగాణ ఉద్యోగులపైననే ఉంది.

*(రచయిత ఉపాధ్యాయుడు, తెలంగాణ ఉద్యమ కార్యకర్త)* వీ



F.No.56-2/RO/Mag/10-11/IP/216/5516

కొద్ది మంది లాభాల కోసం, అతి కొద్దిమందికి ఉపాధి కల్పించి, ఎక్కువ మంది జీవన పరిస్థితులను అతలాకుతలం చేయబోతున్న కనపర్తి థర్మల్ విద్యుత్ ప్రాజెక్ట్ గురించి వివరిస్తున్నారు **చిట్టిపాటి వెంకటేశ్వర్లు**

# సోంపేట, కాకరాపల్లి బాటలో కనపర్తి

జపాన్ ప్రమాదం తర్వాత జర్మనీ, స్విట్జర్లాండ్ తదితర దేశాలు తమ తమ దేశాలలో అణు విద్యుత్ ప్రాజెక్టలను రద్దు చేసుకున్నాయి. ఫుకుషిమా రేడియేషన్ భయంతో అమెరికా మొదలు ఆంధ్ర జిల్లాలలో సైతం అణు విద్యుత్ కేంద్రాలకు వ్యతిరేకంగా ప్రజలు ఆందోళనలు చేస్తున్నారు. కాని బ్రిక్స్ దేశాల సమావేశం కోసం వెళ్ళిన మన ప్రధాని అణు విద్యుత్ అవసరం గురించి అనివార్యత గురించి గొప్పతనం గురించి మాట్లాడటం వెనుక ప్రజల ప్రయోజనం కంటే అమెరికా వాణిజ్య వర్గాల ప్రయోజనం దాగి ఉందని మన పార్లమెంటులో అణు ఒప్పందం బిల్లుపై చర్చలు ప్రహసనంగా జరిగి ఆమోదం పొందినప్పుడే అందరికి అర్థమయ్యింది. అణు విద్యుత్ అయినా, థర్మల్ విద్యుత్ అయినా ఈ దేశ ప్రజల ప్రయోజనాల కంటే బహుళ జాతి సంస్థల, సామ్రాజ్యవాద దేశాల ప్రయోజనాలు రక్షించడమే ఇక్కడి దళారీ పాలకుల లక్ష్యంగా ఉంది. ఈ రహస్య అజండాను ప్రజలు గుర్తించకుండా పాలకులు ప్రజలను వంచించడానికి, మభ్యపెట్టడానికి 'అభివృద్ధి' ముసుగును తగిలిస్తున్నారు. ఈ అభివృద్ధి ముసుగును చీల్చి పాలకపార్టీల నిజ స్వరూపాన్నీ, పెట్టుబడి దాష్టీకాన్నీ సోంపేట, కాకరాపల్లి ప్రజలు ఇప్పటికే వెలుగులోకి తెచ్చారు. థర్మల్ పవర్ ప్లాంటుకి వ్యతిరేకంగా జరిగిన ఉద్యమంలో సోంపేట గుండెల్లో దిగిన తూటా, కాకరాపల్లిలో విరిగిన లాఠీ సముద్ర తీర ప్రాంత ప్రజల్లో భయాందోళనలు రేకెత్తించక పోగా ఉద్యమ ప్రతిధ్వనిని, సంఘీభావాన్ని, సంఘటిత ఉద్యమాన్ని అందించింది. సోంపేట మొదలు నెల్లూరు వరకు నిర్మించే థర్మల్ పవర్ ప్లాంటులకు వ్యతిరేకంగా ప్రజలు ఉద్యమిస్తూనే ఉన్నారు. సోంపేట, కాకరాపల్లి బాటలోనే నేడు కనపర్తి కూడా అడుగులు వేస్తున్నది.

పచ్చని పంట పొలాలు ఒక వైపు,తెల్లగా నిలువెత్తు రాశులు పోసిన ఉప్పు కొఠారులు మరొక వైపు చూడటానికి ముగ్ధ మనోహరంగా ఉండే కనపర్తి, జిల్లా కేంద్రమైన ఒంగోలుకి 40 కి.మీ. దూరంలోనూ, జాతీయ రహదారికి తూర్పుగా 30 కి.మీ దూరంలో ఉంది. గుండ్లకమ్మ నది సముద్రంలో కలిసే ప్రాంతంలో ఉండే కనపర్తి గతంలో 'కనకాపురి'గా ప్రాశస్త్యం పొందిన చారిత్రక ప్రదేశం కూడా. ప్రకాశం జిల్లా నాగులుప్పలపాడు మండలం కనపర్తి దగ్గర మంజూరైన థర్మల్ ప్లాంటును ఎ.పి.జెన్‌కో నిర్మించడానికి పూనుకుంది.గుంటూరు జిల్లా నిజాంపట్నం నుండి ప్రకాశం జిల్లా కనపర్తి వరకు 5 ప్రాంతాలలో సర్వే చేసినప్పటికి వెటపాలెం దగ్గర నాయినిపల్లిలోనూ దానికి 15 కి.మీ.దూరంలో ఉన్న కనపర్తి దగ్గర 8 500 మె.వా. అల్ట్రా మెగా పవర్ ప్లాంటుని నిర్మించడానికి ఎ.పి.జెన్‌కో ప్రభుత్వంతో ఒప్పందం కుదుర్చుకుంది. దీని కోసం ఆంధ్రప్రదేశ్ పవర్ ఫైనాన్స్ కార్పొరేషన్ రు.6800 కోట్లు రుణం కూడా మంజూరు చేసింది. ఈ ప్రాజెక్ట్ మొత్తం వ్యయం సు.22 వేల కోట్లు. దీనిలో 26 శాతం పెట్టుబడులు ఎ.పి. జెన్‌కోవి కాగా మిగిలిన 74 శాతం పెట్టుబడులు ఎక్కడ నుండి సమీకరించేది ఇంత వరకు ప్రభుత్వంగానీ, ఎ.పి.జెన్‌కో గానీ స్పష్టం చేయలేదు.

ఎ.పి.జెన్‌కో కనపర్తి దగ్గర నిర్మించబోయే థర్మల్ పవర్ ప్లాంటుకి 2638 ఎకరాలు భూమి అవసరం అవుతుంది. దీనికోసం అసైన్డ్ భూమి, రైతుల పట్టా భూమి కూడా సేకరించడానికి పూనుకుంది.ఈ ప్రాజెక్ట్‌కి అవసరమైన నీటిని సముద్రం నుండి ఆర్.ఓ.ట్రీట్ ద్వారా, గుండ్లకమ్మ ప్రాజెక్ట్ నుండి 0.5156 టి.ఎం.సి.ల నీటిని సేకరించుకుంటానని కూడా ఎ.పి.జెన్‌కో తెలియజేసింది. ఈ థర్మల్ ప్లాంటు కోసం సంవత్సరానికి 13.33 మిలియన్ టన్నుల బొగ్గు అవసరం అవుతుందనీ, 7.82 మిలియన్ టన్నుల బొగ్గు దేశీయ కంపెనీల నుండి 5.213 మిలియన్ టన్నుల బొగ్గు ఇతర దేశాల నుండి దిగుమతి చేసుకుంటానని చెప్పింది. దీనికోసం భవిష్యత్‌లో రైల్వే, ఓడరేవులను ఇంకా అభివృద్ధి చేసుకోవాల్సి ఉంటుందని అధికారులు చెబుతున్నారు. దీంతో కనపర్తి ప్రాంతం పారిశ్రామికంగా అభివృద్ధి చెందడమే కాకుండా ప్రజల భవిష్యత్ రూపురేఖలే మారి పోతాయని భ్రమలు కల్పిస్తుంది. ఆశలు కల్పిస్తుంది. ఈ ప్రాజెక్ట్‌ని ప్రజలపై రుద్దడానికి అధికార యంత్రాంగం, అధికార పార్టీ ప్రయత్నాలు ముమ్మరంగా కొనసాగిస్తూనే ఉంది.

ఎ.పి.జెన్‌కో తలపెట్టబోయే థర్మల్ విద్యుత్ ప్లాంటుకి నాగులుప్పలపాడు మండలం కుక్కలవారిపాలెం, కనపర్తి, దాసరివారిపాలెం, వినోదరాయునిపాలెం, చవటపాలెం, అమ్మనబ్రోలు, పెద దేవరంపాడు, చింతాయగారిపాలెం, తదితర గ్రామాలకు చెందిన వ్యవసాయ భూములు, ఉప్పుభూములు, అవసరమవుతాయి.ఈ భూములపై ముప్ఫై వేల మంది రైతులు ఆధారపడి జీవిస్తున్నారు.గుండ్లకమ్మపై నిర్మించిన ఎత్తిపోతల పథకం ద్వారా 4045 ఎకరాలలో వరి, మినుము, పెసర తదితర పంటలు పండిస్తున్నారు. ఉలిచి దగ్గర చెక్ డ్యాం నిర్మించడంతో నీరు గ్యారంటీ చేయబడి రెండు పంటలు పండిస్తున్నారు. సారవంతమైన భూములైనందున ఈ ఎత్తిపోతల పథకం కింద 2 లక్షల బస్తాల వరి ధాన్యం పండిస్తున్నారు. వ్యవసాయ కూలీలకు సంవత్సరం మొత్తం

మీద పని లభిస్తుంది.పశువులకు జీవనాధారమే కాకుండా పాడి పరిశ్రమకు కూడా ఈ ప్రాంతం తోడ్పాటుగా ఉంది.

దీనికి తోడుగా కనపర్తిలో కేంద్ర,రాష్ట్ర పురావస్తు శాఖలు ఉన్నాయి. 11వ శతాబ్దం నాటి ప్రాచీన శైవ క్షేత్రాలు, పాత రాతియుగం లో ఉపయోగించిన పరికరాలు ఇతర అవశేషాలు ఉన్నాయి. చారిత్రక ఆధారాలు లభ్యమయ్యే ప్రాంతాలలో 10 కి.మీ.చుట్టూ ఎటువంటి భారీ నిర్మాణాలు చేపట్టకూడదని అటవీ, పర్యావరణ మంత్రిత్వ శాఖ మార్గదర్శక సూత్రాలు కూడా ఉన్నాయి. ఇటువంటి చారిత్రక ప్రదేశాలను కనుమరుగు చేసే, వేలాది మంది జీవనోపాధిని దెబ్బతీసే థర్మల్ ప్రాజెక్ట్ ఇక్కడ అవసరం లేదని ప్రజలు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు.

ప్రజల అభిప్రాయాన్ని తోసిరాజని 12 జనవరి 2010న ప్రకాశం జిల్లా స్పెషల్ కలెక్టర్ 1894 భూసేకరణ చట్టం ఆధారంగా నోటిఫికేషన్ విడుదల చేశారు. ప్లాంటు నిర్మాణంపై పబ్లిక్ హియరింగ్ గ్రామాల్లో కాకుండా 2010 సెప్టెంబర్ 17న నాగులుప్పలపాడులో పెట్టారు. ప్రజలు తీవ్రస్థాయిలో నిరసన వ్యక్తం చేయడంతో పబ్లిక్ హియరింగ్ జరపకుండానే వెనుతిరిగారు. ఈ ప్రాంతంలో భూముల రిజిస్ట్రేషన్‌ను బంద్ చేశారు. ప్రభుత్వం ప్రజల్ని లొంగదీయాలని అనేక ప్రయత్నాలు చేస్తుంది. కనపర్తి ఎత్తిపోతల పథకం రాష్ట్ర ప్రభుత్వం చేత రెండుసార్లు ఉత్తమ అవార్డులు పొందినా ఈ ప్రాంతం సాగునీటి సౌకర్యంతో రెండు పంటలు పండుతున్నా ఈ భూమిని మెట్ట భూమిగా చూపిస్తూ అధికారులు తప్పుడు రిపోర్టులు ప్రభుత్వానికి పంపారు. సోంపేటలో, కాకరాపల్లిలో కూడా బీల భూముల్ని పనికిరాని బంజరు భూములుగా చూపిస్తే ఇక్కడ మాగాణి భూముల్ని మెట్ట భూములుగా చూపించారు. మొత్తం మీద సముద్రతీర ప్రాంత భూములు నిరుపయోగమైనవని తమ పెట్టుబడులతో ఎంతో అభివృద్ధి చేస్తామని ఈ అభివృద్ధిని కొంతమంది అడ్డుకుంటున్నారని గగ్గోలు పెడుతున్నారు. ఇది వాస్తవం కాదు. ఉపాధిని కొల్లగొట్టవద్దంటున్నారు కనపర్తి ప్రజలు.

థర్మల్ ప్లాంట్ నిర్మాణం కోసం ప్రభుత్వం సేకరించే 2638 ఎకరాలలో 900 ఎకరాలు అసైన్డ్ భూములు. వీటిని ఎక్కువగా దళితులు ఇతర సన్న, చిన్నకారు పేదరైతులే సాగు చేస్తున్నారు. ఈ భూముల్ని సైతం ప్రభుత్వం పేదల నుండి లాగేసుకొని కంపెనీల పరం చేయబోతుంది. భూములు కోల్పోయే రైతులు వ్యవసాయ కూలీలు పవర్‌ప్లాంటు కాలుష్య కోరల్లో చిక్కే ప్రజానీకం మొత్తం సంఘటితంగా జెన్‌కో వ్యతిరేక పోరాట కమిటీగా ఏర్పడ్డారు. గత సంవత్సర కాలంగా ఆందోళనలు చేస్తునే ఉన్నారు. పాదయాత్రలు చేశారు.జిల్లా కలెక్టరు కార్యాలయాన్ని దిగ్బంధనం చేశారు. జిల్లా మంత్రి ఇల్లు ముట్టడి చేశారు. గ్రామ పంచాయితీలన్నీ పవర్ ప్లాంటులు వద్దని ఏకగ్రీవంగా తీర్మానం చేశాయి. పంచాయితీ ఎన్నికలను బహిష్కరించారు.

ప్రాజెక్టని రద్దు చేయాలని లేదా తమను చంపి తమ సమాధుల మీద ప్రాజెక్టని కట్టుకొమ్మని తెగేసి చెబుతున్నారు. ప్రాజెక్టని నిలిపి వేస్తామని ప్రభుత్వం స్పష్టమైన హామీ ఇవ్వలేదు పైగా ప్రభుత్వం, తన దళారీలు ఉద్యమాన్ని చీల్చడానికి రకరకాల కుట్రలు కుయుక్తులు పన్నుతున్నారు. జెన్‌కో సాధన సమితి పేరుతో పత్రికా ప్రకటనలు ఇప్పిస్తున్నారు. ఇండియన్ ఆయిల్ కార్పోరేషన్ 3 పెట్రోలు బంకులను మంజూరు చేసింది. వీటి ఏజెన్సీలను స్థానికులకు కట్టబెట్టడం ద్వారా కొంతమందినైనా తమకు అనుకూలంగా మార్చుకోవాలని ప్రజా ఉద్యమంలో చీలిక తీసుకు రావాలని దుష్ట బుద్ధితో ప్రభుత్వం, కంపెనీ కుట్రలు చేస్తున్నాయి.

4వేల మెగావాట్ల థర్మల్ పవర్ ప్రాజెక్ట్ నిర్మాణం చేపడితే కనపర్తికి 20 కి.మీ పరిధిలో పంటలపై, మనుష్యులపై తీవ్ర కాలుష్య ప్రమాదం ఉంటుందని ప్రజలు,పర్యావరణ వేత్తలు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. ఈ ప్రాంతాలలో వరి దిగుబడి 40 శాతం తగ్గిపోతుంది. థర్మల్ పవర్ ప్లాంటులు ప్రమాద కాలుష్య కారకాలు అని పార్లమెంటరీ సబ్ కమిటీ కూడా ఇటీవల తన నివేదికలో స్పష్టం చేసింది.సముద్రం నుండి తీసుకున్న నీళ్లను బొగ్గు ద్వారా మరిగించి వచ్చే నీటి ఆవిరితో టర్బైన్స్ తిప్పడం ద్వారా విద్యుత్‌ను ఉత్పత్తి చేస్తారు. దీని కోసం వేల టన్నుల బొగ్గును మండించాల్సి ఉంటుంది. 4000 మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తి కోసం రోజుకి 36 వేల టన్నుల బొగ్గును మండిస్తే 15 వేల టన్నుల బూడిద వస్తుంది. కొంత ప్లాంటు లోని గొట్టాల ద్వారా గాలిలోకి పోగా మిగిలినది ట్రక్కులతో,లారీలతో వేలాది టన్నులు చెరువులలోకి తరలిస్తారు. ఇది ఎండకు ఎండినప్పుడు గాలిలోనూ, వర్షానికి తడిసినప్పుడు నీళ్లలోనూ కలిసి ప్రవహిస్తుంది. దీనితో గాలి, భూగర్భ జలాలు కలుషితం అవుతాయి. బొగ్గును మండించినప్పుడు వెలువడే గంధకం, పాదరసం, రేడియోధార్మిక ఐసోటోపులు జనంపై,పశువులపై ప్రతికూల ప్రభావాన్ని చూపుతాయి. ఈ విద్యుత్ ఉత్పత్తి సందర్భంలో మరిగిన వేడి నీటిని, బూడిదను సముద్రంలోకి వదిలి వేయడంతో, మత్స్యసంపదకి ఇతర జీవ జాతుల మనుగడకి తీవ్ర ప్రమాదం ఏర్పడే అవకాశాలున్నాయి. మత్స్యకారుల జీవనోపాధి ప్రశ్నార్థకంగా మారే ప్రమాదం ఉంది.

మనకి అవసరమైన విద్యుత్ ఎంత? మన రాష్ట్రంలో ఉత్పత్తి కోసం మంజూరు చేసిన ప్రాజెక్టులు ఎన్ని? ప్రభుత్వ లక్ష్యం ఏమిటి? అని పరిశీలిస్తే ప్రభుత్వం కుట్ర మనకు అర్థమవుతుంది. మన రాష్ట్రంలో విద్యుత్ సామర్థ్యం 14,540 మెగావాట్లు. కాగా మనకు 12,200 మెగా వాట్లు విద్యుత్ అవసరం. ప్రస్తుతం జల విద్యుత్, థర్మల్ విద్యుత్ ఇతర పద్ధతుల ద్వారా 10,880 మెగావాట్ల విద్యుత్ తయారవుతోంది. 1320 మెగావాట్ల విద్యుత్ ప్రస్తుతం కొరతగా ఉందని ఒక అంచనా. ప్రస్తుతం రాష్ట్రంలో శ్రీకాకుళం జిల్లా ఇచ్ఛాపురం నుండి నెల్లూరు జిల్లా తడ వరకు 76 పవర్ ప్లాంటులకు ప్రతిపాదనలు రాగా 36 పవర్ ప్లాంటులకు ప్రభుత్వం అనుమతి ఇచ్చింది. ఈ ప్రాజెక్టుల ద్వారా సుమారు 38వేల మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తి అవుతుంది. ఈ ఉత్పత్తి అమ్మకం లక్ష్యంతో ఉత్పత్తి అవుతుంది. ఇదంతా కేవలం బహుళ జాతి సంస్థల పక్కా వ్యాపారం కోసమే. సముద్ర తీర ప్రాంతాలలో ఉత్పత్తి చేసిన విద్యుత్‌ని పరాయి రాష్ట్రాల కార్పోరేట్ సంస్థలకు అమ్ముకొని సొమ్ము చేసుకొనే లాభాల దాహం తప్ప ఇందులో ప్రజల అభివృద్ధి నామ మాత్రమే. ఇవన్నీ వాణిజ్య విద్యుత్ ప్రాజెక్టులు భవిష్యత్‌లో రాష్ట్రం ఇబ్బందులలో ఉన్నా,కారు చీకట్లు కమ్ముకుంటున్నా ధర ఎక్కువ ఎవరు పెట్టగలిగితే వారికే విద్యుత్‌ను యథేచ్ఛగా అమ్ముకోవచ్చు. రాష్ట్రంలో వాణిజ్య విద్యుత్ విధానం ఇంత వరకు ఖరారు కాలేదు. వాణిజ్య ప్రాజెక్టులు 75 శాతం అమ్ముకొని 25 శాతం రాష్ట్రానికి అమ్మే ప్రతిపాదనలతో వాణిజ్య విద్యుత్ విధానానికి కేంద్ర ఇంధన శాఖ ఇటీవలే ప్రతిపాదనలు చేసి పంపింది. ఇది ఆమోదం పొందడమే ఆలస్యం. థర్మల్ పవర్ ప్లాంట్లు అత్యధికం అటు శ్రీకాకుళం జిల్లాలోనూ, ఇటు

నెల్లూరు జిల్లా లోనూ నిర్మించడంలో ప్రభుత్వం, వ్యాపార వర్గాల దూర దృష్టి, కుట్ర దాగి ఉన్నాయి. శ్రీకాకుళం, నెల్లూరు జిల్లాలు ఇతర రాష్ట్రాలకు అనుకొని ఉన్నందున అటు ఒడిశా, మధ్యప్రదేశ్ ఇటు తమిళనాడు కర్ణాటకలకు విద్యుత్ వ్యాపారం చేసుకోవడానికి అనువుగా ఉంటుంది.

థర్మల్ పవర్ ప్లాంటులను వ్యతిరేకించినప్పుడల్లా ప్రభుత్వం 'అభివృద్ధి' మంత్రాన్ని జపిస్తుంది. అభివృద్ధి పేరుతో మధ్య తరగతి వర్గాల మద్దతును కూడ గట్టాలని ప్రభుత్వం ప్రయత్నిస్తుంది. ఒకవైపు ఉచిత విద్యుత్ కావాలని అడుగుతారు, మరోవైపు విద్యుత్ ప్రాజెక్టులు వద్దని ఆందోళన చేస్తారని ఆందోళనకారులపై నిందలు మోపుతుంది. అభివృద్ధికి వ్యతిరేకులుగా ఉద్యమకారులను చిత్రిస్తుంది. ప్రభుత్వం దుర్మార్గపు ఎత్తుగడలతో ప్రజల్లో చీలికలు తెచ్చే కుట్రలు చేస్తుంది. ప్రభుత్వం తన దోపిడి వర్గస్వభావాన్నీ, కంపెనీ అనుకూల వైఖరిని దాచి పెట్టుకొనే ప్రయత్నం చేస్తుంది. అణు విద్యుత్ పేరుతో, థర్మల్ ప్లాంటుల పేరుతో, సెజ్‌ల పేరుతో లక్షలాది ఎకరాల పంట పొలాలను సేకరించి రైతుల నోట్లో మట్టి కొడుతుంది. వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి కోసమని ప్రాజెక్టుల పేరుతో కోట్ల రూపాయలు కుమ్మరించింది. ఆచరణలో వ్యవసాయానికి కోత విధించి ఆ ప్రాజెక్టుల నీటిని థర్మల్ ప్లాంటుకి, కోస్టల్ కారిడార్‌లకి, వాన్‌పిక్‌లకి తరలిస్తుంది. ఇది రోజురోజుకి జలయజ్ఞం అసలు లక్ష్యాన్ని బహిరంగ పరుస్తుంది. అభివృద్ధిని గురించి గొంతు చించుకొనే పాలకులు ప్రజల కోసం విద్యుత్ కేంద్రాలు స్థాపించడం నిజం కాదు. ఇప్పటిదాకా సముద్రతీర ప్రాంతాల అభివృద్ధి కోసం, అక్కడ విద్య, వైద్య సౌకర్యాలు, పేదలకు ఉపాధి కల్పించే చిన్న పరిశ్రమలు స్థాపించలేదు. సముద్రతీర ప్రాంతాలలో రోడ్లు, రవాణా సౌకర్యాలు, కోల్డు స్టోరేజీలు, మత్స్య పరిశ్రమ అభివృద్ధికి ఉపయోగపడే చర్యలు చేపట్టాలని ఆందోళన చేసినా ఏ ప్రభుత్వం పట్టించుకోలేదు. కనీస కేటాయింపులు కూడా చేయలేదు. ఇప్పటి దాకా ప్రజల వైపు అభివృద్ధి పాలకులకు పట్టలేదు. ప్రజల అవసరాల కంటే పెట్టుబడి అవసరాలు నేడు పాలకుల్ని తొందర పెడుతున్నాయి. సామ్రాజ్యవాదుల, కార్పొరేట్ సంస్థల పెట్టుబడులకు తలుపులు తెరవడం, వారి దోపిడి దౌర్జాన్యాలకు పూర్తి స్వేచ్ఛనివ్వడం మన దేశ సంపదలను కొల్లగొట్టు కోవడానికి హారతి పళ్లెంలో మన వనరులు వారికి అందించడం నేటి అభివృద్ధిగా చలామణి అవుతోంది. నిజానికి ఈ పెట్టుబడి కల్పించే ఉపాధి కంటే ప్రస్తుతం ప్రకృతిపై, వ్యవసాయంపై ఆధారపడే ప్రజలు కోల్పోతున్న ఉపాధి ఎక్కువగా ఉందంటే ఆశ్చర్యపోవాల్సిన అవసరం లేదు. కనపర్తిలో నిర్మించబోయే థర్మల్ పవర్ ప్లాంటులో కేవలం వెయ్యి మందికి ఉద్యోగాలు కల్పిస్తామని ఎ.పి.జెన్‌కో చెబుతుంది. కాని భవిష్యత్‌లో ఆ ప్రాంతంలో 30 వేల కుటుంబాల జీవన పరిస్థితులపై తీవ్ర ప్రభావం ఉంటుంది. ప్రత్యామ్నాయ సూచనలను ప్రభుత్వం ఎందుకు పరిశీలించదు?

పర్యావరణం పేరుతో, వ్యవసాయ భూములు కోల్పోతారనే పేరుతో, జీవనోపాధి కోల్పోతారనే పేరుతో థర్మల్ పవర్ ప్రాజెక్టులను అడ్డుకుంటే మన భవిష్యత్ అవసరాలు ఎలా తీరుతాయని కొంత మంది ప్రశ్నిస్తున్నారు. చిన్న చిన్న ప్రాజెక్టులు కట్టుకోవడం ద్వారా, జల విద్యుత్ కేంద్రాలపై ఎక్కువ దృష్టి కేంద్రీకరించడం ద్వారా కొంత మేరకు మన అవసరాలు తీర్చుకోవచ్చని నిపుణులు తెలియజేస్తున్నారు. ప్రస్తుతం ట్రాన్స్‌మిషన్ లీకేజీ 25 శాతం ఉంది దీనిని అరికట్టడం ద్వారా నష్టాన్ని 10-15 శాతానికి తగ్గించుకోవచ్చని కొంతమంది నిపుణులు సూచిస్తున్నారు. అలాగే సూర్యరశ్మి ద్వారా, గాలి ద్వారా, బయోమాస్ ద్వారా, సముద్ర కెరటాల ద్వారా విద్యుత్‌ని ఉత్పత్తి చేయవచ్చని మరి కొంత మంది సూచిస్తున్నారు. విద్యుత్ కేంద్రాల సామర్థ్యాన్ని మెరుగు పరచడం ద్వారా 15 శాతం విద్యుత్‌ని ఆదా చేయ వచ్చని, సరైన నిర్వహణ, యాజమాన్య పద్ధతులు పాటించకపోవడం వలన కూడా నష్టపోతున్నామని మరి కొంత మంది ప్రత్యామ్నాయాలు సూచిస్తున్నారు. ప్రభుత్వం వీటిని పరిశీలించడానికి సిద్ధంగా లేదు. 2032 సంవత్సరానికి 8 లక్షల మెగావాట్ల విద్యుత్ అంచనాల ఆతృతతో, అవసరమనే పేరుతో థర్మల్ విద్యుత్ ప్లాంటుల్లు,అణు విద్యుత్ కుంపట్లు ప్రజల గుండెలపై పెట్టబోతుంది. కనపర్తి ప్రజలు సోంపేటలై కదలాలి, కాకరాపల్లిలై కదంతొక్కాలి సముద్ర తీరప్రాంతంలో లక్షలాది మంది ప్రజల జీవనోపాధిని దెబ్బతీసి విదేశాల్లో నిషేధించిన రసాయన పరిశ్రమలను, థర్మల్ పవర్ ప్లాంటులను ప్రభుత్వం ఎందుకు అనుమతిస్తుంది. దళారీ పాలకులైన మన నేతలు సామ్రాజ్యవాదుల ప్రయోజనాలు ఏకైక లక్ష్యంగా పని చేస్తున్నారు. ఇతర దేశాలలో ముఖ్యంగా ఇండోనేషియా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా బొగ్గు గనులతో కుదుర్చుకున్న ఒప్పందాల మేరకు బొగ్గు గనుల కార్పోరేట్ సంస్థల ప్రయోజనాల కోసమే నేడు వేల టన్నుల బొగ్గు దిగుమతి కోసం సిద్దపడుతోందీ ప్రభుత్వం. ఇండోనేషియాలోని కోల్ మైనింగ్ కంపెనీ పి.టి.బరసెంటోసా లెస్టారికి ఈ రెండు బ్లాకులపై ఉన్న యాజమాన్య హక్కులను 2009లో జి.ఎం.ఆర్ ఎనర్జీ కంపెనీ 100 మిలియన్ డాలర్లకి కొనుగోలు చేసింది. దక్షిణాఫ్రికాలో బొగ్గు గనులను కలిగి ఉన్న హోమ్‌లాండ్ ఎనర్జీ గ్రూపు లిమిటెడ్‌లో కూడా జి.ఎం.ఆర్.ఎనర్జీ 33.5 శాతం వాటాను కొనుగోలు చేసింది. భారత్‌లో నిర్వహించబోతున్న బొగ్గు ఆధారిత విద్యుత్ ప్లాంటుల్లు భవిష్యత్ అవసరాలను దృష్టిలో ఉంచుకొని ఈ గనులను జి.ఎం.ఆర్ కొనుగోలు చేసిందని దాని యాజమాన్యం ప్రకటించింది. దీనిలో మన నేతలకు వారి బిడ్డలకు ఎన్ని వాటాలున్నది బొగ్గు పొరల్లో ప్రస్తుతం మనకు కన్పించకపోవచ్చు. కార్పొరేట్ సంస్థలు, అధికార యంత్రాంగం, ప్రభుత్వం మిలాఖత్తై ఎన్ని అవినీతి పనులకు పాల్పడుతుంది ఇటీవల వెలుగు చూసిన అవినీతి కుంభకోణాలు స్పష్టం చేస్తున్నాయి. దేశంలో పంట భూముల్ని క్రమంగా నాశనం చేసి భవిష్యత్‌లో ఆహార సంక్షోభం తలెత్తితే ఇతర దేశాల నుండి దిగుమతి చేసు కోవాలనే గత ఒప్పందాల దుర్బుద్ధికూడా సామ్రాజ్యవాద దేశాలకు లేక పోలేదు. దళారీ పాలకుల స్వార్థ ప్రయోజనాలు కూడా ఇందులో ఇమిడి ఉన్నాయి. స్థానిక ప్రజల ప్రయోజనాలను కాదని కార్పొరేట్ సంస్థల ప్రయోజనాల కోసం, సముద్ర తీర ప్రాంతం మొత్తం విచ్చల విడిగా థర్మల్ పవర్ ప్లాంటులను నెలకొల్పి సముద్ర తీర ప్రాంతాన్ని రసాయన వ్యర్థ పదార్థాలతో బూడిదతో నింపడానికి ప్రభుత్వాలు ప్రయత్నిస్తే మత్స్యకారులకు,రైతులకు ఇతర ప్రజలకు పోరాటమే శరణ్యం.సముద్రతీర ప్రాంతాన్ని వ్యవసాయాన్ని అక్కడ వనరులను కాపాడు కోవడానికి కనపర్తి ప్రజలు కూడా సోంపేటలై కదలాలి.కాకరాపల్లిలై కదం తొక్కాల్సిందే.

*(రచయిత సిపిఐ(ఎం.ఎల్) న్యూడెమోక్రసీ ప్రకాశం జిల్లా కార్యదర్శి)* వీ

సాంకేతిక పరిజ్ఞానంలో మేటి అయిన జపాన్ ఘోర వైఫల్యాన్ని చూసిన తర్వాత అయినా అణు విద్యుత్‌ను తీవ్రంగా వ్యతిరేకించాల్సిన, ఆపాల్సిన బాధ్యత అందరి మీదా ఉందని అంటున్నారు **డా. కె. సత్యలక్ష్మి, కె. సజయ**

# ముంచుకొచ్చిన అణు ప్రకంపనలు

**11** మార్చి 2011న జపాన్ దేశాన్ని భూకంపం, సునామి అతలాకుతలం చేయగా, దానివల్ల ఫుకుషిమా న్యూక్లియర్ పవర్‌ప్లాంట్లలో జరిగిన పరిణామాలతో ప్రపంచమంతా అణు ముప్పు ఉలికిపాటుకు గురి అయింది. ఇక ఆ రోజున మొదలైన వరుస భూకంపాలు, ఫుకుషిమా ప్రిఫెక్చర్ (రాష్ట్రం)లోని ఆరు అణు రియాక్టర్లు ఒక దాని తరువాత ఒకటి పని చేయకపోవడం, విద్యుత్తు సప్లై ఆగిపోవడం, లోపలికి నీరు రావడం, లోపలి నీరు బయటికి పోవడం, సముద్రపు నీరుతో రియాక్టర్లని చల్లార్చడానికి ప్రయత్నం చేయడం, రియాక్టర్లలో నుండి పొగలు రావడం, పేలిపోవడం లాంటి చెయిన్ రియాక్షన్ నుంచి మెల్ట్‌డౌన్ దాకా సినిమాల్లో చూపించినట్లు మనకు కనిపించాయి. అయితే అణు రియాక్టర్ల కథ అంతటితో ఆగిపోదు. దాని చుట్టూ ఉండే ప్రజలకు, పర్యావరణానికి పాకుతుంది. దాంతో మొదటి రెండు రోజులు అంతా సవ్యంగానే ఉంది, పరిస్థితి పూర్తిగా మా అదుపులోనే ఉంది అని నమ్మబలికిన టోక్యో ఎలక్ట్రిక్ పవర్ కంపెనీతో పాటు జపాన్ ప్రభుత్వం మొదటగా 5 కిలోమీటర్ల విస్తీర్ణంలో ఉన్న ప్రజలను సురక్షిత ప్రాంతాలకు తరలించారు. ఒక పక్క భూకంపం, సునామి బాధితులు, ఇంకొక పక్క అణు బాధిత ప్రజలు. ఇంకొక రోజుకు 10 కిలోమీటర్ల విస్తీర్ణంలో ప్రజలు ఖాళీ చేయాల్సిందిగా ప్రకటనలు వెలువడ్డాయి. అంతే కాకుండా 10-20 కిలోమీటర్ల దూరంలో ఉన్న వాళ్లు ఇళ్ల బయటికి రాకూడదని, ఎ.సి.లు వాడొద్దని, నల్లాల్లో నీరు తాగొద్దని, బయట బట్టలు ఆరేయొద్దని కూడా ప్రకటనలు వెలువడ్డాయి. అయోడిన్ మాత్రలు కూడా పంచి పెట్టారు. రేడియో ధార్మిక గాలి, ధూళి ఏ మాత్రం ప్రభావం చూపించాయో తెలుసుకునేందుకు ముఖ్యంగా చిన్న పిల్లలకు, దూర ప్రాంతాలకు తరలిస్తున్న వారికందరికీ రకరకాల పరీక్షలు చేశారు. ఆవు పాలలో అణుధార్మిక పదార్థాలు కనపడడంతో పాలను తాగొద్దు అన్న ప్రకటనలు వెలువడ్డాయి. ఆ తరువాత ట్యాంకర్ల కొద్దీ పాలను కాలువల్లో పోయడం మనం టీవీల్లో చూశాం. ఫుకుషిమా ప్రిఫెక్చర్ మామూలుగా వ్యవసాయం, ముఖ్యంగా వరి పండించే ప్రాంతం. జపనీయులు ఒక పక్క టెక్నాలజీ పరంగా ఎంతో అభివృద్ధి చెందుతూ ఇంకోపక్క వ్యవసాయోత్పత్తుల విషయంలో చాలా సాంప్రదాయ బద్ధంగా ఉంటారు. పెద్ద పెద్ద కంపెనీల్లో కీలక పాత్ర పోషిస్తూ ఎక్కడెక్కడో పని చేసే వాళ్లు సైతం, సి.ఇ.ఓ స్థాయి వాళ్లు కూడా వరినాట్ల సమయంలో తప్పనిసరిగా గ్రామాలకు వెళ్లి వ్యవసాయ పనుల్లో పాలుపంచుకుంటారు. వ్యవసాయం, తిండి గింజల పట్ల తమ విధేయతను చాటుకుంటారు. ఆ రకంగా టెక్నాలజీ మాత్రమే అన్ని సమస్యలకు పరిష్కారం కాదని తమ జీవనశైలి ద్వారా నిరూపిస్తున్నారు. ఇలా ఎంతో ఉద్వేగభరితంగా జరిగే ఈ సామూహిక కార్యక్రమం ఈ సంవత్సరం ఎలా జరపాలో పాలుపోక తలపట్టుకు కూర్చున్నారు. ఎందుకంటే అణుధార్మిక వ్యర్థాలతో నీరు, భూమి, గాలి పూర్తిగా కలుషితం కావడమే కాక అక్కడ పండే పంట కూడా తినయోగ్యం కాదు అన్న విషయం ఇప్పుడిప్పుడే అవగతమవుతోంది. కొన్ని దేశాలు (మన దేశంతో సహా) అక్కడి వ్యవసాయోత్పత్తులు కొనటాన్ని, దిగుమతి చేసుకోవటాన్ని నిషేధించాయి.

ఇక్కడ మనం తెలుసుకోవలసిన ముఖ్యమైన విషయం, అణుధార్మికత కలుషిత వాతావరణం వల్ల జరిగే నష్టం ఏమిటి? ఎందుకు ప్రపంచమంతా కలవరపాటుకి గురవుతోంది?

అన్ని పదార్థాలలోను పరమాణువులు స్థిర సంఖ్యలోనే ఉంటాయి. అయితే అణుధార్మిక శక్తి కలిగిన పదార్థాలలో పరమాణువులు స్థిరంగా ఉండవు. అణుధార్మిక శక్తి ధాతువులలో పరమాణువులు అస్థిరంగా ఉంటూ సూక్ష్మరీతిలో విస్ఫోటనం చెందడమే కాక విపరీతమైన శక్తిని విడుదల చేస్తాయి. ఈ క్రమాన్ని 'అణుధార్మిక శక్తి విభజన' అంటారు. అణుధార్మికశక్తి పరమాణువులు విస్ఫోటనం చెందినప్పుడు, శక్తివంతమైన అల్ఫా, బీటా, గామా అనే అణు కిరణాలు విడుదల అవుతాయి. అవి పేలుడువల్ల సంభవించే పదునైన తూటాల్లాగా ఉంటాయి. అతి సూక్ష్మమైన ఈ చిన్నతూటాల్లోంచి చాలా శక్తి విడుదల అయి జీవజాలానికి విపరీతమైన హాని చేస్తుంది. దీన్నే రేడియేషన్ అంటారు. బాహ్య వాతావరణంలోకి వచ్చిన ఈ అణుధార్మిక పదార్థాలు పూర్తి స్థాయిలో శిథిలం కావడానికి కొన్ని సెకన్ల నుంచి కొన్ని లక్షల సంవత్సరాలు పడుతుంది. (ఉదాహరణకి రెండు గ్రాముల యురేనియం ఒక గ్రాముగా మారడానికి 450,00,00,000 సంవత్సరాలు పడుతుంది.) అప్పటివరకూ వాటికున్న అణుధార్మిక శక్తి నిరంతరం అలా ప్రభావాన్ని చూపిస్తూనే ఉంటుంది. ఈ ప్రమాదకరమైన అణుధార్మిక శక్తి మనం పీల్చుకునే గాలి, తినే ఆహారం, నీటి ద్వారా మన శరీరాల్లోకి ప్రవేశించి శరీర కణాల్లో విధ్వంసాన్ని సృష్టిస్తుంది. రేడియేషన్ వల్ల మానవ శరీర కణాలు చనిపోతే దాన్ని ప్రమాదం కింద తీసుకోవాల్సిన అవసరం లేదు. చనిపోకుండా నాశనమయిన మిగిలిన కణాలే నిజానికి ప్రమాదభరితంగా తయారవుతాయి. అవే

కణాలు క్యాన్సర్‌గా అభివృద్ధి అవుతాయి. వీర్యకణాలకు, అండకణాలకు కూడా హానికలగడం వల్ల వంశపారంపర్యంగా పుట్టబోయే పిల్లలకు, మనుమలకు, మునిమనుమ లకు కూడా ఈ ప్రమాదం తప్పదు.

అటామిక్ రేడియేషన్ చాలా తక్కువ స్థాయిలో ఉన్నప్పటికీ అది మనుషులకు సోకితే రెండు ప్రధానమయిన జబ్బులు వస్తాయని అందరూ అంగీకరిస్తున్నారు. 1. అన్ని రకాల క్యాన్సర్లు, 2.వంశపారంపర్య మార్పులు. గర్భస్థ శిశువుకు ఎంత తక్కువ మోతాదులో రేడియేషన్ తగిలినా గానీ ఈ పిల్లలకు మానసిక వైకల్యం వచ్చే అవకాశం ఉంటుందని, పిండదశలో మార్పులు రావడానికి అవకాశం ఉందని వైద్య శాస్త్రవేత్తలు చెబుతున్నారు. అందుకే గర్భిణీ స్త్రీలకు ఎక్స్‌రే తీయించడం గానీ, సీటీ స్కాన్ చేయించడం గానీ జరగదు. (ఎందుకంటే వీటిలో గామా కిరణాలు ఉంటాయి.)

భారతదేశంలో కూడా అణుధార్మిక సంస్థలు, రియాక్టర్లు చాలా ఉన్నాయి. మరెన్నో రాబోతున్నాయి. మన దేశ ఆర్థికాభివృద్ధికి 8-10 శాతం వృద్ధి రేటుని నిలుపుకోవాలంటే అణువిద్యుత్తు చాలా కీలకమని, మన ప్రస్తుత ప్రధాని మన్మోహన్‌సింగ్ చాలా గట్టిగా నొక్కి వక్కాణిస్తున్నారు. ఇందుకు తమ ప్రభుత్వాన్ని పణంగా పెట్టడానికైనా సిద్ధపడి అమెరికాతో ఒప్పందం కుదుర్చుకున్నారు. తదనంతరం అణుపరిహార బిల్లుని గురించి జరిగిన చర్చల్లో కూడా అనేక సందేహాలు, ఆరోపణలు, అర్ధసత్యాలు, ఆర్థిక లావాదేవీలు, రాజకీయ లాబీయింగ్‌ల మధ్య అసలు నిజాలు ప్రజల ముందుకు రాకుండానే కనుమరుగయ్యాయి. అప్పుడు ఎంతో మంది శాస్త్రవేత్తలు, మేధావులు లేవనెత్తిన అంశాలు ముఖ్యంగా అణు ప్రమాదం జరిగితే గనుక అత్యధికంగా రు. 500 కోట్లు నష్ట పరిహారం చెల్లిస్తే సరిపోతుందన్న అంశం ఎంత క్రూరమయిందో, ప్రజల జీవితాలకి ఉన్న విలువని అపహాస్యం చేసేదిగా ఉందనేది ఈ రోజు ఫుకుషిమా ఉదంతం కళ్లకి కట్టినట్టు తెలియజేస్తోంది. అణుధార్మిక వ్యర్థాల వల్ల సంక్రమించే జబ్బులు సామాజిక స్థాయిలో కనపడడానికి రెండు రకాలుగా ఉంటాయి. ఒకటి తీవ్రస్థాయి రేడియేషన్ మూలాన వచ్చే జబ్బులు, రెండు తక్కువ మోతాదు రేడియేషన్ (పరోక్షంగా గాలి, నీరు, ఆహారం) వలన వచ్చే జబ్బులు పది పదిహేను సంవత్సరాల తర్వాత బయటపడే అవకాశం ఉంటుంది. అలా బయటి కొచ్చే జబ్బులు రేడియేషన్ మూలంగానే వస్తున్నాయని నిర్ధారించే సాంకేతిక పరిజ్ఞానం, వైద్యవ్యవస్థ మనకు లేదన్న విషయం ప్రత్యేకంగా చెప్పుకోవాల్సిన పని లేదు. ఈ విషయాలన్నీ తెలిసి కూడా అమెరికాతో కుదుర్చుకున్న ఒప్పందంలో అణు ప్రమాదం సంభవించినట్టయితే దానికి బాధ్యత వహించే సంస్థ పది సంవత్సరాల తర్వాత ఏ రకంగానూ జవాబుదారీ కాదు అన్న విషయాన్ని పొందుపర్చడం అంటే మన నాయకులు, మన శాస్త్రవేత్తలు ప్రజల ప్రాణాల్ని, ఆరోగ్యాన్ని, పర్యావరణాన్ని అమెరికా అణువ్యవస్థ చేతుల్లో పెట్టారనడంలో ఏ మాత్రం సందేహం లేదు.

అణు సంబంధిత విషయాల కొస్తే ఇది ప్రజలకు సంబంధించని విషయంగా, అంతుపట్టని బ్రహ్మ పదార్థంగా, నిగూఢ రహస్యంగా మనం కొలవలేనంత విద్యుచ్ఛక్తి అందించగల శాస్త్రంగా, శత్రు దేశాన్ని ఆమడ దూరంలో ఉంచగలిగే బ్రహ్మాస్త్రంగా రకరకాల కథలను శాస్త్రంగా ప్రజాబాహుళ్యంలోకి తీసుకువచ్చి ప్రజల్ని ఒక గత్యంతరం లేని పరిస్థితిలోకి నెట్టి వేస్తూ వచ్చారు. అణువిద్యుత్ కేంద్రాల నుంచి వచ్చే విద్యుత్ కంటే వాడే విద్యుత్ ఎక్కువని, అత్యంత ఖర్చుతో కూడుకున్నదనీ, వాటి నుంచి వచ్చే వ్యర్థాలని కొన్ని వందల సంవత్సరాలు పరిరక్షించాల్సి ఉంటుందనీ, తాము చేయని తప్పులకు రాబోయే తరాలు బాధ్యత వహించాల్సి ఉంటుందనీ, ఏ శాస్త్రవేత్తా ప్రజలకు చెప్పక పోయినా, 1979లో అమెరికాలో త్రీమైన్ ఐలాండ్‌లోని అణురియాక్టర్‌లో వచ్చిన సంక్షోభం, 1986 ఏప్రిల్ 26న అప్పటి సోవియట్ రష్యాలోని చెర్నోబిల్ అణురియాక్టర్ పేలిపోవడం, ఇప్పుడు ఫుకుషిమాలో ఆరు రియాక్టర్లు పక్కపక్కనే ఉండి ఒక దాని తర్వాత ఒకటి చెడిపోవడం, పైన పేర్కొన్న విషయాలన్నిటినీ చర్చకు తీసుకు వస్తున్నాయి. (అమెరికా లోని 114 అణు విద్యుత్ కర్మాగారాల నుంచి వచ్చే అణుధార్మిక వ్యర్థాల్ని యూకా పర్వత శ్రేణుల్లో ప్రత్యేకంగా సొరంగాల ద్వారా దాచి ఉంచడానికి ప్రతి సంవత్సరం ఇరవై ఐదువేల కోట్ల రూపాయల చొప్పున రాబోయే 75 సంవత్సరాల్లో ఖర్చు చేయడానికి ఒక ప్రణాళిక తయారుచేసి ఉంచారు. అణువిద్యుత్తు చాలా చవక అని మాట్లాడేవారు ఈ వ్యరా&థల కోసం పెట్టే ఖర్చుని మాత్రం పట్టించుకోరు.) ఏదో ఒక తీవ్రసంక్షోభం వస్తేతప్ప, ఈ అంశాలు పెద్ద ఎత్తున చర్చకు రావడం లేదు. పర్యావరణ పరిరక్షణకై కార్బన్ ఉద్గారాలను తగ్గించడం కోసం మాత్రమే అణు విద్యుత్‌పై మొగ్గు చూపుతున్నట్లు దాటవేసే ప్రయత్నం చేస్తున్న మన నాయకులు, శాస్త్రవేత్తలు, ఇప్పుడయినా ప్రజలకు సమాధానం చెప్పాల్సిన అవసరం ఉంది.

1) కార్బన్ ఉద్గారాల గురించి మాట్లాడుతున్నది ఈ నాలుగైదు సంవత్సరాల నుంచే, కానీ అణువిద్యుత్తు ద్వారా లభ్యమయ్యే ఫలాలను మాత్రం 1960 నుంచి భూతద్దంలో చూపిస్తూనే ఉన్నారు.

2) అణువిద్యుత్తు చాలా చవక అనీ, ఎక్కువ మొత్తంలో విద్యుదుత్పాదన చేయొచ్చని గత యాభై సంవత్సరాలుగా ఊదర కొడుతున్నప్పటికీ మన దేశంలో అణురియాక్టర్ల ద్వారా లభ్యమవుతున్న విద్యుచ్ఛక్తి మాత్రం 2 నుంచి 3 శాతం మాత్రమే. ఇందుకై కోటానుకోట్లు ఖర్చు చేస్తూ, యురేనియం మైనింగ్ నుంచి అణువ్యర్థాలను దాచిఉంచే దాకా అన్ని స్థాయిల్లో అయ్యే ఖర్చుని లెక్కచేసి దాన్ని బహిర్గతం చేసినట్లయితే అది ఎంత చవకయినదో ప్రజలే నిర్ణయిస్తారు. ఈ అణుశాస్త్రం అంతా ప్రజల కోసమే వినియోగిస్తున్నట్లయితే దీని చుట్టూ ఇంత రహస్య వలయం ఎందుకు? ఒక వేళ ఎవరయినా అడిగితే వారిపై తీవ్రమైన కట్టడి, నిర్బంధం ఎందుకు? అసలు ఇటువంటి సాంకేతిక పరిజ్ఞానాన్ని ప్రజల మధ్యకు తెచ్చేముందు, ఆ ప్రజలు దానిని కోరుకుంటున్నారా లేదా అన్న విషయాన్ని ఒక ప్రజాస్వామ్య దేశం గమనించాల్సిన అవసరం ఉన్నదా, లేదా? అణు విద్యుత్ పరిజ్ఞానానికి ప్రత్యామ్నాయాలే లేవా?

## జైతాపూర్ అణువిద్యుత్తు ప్లాంటుకు వ్యతిరేకంగా

మహారాష్ట్రలోని రత్నగిరిలో జైతాపూర్ దగ్గర (ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన అల్ఫాన్సో మామిడి పళ్లు పండించే ప్రాంతం) కేంద్ర ప్రభుత్వం 6000 మెగావాట్ల వరుస రియాక్టర్లను (ఫుకుషిమా మాదిరిగానే) స్థాపించడానికి ప్రయత్నాలు చేస్తున్నది. ఈ క్రమంలో గత మూడు

సంవత్సరాలుగా అక్కడి రైతులు పెద్ద ఎత్తున వ్యతిరేకత తెలుపుతూ ప్రభుత్వానికి అడ్డుపడుతున్నారు. ఫార్స్‌గా నిర్వహించే పర్యావరణ ప్రజాభిప్రాయ సేకరణలో సైతం ప్రజల నుంచి గట్టి వ్యతిరేకతను ఎదుర్కోవాల్సి వచ్చింది. స్థానిక ప్రజలకు బాసటగా అనేక మంది మేధావులు, పర్యావరణ వేత్తలు, జర్నలిస్టులు, సమాచార హక్కు అమలు కోసం పోరాడుతున్న సామాజిక కార్యకర్తలు, పీస్ యాక్టివిస్టులు, దేశం నలుమూలల నుంచే కాకుండా, ప్రపంచ వ్యాప్తంగా మద్దతు తెలియ జేస్తున్నారు. ఒక ప్రజాస్వామ్య దేశంలో ఊహించలేని పరిస్థితులను జైతాపూర్ ప్రజలు ఎదుర్కోవాల్సి వస్తోంది. తీవ్ర భూకంపాలు సంభవించే జోన్‌లో ఈ ప్రాంతం ఉన్నదని పదే పదే శాస్త్రజ్ఞులు (అధికారంలో లేని వాళ్లు, అధికారంలో ఉన్నవాళ్లు ప్రభుత్వానికి వ్యతిరేకంగా నోరే విప్పరు) హెచ్చరిస్తున్నా, ప్రజలకు వారి భూమిపై వారికే హక్కు లేనట్టు ప్రభుత్వం ప్రకటనలు జారీ చేయడం, ఇవేవీ పట్టనట్టు ఫ్రెంచి కంపెనీ అరేవాతో ఒప్పందాలు కుదుర్చుకుని ఎక్కడా ఉపయోగంలో లేని రియాక్టర్లను మన ప్రజల మధ్య తెచ్చి పెట్టడం అనేది ఎవరి హితం కోసం? ఇదంతా ఒక ఎత్తైతే అసలు జైతాపూర్ లోకి యాక్టివిస్టులే రాకూడదని నిబంధన పెట్టడం, పోలీసు బలగాలను దించడం, అడ్మిరల్ రాందాస్ లాంటి ప్రముఖుల్ని ప్రజలతో కలవ నీయకుండా చేయడం, ఉద్యమిస్తున్న ప్రజల మీదకు పోలీసులతో కాల్పులు జరిపిస్తూ నిండు ప్రాణాలు హరించడం (18 ఏప్రిల్ 2011 నాడు జరిగిన పోలీసు కాల్పుల్లో ఇద్దరు రైతులు చనిపోయారు) చూస్తుంటే మనం ఎటువంటి ప్రజాస్వామ్యంలో ఉన్నామా అనే అనుమానం రాకపోదు. ప్రభుత్వానికి ఫ్రెంచి కంపెనీ ఏమో చాలా దగ్గరిదవుతుంది, స్థానికులైన భారతీయులేమో శత్రువులుగా కనిపిస్తున్నారు.

సున్నిత జీవావరణ వ్యవస్థ కలిగివున్న ఈ పశ్చిమ కనుమల్లోకి తెచ్చిపెడుతున్నటువంటి ఈ వరుస రియాక్టర్లలో ఏ కారణం చేతనయినా ప్రమాదం జరిగితే – అది మానవ తప్పిదం కావచ్చు, సాంకేతిక లోపాలు కావచ్చు, విద్యుత్తు అందకపోవచ్చు, భూకంపం రావొచ్చు, సునామీ రావొచ్చు, టెర్రరిస్టు దాడులు జరగొచ్చు – మరి అక్కడి ప్రజలేమయి పోవాలి? మనకంటే సాంకేతికపరంగా మేటి దేశాలయిన రష్యా, అమెరికా, జపాన్‌ల కంటే మించిన విపత్తు నివారణ చర్యలు మనం చేపట్టగలమా? అక్కడి జనాభాతో మనజనాభాని, మన నిరక్షరాస్యతని, బీదరికాన్ని అర్థం చేసుకుంటే ఇటువంటి సాంకేతిక పరిజ్ఞానంతో కూడిన అణువ్యవస్థని ప్రజల మధ్యకి తెచ్చిపెట్ట కూడదనే విషయం తెలవడానికి మేధావి కానక్కర్లేదు. ప్రజాపక్షం ఆలోచిస్తే చాలు.

జవాబుదారీతనం లేని అఫీషియల్ సీక్రెట్‌యాక్ట్ కింద భారత ప్రధానికి తప్ప ఎవరికీ సమాధానం చెప్పనవసరం లేని ఒక అప్రజాస్వామిక వ్యవస్థలో నుంచి వచ్చిన ఈ భారత అణువిభాగం ఎక్కడా కూడా ప్రజా సమ్మతిని కూడ గట్టు కోలేకపోయింది. సిఎజి ( కంట్రోలర్ అండ్ ఆడిటర్) కిందకు రాని, లెక్కా పత్రం లేని బ్లాంక్ చెక్‌ను వాడుకుంటున్న ఈ శాస్త్రం చదువురాని, చదువుకున్న భారతీయుల వ్యతిరేకతనే చూస్తున్నది. ఇప్పటికైనా భారత ప్రభుత్వం కాలం చెల్లిన సీక్రెసీయాక్ట్ నుంచి సివిలియన్ న్యూక్లియర్ ( పౌర అణు సంబంధ) సంస్థలను మినహాయించి ప్రజలకు అన్ని విషయాలు తెలిసేటట్లు; ఇది ప్రజలకు సంబంధించిన వ్యవహారంగా ప్రవర్తించాలి. లేనట్లయితే ఇది ప్రజా వ్యతిరేకమే అవుతుంది గానీ ప్రజాహితం కాదు.

### అణు విద్యుత్ కేంద్రాన్ని వ్యతిరేకిస్తున్న కొవ్వాడ రణస్థలం ప్రజలు

మన రాష్ట్రంలో ఉత్తరాంధ్ర తీరాన శ్రీకాకుళం జిల్లా కొవ్వాడ రణస్థలంలో ప్రభుత్వం నిర్మించ తలపెట్టిన అణువిద్యుత్ కేంద్రం పట్ల కూడా అక్కడి స్థానిక ప్రజలు తీవ్ర వ్యతిరేకతను వ్యక్తం చేస్తున్నారు. ఒక్క సెంటు భూమిని కూడా ఈ కేంద్రం కోసం ఇచ్చేది లేదని స్పష్టం చేస్తున్నారు. భారత కోస్తాతీరం అంతటా కూడా 55 కిలోమీటర్లకు ఒకటి చొప్పున అణు విద్యుత్ కేంద్రాలను స్థాపించాలని భారత అణు ఇంధన శాఖ ప్రతిపాదిస్తున్నట్లు, ఇదంతా కూడా ఒక పిచ్చి ప్రతిపాదన అని, లక్షలాది ప్రజలను నిర్వాసితులను చేసే ఇలాంటి ప్రతిపాదనలన్నీ ప్రధాన మంత్రి ఆఫీసులోని కొద్దిమంది అధికారులు, భారత న్యూక్లియర్ పవర్ కార్పొరేషన్‌లోని స్వార్థపూరిత శాస్త్రవేత్తలు తీసుకుంటున్న నిర్ణయమని అటామిక్ ఎనర్జీ రెగ్యులేటరీ బోర్డు విశ్రాంత ఛైర్మన్ ఎస్. గోపాల్ క్రిష్ణన్ ఇటీవలే హైదరాబాద్‌లో జరిగిన ఒక సదస్సులో పేర్కొనడం జరిగింది. ఇదే గనుక సంభవిస్తే భారత కోస్తాతీరం అంతా కూడా అణుధార్మిక వ్యర్థాల తోనూ, నిషేధిత స్థలం గానూ మారిపోయే ప్రమాదం ఉంది. ఇక్కడ రాజకీయ పార్టీల వైఖరులను కూడా నిశితంగా పరిశీలించాలి, వారి విధానాలను ప్రశ్నించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

(అధికారంలో లేనప్పుడు ఒకలాగా, అధికారం చేపట్టిన తర్వాత మరొక తీరుగా వ్యవహరించే రాజకీయ నాయకుల పట్ల ప్రజలు అప్రమత్తంగా ఉండాలనే దానికి ప్రత్యక్ష ఉదాహరణ మాజీ ముఖ్యమంత్రి వై.ఎస్.రాజశేఖరరెడ్డి. 2003లో తాము అధికారంలో లేనప్పుడు నల్లగొండ జిల్లాలో నాగార్జునసాగర్‌ని ఆనుకొని యుసిఐఎల్ (యురేనియం కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్) ప్రతిపాదించిన యురేనియం గనుల తవ్వకాల్ని (మైనింగ్), శుద్ధి కర్మాగారాన్ని తీవ్ర పదజాలంతో విమర్శిస్తూ, తద్వారా వచ్చే అణుధార్మికత వల్ల ప్రజలు ఎదుర్కోబోయే తీవ్ర ఆరోగ్య సమస్యలను ఉటంకిస్తూ ఈయన టైమ్స్ దినపత్రికకు ఒక బహిరంగ లేఖ కూడా రాశారు. అయితే, తాను అధికారం చేపట్టగానే అన్ని నిబంధనలను అపహాస్యం పాలు చేసి తన స్వంత జిల్లా కడపలో యురేనియం మైనింగ్, శుద్ధికర్మాగారానికి అనుమతులు సంపాదించి తెచ్చారు. పైగా తన స్వంత నియోజక వర్గ ప్రజలకు ఏం కావాలో, ఏం చేయాలో తనకు బాగా తెలుసునని కూడా సెలవిచ్చారు.)

కోస్తా తీరం అంటే సముద్రమూ, నీళ్లేకాదు, అదొక ప్రజా జీవనాధారం, సున్నితమైన పర్యావరణ ప్రాధాన్యత కలిగిన జీవజాలం. దీనిపై ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ అనేక జీవరాశుల (జలచర, భూచర, ఆకాశచర)తో పాటు లక్షల, కోట్ల మానవ సమూహాలు ఆధారపడి ఉన్నాయి. వీటన్నిటి ఉనికే ప్రశ్నార్థకం కాబోతుందా? ఈ అభివృద్ధే కదా మన పాలకులు మన నెత్తిన రుద్దుతున్నది. ఇప్పుడు మన ముందున్న ప్రశ్న – ఏం చేసి దీన్ని ఆపాలి, ఎలా ఎదుర్కోవాలి ?

*(రచయితలు మూవ్‌మెంట్ అగెనెస్ట్ యురేనియం ప్రాజెక్ట్స్ సభ్యులు)* వీ

పాలకుల విధానాల ఫలితంగా కొద్దిమంది వనరులను తవ్వుకు పోతూ లాభాలు చేసుకుంటున్నారనీ, కార్మికులకు ఉపాధి కరువైందనీ, రైతులకు ఆత్మహత్యలే మిగిలాయనీ అంటున్నారు కె. నాగేశ్వరాచారి

# గనుల్లో రాజకీయ మాఫియా

ఇటీవల అనంతపురం జిల్లా ధర్మవరం ప్రాంతంలో ఒక రైతుకు వజ్రం దొరికిందని దానిని ప్రభుత్వానికి ఇవ్వలేదని పత్రికలు, పోలీసులు దాదాపు వారం రోజులు నానా యాగీ చేశారు. తన పొలంలో దొరికింది కాబట్టి ఆ వజ్రం తనదేనని రైతు అనుకోవడానికి వీల్లేదు. అలా చట్టం ఒప్పుకోదట. బ్రిటిష్ కాలం నుంచి ఆచట్టం కొనసాగుతూనే ఉందట. దాన్ని అమలు చేయాల్సిన బాధ్యత అధికారులదీ, ప్రభుత్వానిదీనట.

ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలో 24 జూలై 2007న ముఖ్యమంత్రి రాజశేఖరరెడ్డి ఓబుళాపురం మైనింగ్ కంపెనీ, ఈ సంవత్సరం 20 లక్షల టన్నులకు పైగా ముడి ఇనుమును తవ్వి తీసిందని ప్రకటించారు. ఈ కంపెనీకి ఇండియన్ బ్యూరో ఆఫ్ మైన్స్ కేవలం ఆరు హెక్టార్లు మాత్రమే ఇనుము తవ్వుకోవడానికి అనుమతించింది. ఈ ఆరు హెక్టార్లలో కేవలం 7.50 లక్షల టన్నుల తవ్వకానికే బ్యూరో అనుమతించింది. కాగా శాసనసభలో ముఖ్యమంత్రిపై ప్రకటన చేస్తే దానిపై తీసుకున్న చర్యలు ఏమిటో ఇంతవరకు తెలియ రాలేదు.

ప్రొఫెసర్ ఆర్.ఎస్.రావు చెప్పినట్లు అభివృద్ధి ఒక తప్పుడు భావజాలాన్ని ప్రచారం చేస్తూ తన దోపిడీని బలోపేతం చేసుకుంటూనే ఉంది. అదేంటంటే ప్రతి ఏటా ఎగుమతులు పెరుగుతున్నాయి. ప్రభుత్వాలకు ఆదాయం గణనీయంగా పెరుగుతూ ఉంది. కొత్త పరిశ్రమలు నెలకొంటున్నాయని గూబలదిరే అసత్య ప్రచారం జరుగుతూ ఉంది. ప్రతి సంవత్సరం 15.7 శాతం ఎగుమతులు పెరుగుతూ ఉంటే అక్కడ పని చేస్తున్న కార్మికులు 4 శాతం ప్రతి ఏటా తగ్గిపోతున్నారని ప్రభుత్వ గణాంకాలు చెబుతున్నపుడు ఎవరిని తప్పుబట్టాలో అర్థమవుతూనే ఉంది. దేశంలో వేలాది మంది రైతాంగం అసహజ మరణాలకు గురవుతూ ఉంటే ఎవరిని తప్పుబట్టాలో అర్థం కానిదెవరికి?

దక్షిణ భారతంలో ఆంధ్రప్రదేశ్, కర్ణాటక రాష్ట్రాల్లో కాంగ్రెస్, బి.జె.పి. పార్టీలు అధికారంలోకి రావడానికి ప్రధాన కారణం ఓబుళాపురం గనులు. ఒకే వ్యక్తి రెండు రాష్ట్రాల్లో భిన్న రాజకీయ పార్టీలకు అండదండగా ఉండడం దోపిడీ వర్గాల ఐక్యతలో కొత్త నాటకమేమీ కాదు. అక్రమ తవ్వకాల గురించి స్వపక్ష, ప్రతిపక్ష రాజకీయ పార్టీలకు పట్టింపు లేకపోవడం వింతేమీ కాదు. వాటి అర్థాలు గ్రహించలేని ప్రజలకే ఈ పాత నాటకంలోన కొత్త వింత. తవ్వకానికి అన్ని ఖర్చులు పోనూ టన్నుకు మూడున్నర వేల పైచిలుకు ఆదాయం మిగులుతూ ఉంది. అలా సంవత్సరానికి కొన్ని మిలియను టన్నుల అమ్మకం జరిగినట్లు వివిధ పత్రికలు నివేదికలు తెలుపుతున్నాయి. కాబట్టే రెండు రాష్ట్రాల్లో భిన్న రాజకీయ పార్టీలను ఓబుళాపురం గనులు నిలబెట్టాయి. ఎన్నికల్లో డబ్బు వెల్లువ ప్రజల్ని ముంచెత్తింది. కర్ణాటకలో తమ పార్టీ ఓడిపోయినా కాంగ్రెస్‌కు బాధలేదు కానీ ఆంధ్రప్రదేశ్‌లో మాత్రం నిలదొక్కుకోవాల్సిన ఆవశ్యకతను గుర్తించింది. ఇంత చరిత కల్గిన ఓబుళాపురం గనుల తవ్వకాల చరిత్రేమిటి ?

ఆంధ్రప్రదేశ్ కర్ణాటక సరిహద్దు జిల్లాలైన అనంతపురం, బళ్లారి జిల్లాల మధ్య 1964లో గాలి సోదరుల కుటుంబం తవ్వకానికి కొంత లీజుకు తీసుకునింది. 1964 నుంచి 1984 వరకు 20 సంవత్సరాల కాలం తవ్వకానికి అనుమతి ఉంది. అప్పుడు కేవలం 547.62 ఎకరాలకు మాత్రమే అనుమతి ఉండగా తదనంతర కాలంలో ఇంకా 64.20 ఎకరాలు కావాలని గాలి సోదరులు ధరకాస్తు చేసుకున్నారు. అనుమతికి అనేక అవరోధాలు కొనసాగుతుండగానే ఆంధ్రప్రదేశ్ హైకోర్టు 483.42 ఎకరాలలో తవ్వకాలకు అనుమతినిచ్చింది. అప్పటినుంచి అనేకానేక పరిణామాలతో తవ్వకాలు కొనసాగుతూనే ఉన్నాయి. అయితే 483.42 ఎకరాల్లోనే కాక ఇంకా కొంత విస్తరించి అక్రమంగా తవ్వకాలు కొనసాగిస్తున్న కారణంగా వివాదాలు ప్రారంభమైనాయి. అనంతపూర్ మైనింగ్ కార్పొరేషన్, మహాబళేశ్వరప్ప అండ్ సన్స్ వంటి సంస్థలు ఇక్కడ తవ్వకాలు కొనసాగిస్తున్నాయి. ఇందులో తపాలా గణేష్ అనే బళ్లారి వ్యాపారస్తుని సంస్థ కూడా ఒకటి ఉంది. ఇందులోకి గాలి సోదరుల చొరబాటు కారణంగా వివాదం మొదలైంది. తపాలా గణేష్‌కు కేంద్ర ఆర్థిక మంత్రితో సత్సంబంధా లున్నాయి. ఒకే పార్టీకి చెందిన వారి మధ్య గొడవలు ఇంకొకరికి అవకాశం కాకూడదని అనుకున్నారేమో గానీ ప్రతిపక్ష పార్టీల ఆందోళనతో సమస్యలు ప్రజలకు తెలిసి వచ్చాయి అని మనం అర్థం చేసుకోవాలి. ఈ గొడవకు అంటే అఖిలపక్ష కమిటీ ఓబుళాపురం దర్శించడానికి కొంత అటు ఇటుగానే ఉండవల్లి అరుణ్‌కుమార్ మార్గదర్శి ఫైనాన్స్ కంపెనీపై ఫిర్యాదు చేయడం యాదృచ్ఛిక సంఘటనలేమీ కావు.

ఇనుము మైనింగ్‌లో మన రాష్ట్రం నాల్గవ స్థానంలో ఉందని గణాంక వివరాలు తెలుపుతున్నాయి. 2003-04 లో ఓబుళాపురం గనులు రు. 1.05 కోట్ల లాభాలు గడించగా అది 2008-09 సంవత్సరానికి 700 కోట్లకు చేరిందని ఒక అంచనా. కళ్లు తిరిగిపోయే లాభాలు! ఈ లాభాలు గడించడానికి ప్రభుత్వ యంత్రాంగం ఈ యజమానులకు తమ వంతు సహాయాన్ని అందిస్తూనే ఉంది. ఈ పద్ధతిని సహించలేని కర్ణాటక లోకాయుక్త లాంటివాళ్లు స్వచ్ఛన్నందంగా రాజీనామాలు చేశారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఓబుళాపురంను నిలువరించలేదని కర్ణాటక లోకాయుక్త బహిరంగంగా ప్రకటించింది. ఆయన ఈ విధంగా ప్రకటించడానికి అస్తవ్యస్థ పరిపాలనే కారణం. 2005-07లో ఓటుళాపురంలో అక్రమంగా తవ్వకాలు జరిగింది వాస్తవమే. దీన్ని కప్పిపుచ్చుకోవడానికి ప్రభుత్వం జారీ చేసిన ఉత్తర్వులే దీనికి సాక్ష్యం. 2007లో కేంద్ర ఎన్విరాన్‌మెంట్ ఫారెస్ట్ మంత్రిత్వ

శాఖ తవ్వకాలకు అనుమతించింది కానీ అటవీశాఖ క్లియరెన్స్ ఉత్తర్వులను ఓబుళాపురం గనుల యాజమాన్యం పొందలేదు. ఇబ్బందుల్ని గమనించి యాజమాన్యం అటవీశాఖ నుంచి రెట్రాస్పెక్టివ్‌గా 2005 నుంచి తవ్వకానికి అనుమతి ఉత్తర్వులను 2007లో తీసుకుంది. ఇటువంటి అస్తవ్యస్థ స్థితే లోకాయుక్త రాజీనామాకు దారి తీసింది.

కేంద్ర ప్రభుత్వ పర్యావరణ అటవీ మంత్రిత్వ శాఖ ప్రాంతీయ కార్యాలయం బెంగుళూరులో ఉంది. ఈ కార్యాలయం ఓబుళాపురం మైనింగ్ సంస్థకు 25.98 హె.లలో తవ్వకానికి అంగీకారం తెలిపింది. ఇదే అదనుగా ఈ సంస్థ మిగతా మూడు మైనింగ్ సంస్థల మధ్యభాగంలో ఉండే 10 హెక్టార్లలో తవ్వకాలు బెదిరించి అక్రమంగా ప్రారంభించింది.

. మరొక సంస్థ ఎందుకు లెమ్మని అనధికారికంగా తమ సంస్థను ఓబుళాపురం మైనింగ్‌కే అప్పజెప్పి చేతులు ముడుచుకుంది. ఈ వివాదం ముదిరి కేంద్ర సాధికార కమిటీకి హద్దులు నిర్ణయించడానికి మ్యాప్ తీసుకుని ఢిల్లీ నుంచి బయలుదేరిందే కాని హద్దులు నిర్ణయించలేక పోయింది. ఇంతలో ఫారెస్ట్ అడ్వైజరీ కమిటీ ఐదు మైనింగ్ కంపెనీల తవ్వకాల అనుమతి ఉత్తర్వులను తాత్కాలికంగా నిలిపివేసింది. ఐతే ఈ ఉత్తర్వులను రాజశేఖరరెడ్డి ప్రభుత్వం అమలు కాకుండా నిలిపి వేసింది. సుప్రీంకోర్టు జోక్యం చేసుకొని సర్వే చేసి హద్దులు నిర్ణయించమని కేంద్ర సర్వే శాఖను ఆదేశించినా ఇప్పటికీ ఫలితం లేదు.

ఈ వివాదాన్ని పరిష్కరించడానికి కేంద్ర పర్యావరణ మంత్రిత్వ శాఖ కేంద్ర సాధికార కమిటీని నియమించింది. ఈ కమిటీ ఓబుళాపురం లో పర్యటించి రాష్ట్ర ప్రభుత్వ వ్యవహారం మాకు నమ్మకం కల్గించడం లేదని పేర్కొంది. అలాగే రాష్ట్ర ప్రభుత్వం అక్రమ తవ్వకాలనే ప్రోత్సాహిస్తున్నట్లు భావిస్తున్నామని పేర్కొంది.

దీన్ని బట్టి మైనింగ్ సంస్థలు. ప్రభుత్వాలు జమిలిగా నడుస్తున్నా యని అర్ధమవుతుంది. దీనికి ఉదాహరణ ఉంది. అదేమిటంటే బళ్లారి నుంచి బెలికెరి, కార్వార్ ఓడరేవులకు ముడి ఇనుము తరలిస్తున్న 99 లారీలను డిప్యూటీ అటవీ కన్సర్వేటర్ కర్ణాటక రాష్ట్ర లోకాయుక్త సూచనల మేరకు సీజ్ చేశారు. ఆ లారీల్లో మొత్తం 8లక్షల టన్నుల ముడి ఇనుముంది. దీనిపై నమోదైంది. ఒక సీనియర్ కర్ణాటక మంత్రి జోక్యంతో డిప్యూటీ కన్సర్వేటర్‌ను లారీలను సీజ్ చేసినందుకు ఉద్యోగం నుంచి సస్పెండ్ చేశారు. ఈ కారణం చేతనే లోకాయుక్త విధులు సక్రమంగా నిర్వర్తించే అధికారులను కాపాడలేనప్పుడు నేను రాజీనామా చేయడమే మేలని రాజీనామా చేశాడు. భిన్నస్థాయిలో కర్ణాటక రాష్ట్రంలోని అన్ని రాజకీయ పార్టీలకు అక్రమ మైనింగ్ లాభాల్లో వాటాలున్నాయి. ఈ వాటాలకు చట్టం అండగా నిలబడింది. కాబట్టే అంతా సక్రమమే అనుకోవాల్సివచ్చింది.

రెండువేల దశకంలో ప్రారంభమైన మైనింగ్ దాదాపు వేయి మిలియన్ టన్నుల ముడి ఇనుమును నిల్వచేసుకుంది. 2001-02లో 12.4 మిలియన్ టన్నులు, 2002-03లో 13.9 మిలియన్ టన్నులను ఓబుళాపురం మైనింగ్ సంస్థ ముడి ఇనుమును నిల్వ చేసుకుంది. గత సంవత్సరం అనంతపురం జిల్లా హక్కుల సంఘాలు ఈ సంస్థ ప్రదేశాన్ని వెళ్లి చూశాయి. ఓబుళాపురం, సిద్ధాపురం, తాండా గ్రామవాసుల్ని పలకరిస్తే మైనింగ్ వల్ల వచ్చే వాటి లాభాలు గురించి సంఘాల వాళ్లు చెబితే అబ్బురపోయారు. తాండా వాసులకి మంచి నీటి సౌఖ్యం లేదు. ఊరికి దక్షిణాన రెండు కొండల మధ్య సమాంతరంగా నిర్మించినట్టుండే కొండలు ముడి ఇనుము నిల్వలని గ్రామస్తులు చెబితే విని హక్కుల సంఘాలకు తెలిసింది. కర్ణాటక లోకాయుక్త సంతోష్ హెగ్డే తన నివేదికలో 2000-01లో 12.09 మిలియన్ టన్నులు ఉత్పత్తి చేసే సంస్థ 2005-06లో 184.05 మిలియన్ టన్నుల ముడి ఇనుము ఉత్పత్తి జరిగినట్లు తెలుపుతుంది. ఇదే కాలంలో ఎగుమతులు 6.19 మిలియన్ టన్నుల నుంచి 90.76 మిలియన్ టన్నులకు చేరిందని నివేదికలో ఉంది. మరి ధర విషయం కూడా పరిగణించాలి కదా. టన్ను ధర రు. 274 నుంచి రు. 1061 పెరిగింది. ఎగుమతుల విలువ 184.09 మిలియన్ డాలర్ల నుంచి 5216.39 మిలియన్ డాలర్లకు పెరిగింది. ఈ లాభాలు చూసి కళ్లు జిగేలు మన్నాయేమో. కర్ణాటక మంతులు అధికారులు కలిసి మరి 11 కంపెనీలకు లీజుకు అనుమతించారు. ఇప్పటికీ బళ్లారి జిల్లాలో దేశం మొత్తం ముడి ఇనుము ఉత్పత్తిలో 20 శాతం ఇక్కడి నుండే ఉత్పత్తి అవుతున్నది. సంతోష్ హెగ్డే సమర్పించిన 274 పేజీల నివేదికలో ఎన్ని చిదంబర రహస్యాలు ఉన్నాయో! దేశ భక్తికి ఆటంకం కాకూడదని కమలనాథులు 11 వాల్యూమ్‌ల యాక్షన్ టేకెన్ రిపోర్టును లోకాయుక్తకు సమర్పించింది. ఈ యాక్షన్ టేకెన్ రిపోర్టు పైనే చర్య తీసుకోవాల్సి ఉందని సంతోష్ హెగ్డే ఆ రిపోర్టును తోసిపుచ్చారు.

అనంతపురం జిల్లాలో చేనేత పట్టు కార్మికులు రైతుల అసహజ మరణాల రావణకాష్టం రగులుతూనే ఉంది. గ్రామీణ ప్రజల వలస ప్రస్తావన నిరాటంకంగా కొనసాగుతూనే ఉంది. గ్రామాలు పాలిపోయిన ముఖాలతో దారిద్ర్యం ఓడుతూ ఉన్నాయి. మరో పక్క ప్రపంచంలో మరెక్కడా లభించని చక్కని గొప్ప విలువైన ముడి ఇనుము ప్రకాశం జిల్లా చీమకుర్తిలోనూ, అనంతపురం జిల్లా ఓబుళాపురంలోనూ కొంత లభిస్తూ ఉంది. వర్షాకాల కరువును ఖనిజ పరిశ్రమలతో దూరం చేయవచ్చన్న తలంపు మృగ్యమైంది.

అనంతపురం జిల్లాలో ఓబుళాపురంలోని మైనింగే కాక గుత్తి తాడిపత్రి మధ్య ప్రాంతంలో అక్రమ తవ్వకాలు అనేకం జరుగుతున్నాయి. వెన్నెముద్ద లాంటి తెల్లని సున్నపు రాయి గనులు ప్రైవేటు వ్యక్తుల ఆధీనంలో నడుస్తున్నాయి. గుత్తి మండలం కిష్టపాడు గ్రామ సమీపంలో డబుల్ రైల్వే లైన్ పక్కన దాదాపు 30 అడుగుల దూరంలో వంద అడుగుల్లోతు తవ్వకాలు జరుగుతున్నా ఖనిజశాఖ గానీ, రైల్వే శాఖగానీ కిమ్మనకుండా నిమ్మకు నీరెత్తినట్లుంది. అలాగే నాపరాళ్ల గనుల చరిత కూడా ప్రత్యేకంగా చెప్పుకోవలసిన అంశం.

జిల్లాలో అపార ఖనిజ సంపదను వినియోగించుకొని పారిశ్రామికంగా అభివృద్ధి చేయాలనే పథకాల రూపకల్పన చేయాల్సిన రాజకీయ పార్టీలు ఖనిజ సంపద పంపకాల్లో మునిగి తేలుతున్నాయి. రాజకీయ చైతన్యం తక్కువ లేదన్నట్లుగా ఖనిజ సంపద 'గాలి' బొక్కసాల్లో నిండిపోవడం అప్రజాస్వామికమనే ఉద్యమం రానీయకుండా రాజకీయ పార్టీలన్నీ, వివిధ ఉద్యోగ సంఘాలు, కవులు, కళాకారులు సమైక్యాంధ్ర కోసం వీథుల్లో కొచ్చి ట్రెండ్‌సెట్టింగ్ రాజకీయాలు నడుపుతున్నారు?

ప్రజల్లో అసంతృప్తి పెల్లుబుకకుండా ప్రభుత్వం అంతా తామే పరిష్కరిస్తామన్నట్లుగా కేంద్ర హైపవర్ కమిటీ, కేంద్ర సాధికార కమిటీ, రాష్ట్ర లోకాయుక్త, అన్వరుల్ హుడా కమిటీలు నియమించి వాటిని సేఫ్టీ వాల్వులుగా ప్రభుత్వం వాడుకుంటూ ఉంది. అధికారంలోకి వచ్చిన పార్టీలు తమ పబ్బం గడుపుకోవడం దేశంలో కొత్తేమీ కాదు. కర్తవ్యం ఇప్పుడు ప్రజల చేతుల్లోకి మారవలసి ఉంది. ఎందుకంటే ప్రైవేటు వ్యక్తుల తవ్వకాల అక్రమంపై చర్చించి, చర్యలు తీసుకోకుండా తవ్వకాలు సక్రమమే కానీ అనుమతి లేని ప్రాంతాల్లోని తవ్వకాలే వివాదాస్పద మైనవని చర్చను పక్కదారి పట్టించినందుకు దాన్ని సక్రమ మార్గం పట్టించే కర్తవ్యం ప్రజల చేతుల్లోకి మారవలసి ఉంది.

*(రచయిత ఉపాధ్యాయులు, వీక్షణం అసహజ మరణాల సూచి రచయిత)* వీ

వైవిధ్యభరితమైన ప్రకృతి, వనరులు పుష్కలంగా ఉన్నా ఉత్తరాంధ్ర వెనుకబాటుకు కారణమవుతున్న పాలకవర్గ అభివృద్ధి నమూనాను వివరిస్తున్నారు **పి. కృష్ణారావు**

# ఉత్తరాంధ్ర వెలుగు నీడలు

**23,304** చ.కి.మీ. వైశాల్యంతోనూ, 7,024 గ్రామాలతోనూ, 28 పట్టణాలు కలిగి ఉన్న ఉత్తరాంధ్ర - శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం - మూడు జిల్లాలను కలిగి ఉంది. 1936లో విశాఖ, గంజాం జిల్లాలుగా ఉన్న ఉత్తరాంధ్ర, 1950లో విశాఖ, శ్రీకాకుళం జిల్లాలుగా విడివడి, 1979లో విజయనగరం ఏర్పడి మూడు జిల్లాలుగా ప్రస్తుతం ఉంది. ఇది 66,072 హెక్టార్ల అటవీ ప్రాంతం కలిగి, 320 కిలోమీటర్ల తీరప్రాంతంతో విస్తరించి ఉంది. అటు ఉత్తరాన అటవీ భూములు, ఇటు దక్షిణాన తీర భూములు, మధ్యన మైదాన భూములు కలిగి, చిన్నా పెద్దవి 15 నదులు పారుతున్నాయి. అయితే చెప్పుకోదగ్గ ఆనకట్టలు లేవు. వంశధార ప్రాజెక్ట్, నారాయణపురం ప్రాజెక్ట్, తోటపల్లి, మాద్దువలస, రైవాడ, కళింగదళ్, డబారుసింగు, పైడిగాం వంటి చిన్న చిన్న ప్రాజెక్ట్‌లు ఉన్నాయి. ఇవి కూడా పూర్తిస్థాయిలో నీటి సరఫరాను కలిగి లేవు. ముఖ్యంగా 70వ దశకంలో జరిగిన శ్రీకాకుళం సాయుధ గిరిజన రైతాంగ పోరాటం తరువాత, ఆ ఉద్యమం సెగలను చల్లార్చడానికి పాలకవర్గాలు వంశధార, నారాయణపురం ఆనకట్టలను నిర్మించాయి. ఆ తరువాత కూడా జరిగిన రైతాంగ చట్టబద్ధ పోరాటాల ఫలితంగా మిగిలిన ఆనకట్టల నిర్మాణాలను పాలకులు చేపట్టినప్పటికీ అవి నత్తనడక నడుస్తున్నాయి. అయితే ఈ మూడు జిల్లాలలోని అధికభాగం వర్షాధారంగానే పండుతున్నాయి. ప్రకృతి అతివృష్టి, అనావృష్టిల ఫలితంగా పంటలు సరిగా పండక, పండిన పంటలకు ధరలు పలకక ఉత్తరాంధ్ర ప్రజలు వలసబాట పడుతున్నారు. ఉత్తరాంధ్రలో 32 శాతం భూమికి నీటి పారుదల సౌకర్యం ఉండగా, 68 శాతం భూమి వర్షాధారంగా ఉంది. ఇక్కడ వరి ప్రధాన పంట. వేరుశెనగ, పెసర, మినుములు, రాగులు, గంటి, గోగునార, మామిడి, జీడిమామిడి, కొబ్బరి, ఆయిల్‌పామ్ వంటి పంటలను పండిస్తున్నారు.

1947 అధికార మార్పిడి తరువాత జమీందారీ వ్యవస్థ రద్దు, భూసంస్కరణల చట్టం అమలు, కౌలుదారీ చట్టం అమలు జరిగిన తరువాత, ఉత్తరాంధ్రలో ముఖ్యంగా బ్రాహ్మణ అగ్రహారాలు రైతుల పరమైనాయి. ముఖ్యంగా మూడు కులాల (కాళింగ, కాపు, వెలమ) పెత్తందారీ వర్గాలు ఏర్పడినాయి. వీరు రాజకీయంగానూ, ఆర్థికంగానూ, సామాజికంగానూ బలపడ్డారు. భూమిపైన, సంపదపైన పట్టును సంపాదించారు. అదే విధంగా ఆయా కులాల నుంచి వచ్చిన మధ్య తరగతి, విద్యావంతులు సామాజిక మార్పుకోసం నక్సల్బరీ వసంత మేఘ గర్జనను ప్రేరణగా తీసుకొని సాయుధ, రైతాంగ పోరాటాలను నడిపారు. ఇవి ఉత్తరాంధ్రలో, ముఖ్యంగా శ్రీకాకుళం, విజయనగరం ఆదివాసీ, మైదాన ప్రాంతాలలో మార్పుకి శ్రీకారం చుట్టింది. ఇందులో తీర ప్రాంతమైన ఉద్దానం 'ఉద్యమవనం'గా మారింది. శ్రీకాకుళం సాయుధ రైతాంగ పోరాట ప్రభావం ఫలితాలు కొద్దికాలం మాత్రమే ప్రభావం చూపగలిగాయి. పాలకుల ఎత్తుగడల్లో వచ్చిన మార్పులు, ప్రపంచ వ్యాప్తంగా ప్రైవేటీకరణ, సరళీకృత ఆర్థిక విధానాల ప్రభావం వ్యవసాయ రంగంపైన, రైతాంగం పైన పడక తప్పలేదు. కోస్తాంధ్ర నుంచి వచ్చిన కమ్మ, రెడ్డి, ఇతర అగ్రకుల భూస్వామ్య పెట్టుబడిదారీ వర్గాలు వలస వచ్చిన తరువాత ఇక్కడి భూములు వాణిజ్య ప్రయోజనాల కోసం, వ్యాపార పంటల కోసం, చేపల చెరువుల కోసం కారుచౌకగా అన్యాక్రాంతం అయ్యాయి. చిన్న, మధ్యతరగతి రైతులే గాక, ధనిక స్వభావం గల రైతాంగం కూడా (5 నుంచి 10 ఎకరాలు గల రైతులు) గతంలో భూములపై యాజమాన్య స్వభావం కలిగి ఉన్నవారే, నేడు అదే భూములపై కూలీలుగానో, కాపలాదారులుగానో మారిపోయారు. ఇదంతా అభివృద్ధి పేరుతో మన పాలకవర్గాల వంచనా శిల్పానికి దర్పణం. ఇక రైతు కుటుంబాలకు ఉపాధి లేక ఖరీఫ్ సీజను తరువాత ముఖ్యంగా జనవరి తరువాత మళ్లీ జూన్, జూలై మాసాల వరకు ఉత్తరాంధ్ర ప్రజలు కోస్తా జిల్లాలకు, విశాఖపట్నం, విజయవాడ, హైదరాబాద్, ముంబాయి వంటి పట్టణాలకు వలస బాట పడుతుంటారు. ఉద్దానంలోని యువకులు అండమాన్, కాండ్ల, గుజరాత్ వంటి ప్రాంతాలకు వలస కూలీలుగా వెళ్లిపోతున్నారు. పాలకులు ప్రవేశ పెడుతున్న జన్మభూమి, పనికి ఆహార పథకాలు, ఉపాధి హామీ పథకాలన్నీ పాలకవర్గ గ్రామీణ పెత్తందార్ల జేబులు నింపడానికే పనికి వస్తున్నాయి తప్ప, ప్రజల వలసలను ఆపలేకపోతున్నాయి. ఇదీ క్లుప్తంగా ఉత్తరాంధ్ర రైతాంగం పరిస్థితి. రియల్ ఎస్టేట్ వ్యాపారం వలన, వాణిజ్యపరమైన అవసరాల కోసం గత పదేండ్ల కాలంలో ఉత్తరాంధ్రలో యాభై వేల హెక్టార్ల భూమి పోయింది.

ఉత్తరాంధ్ర జిల్లాలలో గ్రామీణ ప్రాంత ఆధారంగా నెలకొల్పబడిన పురాతన పరిశ్రమలు ముఖ్యంగా, జనపనార మిల్లులు, పంచదార మిల్లులుగా చెప్పవచ్చు. మొత్తం జనపనార మిల్లులు 26 కాగా, ఆముదాలవలస, బొబ్బిలి, భీమసింగి మొదలైనవి పంచదార మిల్లులు. అనకాపల్లి బెల్లం తయారీకి ముఖ్య కేంద్రం. ఈ మూడు పంచదార మిల్లులు రైతుల సహకార రంగ మిల్లులుగా నడిచేవి. అయితే వీటిని తెలుగుదేశం ప్రభుత్వ కాలంలో మూసివేసారు. వీటిని కారుచౌకగా ప్రైవేట్ వ్యక్తులకు అమ్మివేసింది రాష్ట్ర ప్రభుత్వం. కాంగ్రెస్ పార్టీ 2004లో

అధికారంలోనికి వస్తే తెరిపిస్తామన్న వై.ఎస్. రాజశేఖరరెడ్డి మాటలు నీటి మూటలైనాయి. వీటిపై ఆధారపడి బతికిన వేలాది కార్మిక కుటుంబాలు వీధిన పడ్డాయి. రైతాంగం నిరాశ్రయులైనారు. ఇప్పుడు ఇవే పంచదార మిల్లులను ప్రైవేట్ పెట్టుబడిదారులు సంకిలిలోనూ, లచ్చయ్యపేటలోనూ నెలకొల్పి కోట్లకి పడగలెత్తినారు. వీటికి అనుబంధ పరిశ్రమలుగా విద్యుత్, ఇథనాల్ వంటి వాటిని నెలకొల్పారు. దీనికంతటికీ కారణం తెలుగుదేశం, కాంగ్రెస్ వంటి పాలకవర్గ పార్టీల దివాళాకోరు విధానాలే. ఇదంతా పాలకవర్గాలు అభివృద్ధి ముసుగులో చేస్తున్న ప్రజా వంచన. ఇక జనపనార మిల్లుల పరిస్థితి, అందులో పనిచేస్తున్న కార్మికుల పరిస్థితి ఏమంత గొప్పగా లేదు. ఈ 26 మిల్లుల్లో సుమారు డెబ్బై వేల మంది కార్మికులు ఉపాధి పొందుతున్నారు. పరోక్షంగా మరో ఒకలక్షా ఇరవైవేల నుండికి ఉపాధి దొరుకుతుంది. కానీ కేంద్ర ప్రభుత్వాలు సింథటిక్ సంచుల కొనుగోలు వాటా పెంచడం వలన, విద్యుత్ చార్జీలు పెంచగం వలన, కరువు కాటకాల వలన జనపనార దిగుబడులు తగ్గడం వలన 1990ల తరువాత ఈ జనపనార మిల్లులు సంక్షోభంలో పడ్డాయి. ఫలితంగా కార్మికుల నిజవేతనాలు 2-3 వేలకు పడిపోయాయి. జనపనార మిల్లుల యాజమాన్యాల లాకౌట్ల వలన, కార్మికచట్టాల ఉల్లంఘనల వలన కార్మికులు వీధిన పడుతున్నారు. కార్మికుల పిల్లలు పట్టణాలలో గల బట్టల దుకాణాలలోనూ, ఇతర దుకాణాలలోనూ షాప్‌కీపర్లుగా, కూలీలుగా పనిచేస్తున్నారు. విశాఖ ఉక్కు కర్మాగారం వలన ఇరవై గ్రామాల ప్రజలు నిర్వాసితులు అయ్యారు. ఇందులో మూడువేల ఆరువందల మత్స్యకార కుటుంబాలు నిర్వాసితులుగా మారిపోయారు. మొత్తం నలభైవేల మంది నిర్వాసితులు అయ్యారు. వీరికి సరైన ఉపాధి ఇప్పటికీ ప్రభుత్వం కల్పించలేదు. విశాఖ ఉక్కు కర్మాగారంతో పాటుగా విశాఖనగరంలోని పోర్టు, షిప్పుయార్డు, ఎచ్.పి.సి.ఎల్., కోరమండల్, బి.ఎచ్.పి.వి., జింక్, ఆంధ్రా సిమెంట్స్, పెట్రో కెమికల్స్ మొదలైన పరిశ్రమలు ఉత్తరాంధ్ర ప్రజలను కూలీలుగానూ, చిన్న చిన్న టెక్నికల్ (ఐ.ఐ.టి. వంటి) పనులకు ఉపయోగిస్తున్నారు తప్ప, సరైన విద్య, ఉద్యోగ అవకాశాలను కల్పించడం లేదు. సరళీకృత ఆర్థిక విధానాల ఫలితంగా వీటికి తోడుగా ఆయా పరిశ్రమలలో ఉత్తరాంధ్ర ప్రజలు కాంట్రాక్టు పనివారుగా ఏళ్ల తరబడి శ్రమ దోపిడీకి గురవుతున్నారు. ప్రపంచీకరణ, సరళీకరణ, ప్రైవేటీకరణ మాయలో భాగంగానే ఇదంతా జరుగుతోంది. ఒకవైపు పై విధంగా జరుగుతుంటే, మరోవైపు పాలకవర్గాల పంజా పర్యావరణ వినాశనం కోసం, బడా పెట్టుబడిదారుల ధన దాహం తీర్చడం కోసం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఒక్క ఉత్తరాంధ్రలోనే 16 థర్మల్ పవర్ ప్రాజెక్టులు, ఒక అణువిద్యుత్ ప్రాజెక్టను నెలకొల్పడానికి సన్నాహాలు ప్రారంభించాయి. ఒక్క శ్రీకాకుళం జిల్లాలోనే ఆరు థర్మల్ విద్యుత్ ప్రాజెక్టులు, ఒక అణు విద్యుత్ ప్రాజెక్టను నెలకొల్పడానికి సన్నాహాలు చేస్తున్నారు. సోంపేట, కాకరాపల్లి బీల ప్రాంతాలను బీడు భూములుగా తప్పుడు నివేదికలు తయారు చేసి రెవెన్యూ అధికార్లు పంపారు. ఈ కుట్రలో జిల్లా మంత్రి ధర్మాన ప్రసాదరావు, మాజీ ఎం.పి. కింజారపు ఎర్రంనాయుడు కీలక వ్యక్తులుగా వ్యవహరిస్తున్నారు. వీరికి తాబేదారులుగా మెజారిటీ కాంగ్రెస్, తెలుగుదేశం నాయకులు, ఎం.ఎల్.ఎ.లు, ఎం.పి.లు వ్యవహరిస్తున్నారు. ఇదంతా అభివృద్ధి ముసుగులో వీరు ప్రజలను మోసం చేస్తున్నారు. ఈ థర్మల్ ప్రాజెక్టుల వలన పర్యావరణం తీవ్రంగా దెబ్బ తినడమే కాకుండా సుమారు యాభై వేల మంది ప్రజలు నిరాశ్రయులు అవుతారు. ఈ ప్రాజెక్టుకు వ్యతిరేకంగా పోరాడి నలుగురు ఉద్యమకారులు అమరులైనారు. అయినప్పటికీ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వాటి అనుమతులను రద్దు చేయడం లేదు. మన పాలకులకు చెర్నోబిల్, జపాన్ విపత్తు తరువాత కూడా అణు విద్యుత్ కేంద్రాల ఏర్పాటును విరమించుకోవాలన్న బుద్ధి రాలేదు. రణస్థలం మండలం కొవ్వాడలో అణు విద్యుత్ కేంద్రం ఏర్పాటులో ఇంకా పయనిస్తున్నారు.

విశాఖపట్నం ఓడరేవు తరువాత ఉత్తరాంధ్రలో చెప్పుకోదగ్గ సహజ ఓడరేవులు కళింగపట్నం, భావనపాడు, నువ్వుల రేవు, బారువా, మెట్టూరు (శివసాగర్ బీచ్) రేవులు చెప్పుకోదగ్గవి. మన పాలకులు ఆరు దశాబ్దాల కాలంలో ఒక్క విశాఖపట్నం ఓడరేవును తప్ప దేనినీ అభివృద్ధి చేయలేదు. తెలుగుదేశం ప్రభుత్వ హయాంలో భావనపాడు ఫిషింగ్ హార్బర్ నిర్మాణం చేపట్టినప్పటికీ, ఆ పనులు పూర్తికాలేదు. ప్రస్తుతం అవి ఎందుకూ ఉపయోగపడడం లేదు. మన పాలకవర్గ ప్రతినిధులకు కమిషన్లు పెద్ద మొత్తంలో వచ్చేవి తప్ప ఇటువంటివి వారికి వంటపట్టవు. ఫలితంగా మత్స్యకారులు ఉపాధి కోల్పోతున్నారు. చేపలను నిల్వ చేసుకోవడానికి కోల్డ్ స్టోరేజీలు లేక దళారుల బారినపడి, శ్రమదోపిడీకి గురవుతున్నారు.

దేశవ్యాప్తంగా ఆదివాసుల, దళితుల పరిస్థితి ఎంత దయనీయంగా ఉన్నదో ఉత్తరాంధ్రలో కూడా వారి పరిస్థితి ఏమంత మెరుగ్గా లేదు. ఉత్తరాంధ్రలో ఆదివాసుల అభివృద్ధి కోసం ఏర్పడిన మూడు సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థలు సీతంపేట, పార్వతీపురం, పాడేరులు దోపిడీ కేంద్రాలుగా తయారయ్యాయి. వారికోసం కేటాయించబడుతున్న కోట్లాది రూపాయలు గిరిజన, గిరిజనేతర పాలకవర్గ పార్టీల నాయకుల జేబుల లోనికి వెళ్లిపోతున్నాయి. ఆదివాసీ ప్రాంత ప్రజలలో ఇంకా శ్రీకాకుళ గిరిజన సాయుధ రైతాంగ పోరాట స్ఫూర్తి ఉన్నప్పటికీ, విద్యావంతులైన ఆదివాసీ ఉద్యోగవర్గాల్లోనూ, ప్రజా ప్రతినిధుల్లోనూ ప్రపంచీకరణ ప్రభావ దళారీ స్వభావం కూడా ఆదివాసీ రైతాంగానికి నష్టం చేస్తుంది. ఫలితంగా వారు విద్యాపరంగా, వైద్య సదుపాయాలు పొందడంలో తీవ్ర నిర్లక్ష్యానికి గురవుతున్నారు. వందలాది గ్రామాలకు కరెంటు సదుపాయం, తాగు నీటి సదుపాయం లేక ఇబ్బందులు పడుతున్నారు. మలేరియా, డయేరియా బారిన పడి మరణిస్తున్నారు. అయినా ప్రభుత్వం, అధికారులు పట్టించుకోవడం లేదు. వీటికి తోడు పాలకవర్గాల కన్ను విశాఖలోని బాక్సైట్ ఖనిజాలపైన, శ్రీకాకుళం జిల్లాలోని కన్నెధార కొండలపై (గ్రానైట్ కోసం) పడ్డాయి. ఫలితంగా ఆదివాసులు నిరాశ్రయులు అవుతున్నారు. మరోవైపు పోలీసులు మావోయిస్టుల వేట పేరుతో వాకపల్లి, భల్లుగూడలలో ఆదివాసీ మహిళలపై లైంగిక అత్యాచారాలకు పాల్పడ్డారు. అయినప్పటికీ ఆదివాసీ ఎం.ఎల్.ఎ.లకు, మంత్రి బాలరాజుకి చీమ కుట్టినట్లుగా కూడా లేదు. జరిగిన అత్యాచారాలు మంత్రి బాలరాజు కుటుంబ సభ్యులకో, గిరిజన ఎం.ఎల్.ఎ.ల కుటుంబ సభ్యులకో జరుగలేదు కదా! ఇదీ ఉత్తరాంధ్ర ఆదివాసీల పరిస్థితి. ఇక దళితుల విషయానికి వస్తే ఉత్తరాంధ్రలో నిత్యం దళితులు, శూద్ర అగ్రకులాలైన కాళింగ, కాపు, వెలమ పెత్తందార్ల వేధింపులకు, దాడులకు గురవుతున్నారు. స్వయంగా మంత్రి ధర్మాన ఇలాకాలో జమ్ము గ్రామంలో వెలమ పెత్తందారులు ఒక దళిత స్త్రీని వివస్త్రని చేస్తే, అధికారులు కనీసం దోషులను అరెస్ట్ చెయ్యలేదు. నామమాత్రపు కేసును నమోదు చేశారు. ఇది ఒక ఉదాహరణ మాత్రమే. చెప్పుకోలేని సంఘటనలు నిత్యం జరుగుతున్నాయి. వీటిపైన జిల్లాలో గల ఒక్క దళిత ఎం.ఎల్.ఎ. నోరు విప్పి బహిరంగంగా మాట్లాడడం లేదు. మాట్లాడితే మంత్రి

దండకారణ్యంలో అమలవుతున్న ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా సమష్టి కృషితో, ప్రజల భాగస్వామ్యంతో అనేక ఆటుపోట్లను ఎదుర్కొంటూ సాధించిన విజయాల గురించి వివరిస్తున్నారు **గురూజీల బృందం**

# ప్రజల అభివృద్ధి ప్రజాయుద్ధంలో భాగమే

ఇటీవల దేశంలో అభివృద్ధి పేరుతో జరుగుతున్న విధ్వంసం గురించి, ప్రజలను నిర్వాసితులను చేసి, ఉమ్మడి వనరులను కొల్లగొట్టే పథకాల గురించి చాల చర్చ జరుగుతున్నది. ఈ చర్చ అంతా కూడ పాలకవర్గ అభివృద్ధి నమూనా చుట్టూ తిరుగుతున్నదే. ఆ పాలకవర్గ అభివృద్ధి నమూనాకు భిన్నంగా ప్రజల ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా దండకారణ్యంలో బీజరూపంలోనైనా అమలవుతున్నది. తీవ్రమైన నిర్బంధాన్ని, దాడిని ఎదుర్కొంటూ విప్లవోద్యమ నాయకత్వంలో దండకారణ్య ఆదివాసులు ఈ ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాను అమలు చేస్తున్నారు.

పాలకవర్గ నమూనాకూ ప్రజల ప్రత్యామ్నాయ నమూనాకూ స్పష్టమైన తేడాలున్నాయి. పాలకవర్గ నమూనా కొద్ది మంది ప్రయోజనాల కోసం, ఫలితాలు వారికి మాత్రమే దక్కేలా తయారయింది. ఉమ్మడి వనరులను కొద్దిమందికి హక్కు భుక్తం చేసేలా తయారయింది. ఈ నమూనా రూపకల్పనలో గాని, అమలులోగాని, ఫలితాల పంపిణీలోగాని, నమూనాపై చర్చలోగాని ప్రజలకు ఎటువంటి భాగస్వామ్యం ఉండదు. ఈ నమూనా కేవలం ఆర్థిక పరిభాషలో తయారయి దానిలో ఇతర సామాజిక అంశాలకు చోటు లేకుండా పోతుంది.

ఇందుకు భిన్నంగా ప్రత్యామ్నాయ నమూనా స్థానిక ప్రజలందరి అవసరాలను తీర్చడానికి, ప్రయోజనాలు నెరవేర్చడానికి తయారవు తుంది. ఫలితాలు స్థానిక ప్రజలందరికీ వారి వారి భాగస్వామ్యాన్ని బట్టి, వర్గపోరాటంలో వారి భాగస్వామ్యాన్ని బట్టి అందుతాయి. ఆ అభివృద్ధి ప్రణాళికలో ఏమి ఉండాలో ప్రజలు ఉమ్మడి చర్చ ద్వారా నిర్ణయిస్తారు. ఆ ప్రణాళికను అమలు చేయడంలో ప్రజలందరూ పాల్గొంటారు. అమలు తీరు మీద మళ్లీ ప్రజలందరూ చర్చిస్తారు. ఇది ఇవాళ కొనసాగుతున్న వ్యవస్థను రద్దు చేయదలచుకున్న పోరాటంలో భాగమైన నమూనా గనుక ఈ నమూనాలో ఆర్థిక అంశాలతో పాటు

---

ఆగ్రహానికి గురై, సంపాదన తగ్గిపోతుందన్న భయం. ఇక సాంఘిక సంక్షేమ వసతి గృహాలు, ఆశ్రమ, గురుకుల పాఠశాలలో సౌకర్యాలు అత్యంత దయనీయంగా ఉన్నాయి. జిల్లా అధికారులు పట్టించుకోవడం లేదు. వసతి గృహసంక్షేమ అధికారి నుంచి జిల్లా కలెక్టర్ వరకు మొత్తం అవినీతి మత్తులో తూగుతున్నారు. విద్యార్థి సంఘాలు, దళిత సంఘాలు ఎన్ని ఆందోళనలు చేసినా అధికార యంత్రాంగానికి చీమకుట్టినట్టుగా కూడా లేదు. మరి ఏంచేస్తే వీరిలో మార్పు వస్తుందో అర్థంకావడంలేదు.

ఉత్తరాంధ్రలో మొట్టమొదట విశాఖపట్నం ఆంధ్ర విశ్వ విద్యాలయం ఏర్పడింది. దీని అనుబంధ డిగ్రీ, పి.జి. కళాశాలలు జిల్లాకి మూడు నుంచి, నాలుగు వరకు ఉండేవి. ఇప్పుడవి ప్రైవేటీకరణ పేరుతో లెక్కలేనన్ని జిల్లా, డివిజన్, మండల్ కేంద్రాలలో ఏర్పడినాయి. జూనియర్ కాలేజీలు కార్పొరేట్ సంస్థల పేరుతో అనేకం ఏర్పడినాయి. గత పది పదిహేనేళ్ల కాలం నుంచి ఉన్నత విద్య మొత్తం కార్పొరేటీకరణ జరిగిరది. ఇప్పుడు అదే కార్పొరేట్ సంస్థల కాన్సెప్ట్ స్కూళ్లు, ఇ-టెక్నో స్కూల్స్ శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం లాంటి జిల్లా కేంద్రాలలోను, భాష్యం, రవీంద్ర భారతి లాంటి కార్పొరేట్ స్కూళ్లు మండల కేంద్రాలకు కూడా ఎగబాకుతున్నాయి. ఆముదాలవలస లాంటి చిన్న పట్టణంలో రవీంద్రభారతి లాంటి సంస్థ, ఎచ్చెర్ల మండల కేంద్రంలో కేశవరెడ్డి లాంటి సంస్థలు కాన్సెప్ట్ స్కూళ్లు నడుపుతున్నాయంటే విద్య ప్రైవేటీకరణ ఉత్తరాంధ్రలో ఏ దశకు చేరిందో మనం అర్థం చేసుకోవాలి. ఇక ఇంజనీరింగ్, ఎం.సి.ఎ., ఎం.బి.ఎ., ఫార్మసీలాంటి వృత్తి విద్యా కాలేజీలు ఉత్తరాంధ్రలో ప్రతి జిల్లాకి కనీసం పది పదిహేను కాలేజీలు ఏర్పడ్డాయి. అదే ప్రభుత్వరంగంలో గడిచిన కాలంలో ఎచ్చెర్లలో ఒక విశ్వవిద్యాలయం తప్ప ప్రభుత్వపరంగా ఎటువంటి డిగ్రీ, వృత్తి విద్యా కాలేజీలు ఏర్పడలేదు. ఒకప్పుడు ఉత్తరాంధ్రలోని భూస్వామ్య పెత్తందారీ వర్గాలు సారా వ్యాపారం పైన, సినిమా హాల్స్ నడపడంపైన, ప్రభుత్వరంగ కాంట్రాక్ట్ పనులపైన డబ్బులు పెట్టుబడిగా పెట్టినారు. ఇప్పుడు అదే వర్గానికి చెందినవారు విద్యారంగ వ్యాపారం పైన పెడుతున్నారు. ఇది దోపిడీ రూపంలో వచ్చిన మార్పుగా మనం చూడవచ్చు. పాలకవర్గ పార్టీల గ్రామ సర్పంచ్ దగ్గర నుంచి మంత్రిస్థాయి వరకు గల పాలకవర్గ ప్రతినిధులు మెజారిటీగా నేడు విద్యా వ్యాపారం చేస్తున్నారు. ఇదంతా అభివృద్ధేనని ప్రజలకు నమ్మబలుకుతున్నారు.

కావున ఉత్తరాంధ్ర వ్యవసాయ, పారిశ్రామిక, విద్యా, వైద్య రంగాలలోనూ, రాజకీయ, ఆర్థిక, సామాజిక రంగాలలోనూ ఎవరి అభివృద్ధిని అందరి అభివృద్ధిగా పాలకవర్గ పార్టీలు, వారి ప్రతినిధులు చూపుతున్నారో ప్రజలు అర్థం చేసుకోవాలి. అలా అర్థం చేసుకున్నప్పుడు ఒక సోంపేట, మరో కాకరాపల్లి, ఇంకో గంగవరం పోరు దారిని ప్రజలు ఎన్నుకున్నప్పుడు, ఉత్తరాంధ్ర నిజమైన అర్థంలో విముక్తి మార్గం వైపు పయనిస్తుంది. ఆ దారిలో మనమంతా పయనిద్దామని ఆశిస్తున్నాను.

(రచయిత ఉపాధ్యాయులు)

ప్రజాయుద్ధానికి సంబంధించిన అన్ని అంశాలూ ఉంటాయి. కేవలం ఉత్పత్తి, అభివృద్ధి అంశాలు మాత్రమే కాక, సైనిక, విద్యా, వైద్య, సాంస్కృతిక, రాజకీయ అంశాలన్నీ అందులో భాగమవుతాయి.

అంటే పాలకవర్గ అభివృద్ధి నమూనా సంకుచితమైనది కాగా, ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా అనేక రంగాలకు విస్తరించినది. పాలకవర్గ నమూనా దేశంలోని సంపన్నులకు, బహుళజాతిసంస్థలకు మేలు చేసేది కాగా, ప్రత్యామ్నాయ నమూనా స్వావలంబన మార్గంలో స్థానిక ప్రజల భాగస్వామ్యంతో వారి చైతన్యాన్ని పెంచుతూ, అవసరాలు తీరుస్తూ, అంతిమంగా వారి రాజ్యాధికారానికి దారి తీసేది. పాలకవర్గ అభివృద్ధి నమూనా తప్పనిసరిగా అత్యధిక ప్రజల వనరులను, ఉపాధిని, జీవితాలను కొల్లగొట్టేది కాగా, ప్రజల ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా వనరులనూ, ఉపాధినీ, జీవనాన్నీ అభివృద్ధి చేసేది.

ఈ ప్రత్యామ్నాయ నమూనాను ఆచరణలో పెట్టడానికి మూడు దశాబ్దాలుగా అనేక నిర్బంధాల మధ్య, దాడుల మధ్య దండకారణ్యంలో పనిచేస్తున్న విప్లవోద్యమం తన ముప్పయ్యవ వార్షికోత్సవం సందర్భంగా జనతన సర్కార్లలో ఒక విశిష్టమైన కార్యక్రమం చేపట్టింది. ప్రజాయుద్ధాన్ని, ఉత్పత్తిని సమన్వయపరుస్తూ సాగిన ఈ కార్యక్రమాన్ని 'భూమి చదును కార్యక్రమం' అని పిలిచారు. ఈ కార్యక్రమాన్ని మహా భూంకాల్ (ఒక శతాబ్దం కింద బ్రిటిష్ వలసవాదాన్ని ప్రతిఘటిస్తూ ఆదివాసులు చేసిన పోరాటం) సంస్మరణలో ఫిబ్రవరి 10న ప్రారంభించి ఫిబ్రవరి 28 వరకు నిర్వహించారు.

ఈ కార్యక్రమానికి రూపకల్పన చేస్తూ 2010 సెప్టెంబర్ లో తయారయిన లక్ష్యప్రకటనలో 'భూమి చదును కార్యక్రమంలో పేదరైతుల భూములకు మొదటి ప్రాధాన్యత ఇవ్వాలి. ప్రజావిముక్తి గెరిల్లా సైనికులు పేదరైతుల భూముల్లోనే పాల్గొని తమ పూర్తి మద్దతు అందించాలి. గ్రామ సభల్లో ఈ విషయాన్ని చర్చించి ప్రజల పూర్తి ఆమోదంతోనే నిర్ణయాలు తీసుకోవాలి' అని నాయకత్వం స్పష్టం చేసింది. ఈ విధాన ప్రకటన సందర్భంగా ఆయా ప్రాంతాలకు బడ్జెట్లను కూడ కేటాయించారు. ప్రజలతో, గెరిల్లా సైనికులతో పాటు ఈ కార్యక్రమంలో దండకారణ్య ఆదివాసి కిసాన్ మజ్దూర్ సంఘ్, క్రాంతికారి ఆదివాసి మహిళా సంఘ్ వంటి ప్రజాసంఘాల కార్యకర్తలు కూడ పాల్గొనాలని నిర్దేశించారు.

ఇది కేంద్రస్థాయి నిర్ణయం కాగా పాల్గొనేవారందరికీ ఈ కార్యక్రమం పట్ల అవగాహన కలిగించడం కోసం అన్ని స్థాయిల్లో చర్చలు జరిపారు. జనతన సర్కార్ నిర్మాణాలలో వివరంగా ప్రణాళికలు సిద్ధం చేసుకున్నారు. భూమి చదును కార్యక్రమం ఎలా నిర్వహించాలో చర్చించడానికి ప్రతి ఏరియా జనతన సర్కార్ మహాసభల సందర్భంగా ప్రత్యేకంగా ఒక రోజు వర్క్‌షాపు ఏర్పాటు చేసుకున్నారు.

ఇలా ఒక ఉత్పత్తి కార్యక్రమం, దానిలో సైనికులు పాల్గొనడం, దాని అవగాహనలో ప్రతి ఒక్కరినీ భాగస్వాములను చేసిన ప్రజాస్వామిక ప్రక్రియ అంతటితో అయిపోలేదు. దీన్ని ప్రతి ఒక్కరి మనసులలో నాటడానికి సాంస్కృతిక కోణాన్ని కూడ ముందుకు తెచ్చారు. రాజకీయ సాంస్కృతిక సంస్థ చేతనా నాట్యమంచ్ వారం రోజుల పాటు వర్క్‌షాపు నిర్వహించి భూమి చదును కార్యక్రమానికి అవసరమైన సాహిత్య, కళారూపాలను తయారు చేసింది. భూమి చదును, నీటి వసతి కల్పన అనే ఈ కార్యక్రమానికి సంబంధించిన అవగాహనను అన్ని వర్గాల ప్రజలలోకి తీసుకుపోవడానికి, అందరి భాగస్వామ్యాన్ని సాధించడానికి విస్తృత స్థాయిలో చర్చలు జరిపారు. పంచాయతీ స్థాయిలోని జనతన సర్కార్లు గ్రామ సభల్లో చర్చలు జరిపి నిర్దిష్ట కార్యక్రమాన్ని రూపొందించాయి.

ఏరియా జనతన సర్కార్ చర్చలో ప్రాంతం మొత్తానికీ కార్యక్రమ ప్రణాళిక తయారు చేశారు. సాగు భూమి నాణ్యతను పెంచడం, సాగు భూమి విస్తీర్ణం పెంచడం, నీటి వసతి కల్పించడం, తద్వారా భూమి ఉత్పాదకతను పెంచడం ఈ భూమి చదును కార్యక్రమ లక్ష్యం. ఈ కార్యక్రమంలో భాగంగానే కొన్ని గ్రామాల్లో చెక్ డ్యాంలు నిర్మించాలని, చెరువులు, కుంటలు, బావులు తవ్వాలని నిర్ణయించుకున్నారు. పాత నిర్మాణాల మరమ్మతులు కూడ చేపట్టారు. కొన్ని గ్రామాలలో నీటిని తోడడానికి ఇంజన్లు, పంపుసెట్లు అవసరమని గుర్తించారు. ఈ కార్యక్రమం నడుస్తున్న కాలంలో ప్రజల ఆహార అవసరాలకు ఇబ్బంది లేకుండా తిండిగింజలు కొనుక్కునేందుకు అవసరమైన డబ్బును ఏరియా సర్కార్, పంచాయతీ సర్కార్ కలిసి సమకూర్చాయి. తవ్వకాల పనులకు అవసరమైన పనిముట్లు కొనడానికి కూడ డబ్బు జనతన సర్కార్ ఇవ్వాలని తీర్మానించారు. పనిస్థలాల్లో తప్పనిసరిగా వైద్య సహాయ ఏర్పాట్లు చేయాలని నిర్ణయించారు.

పైన చెప్పినట్టుగానే ఈ ఉత్పత్తి, అభివృద్ధి కార్యక్రమం రాజకీయాలతో, పోరాటంతో సంపూర్ణ సమన్వయంలో ఉన్నది. అందువల్లనే ఈ కార్యక్రమంలో భాగంగానే అమరుడు ఆజాద్ స్మారక స్థూపాన్ని నిర్మించి, కార్యక్రమ ప్రారంభ దినాన ఆవిష్కరణ సభలు జరపాలని కూడ నిర్ణయించారు.

ఈ కార్యక్రమమంతా తీవ్రమైన నిర్బంధం మధ్య జరుగుతున్నదని ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. అంటే ఈ ఉత్పత్తి, అభివృద్ధి కార్యక్రమంలో పాల్గొంటున్న ప్రజల మీద, ప్రజాసంఘ కార్యకర్తల మీద, గెరిల్లా సైనికుల మీద ఏక్షణంలోనైనా ప్రభుత్వ బలగాల దాడి జరగవచ్చు. అందువల్ల అవసరమైన రక్షణ ఏర్పాట్ల గురించి కూడ చర్చించి, ముందు జాగ్రత్త చర్యలు తీసుకున్నారు. ఎటువంటి దాడులు జరిగినా తిప్పికొట్టడానికి ప్రజలను, మిలీషియా బలగాలను సిద్ధం చేశారు. ఈ కార్యక్రమంలో వేరువేరు విభాగాలు ఉన్నాయి గనుక వాటి మధ్య సమన్వయం కోసం, మార్గదర్శకత్వం కోసం ప్రత్యేక కమాండ్స్ ఏర్పాటు చేశారు.

విప్లవోద్యమం దండకారణ్యంలో పనిచేస్తున్న ఈ ముప్పై సంవత్సరాల కాలంలో మూడు లక్షల ఎకరాల భూమిని పేదలకు పంచిపెట్టింది. ఇవాళ ఈ ప్రాంతాలలో భూమిలేని రైతులు ఎవరూ లేరనే చెప్పవచ్చు. అయితే చిన్న చిన్న కమతాలలో, ఎగుడుదిగుడుగా ఉన్న భూములలో, వెనుకబడిన ఉత్పత్తి విధానం వల్ల, ఆదివాసులలో ఉన్న కొన్ని మూఢవిశ్వాసాల వల్ల భూమి ఉత్పాదకత ఆశించినంతగా లేదు. ఈ స్థితిలో ఉత్పత్తి లక్ష్యాలను, రాజకీయ లక్ష్యాలను వేరు చేయడానికి వీలు లేదు. ఈ రెండు లక్ష్యాలను సమన్వయించడం ద్వారా మాత్రమే ఉత్పత్తి పెరుగుతుంది, ప్రజల అభివృద్ధి జరుగుతుంది. రాజకీయ చైతన్యం, భాగస్వామ్యం పెరుగుతాయి. 'భూమి చదును కార్యక్రమం' ఈ లక్ష్యాలన్నిటినీ ఎలా సాధించిందో ఒక నిర్దిష్ట అనుభవపు ప్రాథమిక సమాచారం చూస్తే ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా అమలవుతున్న తీరు గురించి ఆసక్తికరమైన విషయాలు తెలుస్తాయి.

ఇక్కడ వివరాలు ఇస్తున్న స్థానిక జనతన సర్కార్ కింద రెండు గ్రామాలు ఉన్నాయి. ఇక్కడ సమష్టి పనులు ఫిబ్రవరి 1 నుంచే మొదలయ్యాయి. వ్యక్తిగతంగా చేసుకునే పనులు జనవరిలోనే పూర్తి చేసుకున్నారు. ఫిబ్రవరి నెల మొత్తాన్ని పొత్తం (సమష్టి) పనులకు కేటాయించుకున్నారు. ఫిబ్రవరి 10 నుంచి భూంకాల్ భూమి చదును కార్యక్రమం ఉంటుందని ముందుగానే సమాచారం ఉంది. ఇక్కడ సమష్టి పనిని, భూమి చదును కార్యక్రమాన్ని నెలరోజుల పనిగా లెక్కగట్టవచ్చు. గెరిల్లా సైనికులు మాత్రం ఫిబ్రవరి 10 నుంచి, అంటే 18 రోజులు మాత్రమే, ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

ఈ రెండు గ్రామాలలో 213 కుటుంబాలు (ఎ - 153, బి - 60) ఉన్నాయి. భూమి చదును పనిలో మొత్తం 792 మంది (ఎ - 600, బి - 192) పాల్గొన్నారు. ఈ పని చేయడంలో గ్రామస్తులు తమను తాము టీంలుగా విభజించుకున్నారు. ఎ గ్రామంలో 11 టీంలు, బి గ్రామంలో 5 టీంలు పనిచేశాయి. ప్రతి టీంకు ఒక పురుషుడు, ఒక మహిళ ఇద్దరి నాయకత్వం ఉంటుంది. అన్ని టీంలలోను కలిసి మహిళల సంఖ్య 40 శాతం ఉంది. నిర్బంధ పరిస్థితి వల్ల 24 గంటలూ సెంట్రీలను పెట్టుకోవలసి వచ్చింది. ఇక్కడ పనిచేసిన 792 మందితో పాటు 100 మంది గెరిల్లా సైనికులు నాలుగు రోజులు భూమి చదును కార్యక్రమంలో పాల్గొన్నారు. రోజుకు ఐదు గంటల పని జరిగింది. మొత్తంగా 22,176 పనిదినాలు. రోజు కూలీ రు. 40 గా లెక్కించినా, సమష్టిగా జరిగిన పని మొత్తం దాదాపు రు. 9 లక్షలుగా ఉంది. ఈ పనుల కోసం ఏరియా సర్కార్ నుంచి రు. 50 వేలు, స్థానిక సర్కార్ నుంచి ఆరు క్వింటాళ్ల ధాన్యం, రు. రెండు వేలు ఇచ్చారు. పనిముట్ల కోసం ఏరియా సర్కార్ రు. 4 వేలు ఖర్చు చేసింది. అంటే ప్రజల

## మరో అనుభవం

దక్షిణ బస్తర్‌లోనే మరొక రెండు ఏరియాలలోని ఏడు పంచాయతీ సర్కార్లలో జరిగిన కార్యక్రమ అనుభవాలు ఇలా ఉన్నాయి:

ఒక ఏరియా సర్కార్‌లో ఎ పంచాయతీ సర్కార్‌లో 4 గ్రామాలలో 640 మంది 9 రోజులు పనిచేసి 13 పొలాలు చదును చేశారు. బి పంచాయతీ సర్కార్‌లో 3 గ్రామాలలో 460 మంది 18 రోజులు పని చేసి 37 పొలాలు చదును చేశారు. సి పంచాయతీ సర్కార్‌లో 4 గ్రామాలలో 380 మంది 10 రోజులు పని చేసి 7 పొలాలు చదును చేశారు. డి పంచాయతీ సర్కార్‌లో 300 మంది ప్రజలు, 115 మంది గెరిల్లాలు కలిసి 18 రోజులు పనిచేసి 17 పొలాలు చదును చేశారు. మరొక ఏరియా సర్కార్‌లో ఇ పంచాయతీ సర్కార్‌లో 4 గ్రామాలలో 300 మంది ప్రజలు, 121 మంది గెరిల్లాలు కలిసి 20 రోజులు పనిచేసి 20 పొలాలు చదును చేశారు. ఎఫ్ పంచాయతీ సర్కార్‌లో 3 గ్రామాల్లో 440 మంది ప్రజలు, 50 మంది గెరిల్లాలు కలిసి 20 రోజులు పనిచేసి 12 పొలాలు చదును చేశారు. జి పంచాయతీ సర్కార్ లో 5 గ్రామాల్లో 550 మంది ప్రజలు 8 రోజులు పనిచేసి 32 పొలాలు చదును చేశారు.

ఈ పనుల కోసం అన్ని గ్రామాల సర్కార్లకూ ఏరియా సర్కార్ తలా రు. 40 వేల నుంచి రు. 60 వేల వరకు ఆర్థిక సహాయం అందించింది. స్థానికంగా రు. 10 వేల నుంచి రు. 20 వేల వరకు డబ్బులు, ధాన్యం జతచేసి పనులు చేశారు. ఒక మనిషికి రోజుకూలి రు. 40గా లెక్క కడితే ఒక్కో సర్కార్‌లో రెండున్నర లక్షల నుంచి మూడున్నర లక్షల రూపాయల పనులు జరిగాయి. తిండి గింజలు పండే భూమి లేని వారికి అటువంటి భూమి ఏర్పాటు చేశారు, సర్కార్ ఆధ్వర్యంలో ఉన్న పశువులను అందరికీ సర్దుబాటు చేశారు.

జనతన సర్కార్ల నిర్వహణలో ఉన్న ప్రధానమైన ప్రజాసంక్షేమ కార్యక్రమాలు విద్య, వైద్యం.

భవిష్యత్ తరాలను తీర్చిదిద్దే ముఖ్యవిషయంగా విద్యకు చాల ప్రాధాన్యత ఉంది. ఐదు డివిజన్లలో జనతన సర్కార్లు మొత్తం 68 పాఠశాలలను నడుపుతున్నాయి. అందులో 15 ఆశ్రమ పాఠశాలలు. మొత్తంగా రెండు వేల మంది ప్రాథమిక విద్యను అభ్యసిస్తున్న విద్యార్థినీ విద్యార్థులు ఉన్నారు. 82 మంది ఉపాధ్యాయులు (వీళ్లను గురూజీలు అని పిలుస్తారు) ఉన్నారు. గురూజీలకు నెలకు రు. 800 నుంచి రు. 1000 వరకు జీతంగా సర్కార్ నుంచి అందుతోంది. కొన్ని గ్రామాల్లో ఈ గురూజీలే రాత్రి పాఠశాలలను కూడ నడుపుతున్నారు. ఉన్నత పాఠశాల విద్య కోసం ప్రస్తుతానికి చుట్టుపక్కల ఉన్న హాస్టళ్లకు, పాఠశాలలకు వెళుతున్నారు. ప్రాథమిక స్థాయిలో విద్యావిభాగ కమిటీ పాఠ్యపుస్తకాలను తయారు చేసింది. ఈ విద్యార్థులకు ప్రతిరోజూ రోల్ కాల్, సమష్టి అధ్యయనం, చేతనా నాట్యమంచ్ సాంస్కృతిక కార్యక్రమాలు ఉంటాయి. ఈ విద్యార్థినీ విద్యార్థులు కూడ భూంకాల్ కార్యక్రమాల్లో పాల్గొన్నారు.

ఇక వైద్యం విషయంలో ఏ రకమైన ఆరోగ్య సమస్యలు ప్రధానంగా ఉన్నాయో జనతన సర్కార్లు నమోదు చేస్తున్నాయి. ఒక ఏరియా సర్కార్ లో ఉన్న 11 పంచాయతీ సర్కార్లలో 2010లో తలనొప్పి, జ్వరం, కలరా, దగ్గు, నడుంనొప్పి, బలహీనత, గుండెనొప్పి, కురుపులు, గజ్జి, పార్శ్వ నొప్పి, ఉబ్బసం, కామెర్లు, చెవిపోటు, గాయాలు, రుతుస్రావం, కడుపునొప్పి, పాముకాటు వంటి అనారోగ్య సమస్యలతో ఎంతెంతమంది స్త్రీలు, పురుషులు, పిల్లలు వైద్య సహాయం పొందారో సర్కార్లు జాబితా తయారు చేశాయి. ఈ సమస్యలకు మందులు ఇచ్చాం. కాని శుభ్రత గురించి ప్రచారం చేసినా ఇంకా చాల చోట్ల అమలు కావడం లేదు అనీ, కొన్ని పంచాయతీలలో మందులు సరిగ్గా తేవడం లేదు అనీ సర్కార్ నివేదిక తెలుపుతోంది.

ఈ ఏరియాలో అనారోగ్యంతో 2010లో 107 మంది మహిళలు, 93 మంది పురుషులు చనిపోయారని ఈ నివేదిక చెపుతోంది. కలరాతో అత్యధికులు (49 మంది మహిళలు, 39 మంది పురుషులు) చనిపోగా, మలేరియా, పాముకాటు, క్షయ, కాళ్లవాపులు, కాళ్లు చేతులు నొప్పులు, గుండెనొప్పి, సొమ్మ, చెట్టుమీది నుంచి పడడం, వాగులో పడి కొట్టుకుపోవడం, విషపు కాయలు తినడం, కాన్పులో చనిపోవడం వంటి సమస్యలతో కూడ మరణాలు సంభవించాయి. ఆత్మహత్యలు కూడ ఉన్నాయి. 292 శిశుజననాలు ఉండగా, 42 శిశుమరణాలు ఉన్నాయి. మొత్తంగా మందులకు అయిన ఖర్చు రు. 55,522. కలరా వ్యాధి మొత్తం 614 మందికి వచ్చిందని, జనతన సర్కార్ల వైద్య సహాయం వల్ల 500 మంది బతికి బట్టకట్టగలిగారని నివేదిక చెపుతోంది.

ఒక ఏరియాలో 2010 ఒక్క సంవత్సర కాలంలోనే వివిధరకాల పండ్లమొక్కలు, ఇతర ఉపయోగకరమైన మొక్కలు ఏడువేలు సరఫరా చేశారు. కృషిక్షేత్రాల్లో కూరగాయలు, ఆకుకూరలు, దుంపలు విస్తారంగా పండుతున్నాయి.

సమష్టి స్వచ్ఛంద శ్రమ విలువ నెల రోజుల్లో రు. 8 లక్షలకు పైగానే ఉంటుంది.

అనుకున్న పనులన్నీ ఈ కార్యక్రమంలో భాగంగా జరగకపోయినా, చెరువు గండి పూడ్చి ఎత్తుపెంచే పథకం అమలు కాకపోయినా, అవసరమైతే మరికొన్ని రోజులు ఇలా సమష్టి పని కొనసాగించడానికి కూడ ప్రజలు ఆసక్తి చూపారు. మొత్తం మీద జరిగిన పనిలో ఎ గ్రామంలో ఒకటి, బి గ్రామంలో 11 భూములు కొత్తగా కేటాయించి, చదును చేసి ఇచ్చారు. ఎ గ్రామంలో 13 భూములు, బి గ్రామంలో 11 భూములు ధాన్యం పంటకు అనువుగా అభివృద్ధి చేశారు. మొత్తం మీద 100 కుటుంబాల భూములు చదును చేశారు. మొత్తంగా 40 ఎకరాల భూమి కొత్తగా సాగులోకి వచ్చింది. పేద, దిగువ, మధ్య, ఎగువ మధ్యతరగతి రైతాంగం ఉన్నారు. ఒక ఆదివాసి వైద్యుడి భూమిలో మరొకరోజు ఎక్కువ పని చేయమని కోరడం మినహా సమస్యలు ఏమీ తలెత్తలేదు. ప్రజల్లో ఈ కార్యక్రమం పట్ల అనుకూల స్పందన కనబడడమే కాకుండా, ఈ కార్యక్రమం ఇంకా ముందు నుంచి చేసి ఉంటే బాగుండేదని అభిప్రాయం వచ్చింది. ప్రజల మధ్య సంపూర్ణ సహకారం, బలమైన ఐక్యత వ్యక్తమయ్యాయి.

ఈ కార్యక్రమంలో భాగంగానే నాలుగు అంశాలు చర్చకు వచ్చాయి: 1. హైబ్రిడ్ విత్తనాలు వాడితే రెండోసారి పంటకు పనికి రావడం లేదు. 2. భూమి దున్నడానికి ట్రాక్టర్లు వంటి సాధనాలు అవసరం లేదు. 3. వర్షాధార భూములు కావడం వల్ల, అదనపు ఆదాయం ఇచ్చే విప్ప చెట్ల వంటివాటిని తొలగించడానికి ప్రజలు సిద్ధంగా లేరు. 4. సహకార సంఘాలు, సమష్టి వ్యవసాయ పనుల వల్ల చైతన్యం క్రమంగా పెరుగుతూ సమష్టి వ్యవసాయ క్షేత్రాల వైపు వెళ్లే అవకాశం ఉంది. దానికి ప్రజల్లో సానుకూలత ఉంది.

ఈ సంవత్సరం పంటలు బాగా పండాయి. సరిహద్దు దాటి ఆంధ్రకు గాని, మరెక్కడికి గాని కూలికి వెళ్లవలసిన అవసరం రాలేదు. సమష్టి భూమి చదును కార్యక్రమం వల్ల సొంత పనులు ఆగిపోయాయన్న ఫిర్యాదు రాలేదు. వర్గ ప్రాతిపదికన అందరికీ సమాన సహకారం దొరికిందనే భావన కలిగింది. గెరిల్లాలు తమతోపాటు మరికొన్ని రోజులు ఉండాలని కోరుకున్నారా అని అడిగితే, అనుకోలేదని, వారు అన్ని గ్రామాలకూ వెళ్లవలసిందేనని ప్రజలు అన్నారు.

ఈ ఏరియా జనతన సర్కార్ కింద 19 పంచాయతీ స్థాయి జనతన సర్కార్లు ఉన్నాయి. ఇక్కడ 2010 నవంబర్ లో చేతన నాట్య మంచ్ వారం రోజుల సాహిత్య, సాంస్కృతిక వర్క్‌షాపు నడిపింది. దానిలో 9 మంది మహిళలతో పాటు 24 మంది పాల్గొన్నారు. ఈ వర్క్‌షాపు లో 18 పాటలు, 7 నాటికలతో పాటు కవితలు, కథలు ఎన్నో వెలువరించారు. రెండు కాసెట్లు కూడ రికార్డ్ చేశారు. ఈ సాంస్కృతిక రూపాలనే మూడు నెలల ప్రచార కార్యక్రమంగా తీసుకుని భూమి చదును కార్యక్రమానికి ప్రజలను సిద్ధం చేశారు. భూమి చదును కార్యకమం ప్రారంభం కావడానికి రెండు రోజుల ముందే ఒక గ్రామంపై పోలీసు దాడి జరిగింది. ఒక రైతును కాల్చి చంపారు, మరొక రైతును గాయపరిచారు. గ్రామాలలో నిరంతరాయంగా పెట్రోలింగ్ జరుగుతోంది. భూమి చదును ఉత్పత్తి కార్యక్రమం జరగబోతుందని పోలీసులకు సమాచారం ఉంది. ముఖ్యమంత్రి రమణ్ సింగ్, జిల్లా రెవెన్యూ, పోలీసు అధికారులు ఈ ప్రాంత పరిసరాలకు వచ్చి సంస్కరణల

> ఈ సర్కార్లన్నిటిలోనూ జవాబుదారీతనం అత్యున్నత స్థాయిలో ఉంది. ప్రజాస్వామ్యంలో ప్రతిదీ పారదర్శకంగా ఉండాలని ప్రజలందరూ నమ్ముతున్నారు. ఒక ఏరియా సర్కార్ 2010 సంవత్సరానికి గాను చేసిన ఖర్చులను మహాసభలో చర్చించి ఆమోదించారు. అలా చర్చించిన ఖర్చుల నివేదిక ప్రకారం వ్యవసాయ పనులకు రు. 46,573 (17 శాతం), చేప పిల్లల కోసం రు. 26,000 (9.7 శాతం), కుటుంబాలకు ఆర్థిక సహాయం రు. 15,000 (5.6 శాతం), ఆస్పత్రిలో మందుల కొరకు రు. 73,982 (27.5 శాతం), పాఠశాల విద్య కొరకు, పుస్తకాలకు రు. 18,229 (6.8 శాతం), చేతన నాట్యమంచ్, సాంస్కృతికరంగం, సాహిత్యం కొరకు రు. 3,650 (1.4 శాతం), జైళ్ల ఖర్చులు రు. 37,000 (13.8 శాతం), మిలీషియా ఖర్చులు రు. 45,583 (16.9 శాతం), నిర్వహణ ఖర్చులు రు. 3,014 (1.1 శాతం). ఇవన్నీ సర్కార్లు రూపొందుతున్న ప్రాథమిక క్రమంలో చేస్తున్న ఖర్చులు. సర్కార్ల ఆదాయం ప్రధానంగా ప్రజల సమష్టి శ్రమ విలువ నుంచి, జిల్లా సర్కార్ల కేటాయింపుల నుంచి వస్తుంది.

గురించి మాట్లాడి వెళ్లారు. కాని జనతన సర్కార్లు ఏర్పడిన గ్రామాలలో వారి ప్రయత్నాలు సాగలేదు. ప్రజల స్వావలంబన విధానాలే విజయవంతంగా ముందుకు సాగాయి. ప్రజలు బయటి ప్రాంతాల మీద ఆధారపడకుండా స్థానికంగా ప్రత్యామ్నాయ మార్గాలు అన్వేషిస్తున్నారు. ఆ ప్రజా ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా సక్రమంగా, నిరాటంకంగా అమలు కావడానికి స్థానిక మిలీషియా, ప్రజా విముక్తి గెరిల్లా సైనిక బలగాల రక్షణ తీసుకోవలసి వస్తోంది.

ఈ నివేదికలో ఇప్పటివరకు ఒక పంచాయతీ స్థాయి జనతన సర్కార్ కు సంబంధించిన నిర్దిష్ట వివరాలను మాత్రమే పొందుపరిచాం. ఇటువంటి స్థానిక సర్కార్లు ఒక్కొక్క ఏరియా సర్కార్ కింద 20 వరకు ఉంటాయి. ఏరియా సర్కార్లు జిల్లా సర్కార్ మార్గదర్శకత్వంలో పనిచేస్తాయి. అన్ని స్థాయిలలో సర్కార్ కమిటీలు, స్టాండింగ్ కమిటీలు, శాఖ కమిటీలు, ప్రజాసంఘాలు, మిలీషియాల సహకారంతో జోన్ వ్యాప్తంగా ఈ ఉత్పత్తి - అభివృద్ధి కార్యక్రమం కొనసాగుతోంది. ఈ కార్యక్రమం ప్రజలను మరింతగా ఏకం చేయడంతో పాటు, రాజకీయంగా చైతన్యవంతం చేస్తోంది. లక్షల కోట్ల రూపాయల బడ్జెట్లు గల దోపిడీవర్గాల కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చేపట్టే అభివృద్ధి పథకాలు, సంస్కరణలు అన్నీ బూటకమే. ప్రజల్లో ఒక సెక్షన్‌ను చీల్చి మిగిలినవారికి పోటీగా నిలబెట్టడానికే. ప్రభుత్వ బడ్జెట్లన్నీ ప్రచారానికి, ఆర్భాటానికి, అవినీతికి, పాలకులు, అధికారులు, దళారులు కుంభకోణాలు చేయడానికే ఖర్చవుతున్నాయి. ఈనాడు నిజమైన అభివృద్ధి, సంక్షేమం జనతన సర్కార్లలోనే అమలు జరుగుతోంది. అందుకు ప్రజలు తమంత తామే స్వచ్ఛందంగా బాధ్యత పడుతున్నారు. గ్రామసభల్లో చర్చించి ఆమోదించిన కార్యక్రమాలే అమలు జరుగుతున్నాయి.

ఇది ప్రజల ప్రభుత్వం, ప్రజల పాలన. ప్రజాయుద్ధం ద్వారా దండకారణ్యాన్ని విముక్తి చేయడంలో జనతన సర్కార్లు రాజకీయంగా ప్రజల పక్షాన పనిచేస్తున్నాయి. వర్గపోరాటాన్ని, అభివృద్ధి కార్యక్రమాలను ప్రజాయుద్ధ రాజకీయాలతో జనతన సర్కార్లు నడుపుతున్నాయి.

*(రచయితలు దండకారణ్య ఉద్యమంలో పనిచేస్తున్న ఉపాధ్యాయులు)* వీ

*వివిధ దేశాలలోని చేదు అనుభవాలతో పాటు, మన దేశంలోని అనుభవాల ఆధారంగా చూస్తే అణు విద్యుత్ మౌలికంగా జీవరాశి మనుగడకే ప్రమాదకరమని అంటున్నారు* **పి.వి. రమణ**

# అణు విద్యుత్ - ప్రజల ప్రాణాలతో చెలగాటం

*'మొదట కాలిన గాయాలకు చికిత్స చేసాం. ఫలితం లేక పోయింది. ఆ రోజున ఇక్కడ లేని వాళ్లు, ఒంటి మీద చిన్న గాయం లేని వాళ్లు కూడా జబ్బుపడి చచ్చిపోవడం చూస్తున్నాం. తిండి తినలేరు. జుట్టు రాలిపోతుంది. ముక్కు, నోరు, కళ్లలో నుంచి రక్తస్రావం. విటమిన్ ఇంజక్షన్లు ఇస్తుంటే సూది గుచ్చిన చోటే చర్మం కుళ్లిపోసాగింది. రక్తంలోని తెల్ల కణాలను ఏదో చంపేస్తుందని మాకర్థమైంది. కాని అదేమిటి? ఏం చేసి వాటిని బతికించాలో మాకు తెలియదు.'* – డా. జెన్ కట్సుబె

*(నాగసాకి దురంతంపై ఆస్ట్రేలియన్ విలేకరి విల్‌ఫ్రెడ్ బర్కెట్ ప్రపంచాన్ని హెచ్చరిస్తూ ఇచ్చిన రిపోర్ట్ నుంచి)*

'భారతదేశం అత్యంత వేగంగా అభివృద్ధి చెందాలంటే విద్యుచ్ఛక్తి చాలా అవసరమనీ, దానికోసం అణుశక్తి కావాలనీ, దాని కోసమే 1974 నుండి అమలులో ఉన్న నిషేధాన్ని తొలగించుకోవడం తప్పనిసరైందని, అందుకే అమెరికాతో ఒప్పందం చేసుకున్నా'మని అంటూ ప్రధాని మన్మోహన్ సింగ్ ప్రకటించారు. దానితో పాటు పెరుగుతున్న విద్యుత్ అవసరాలకు అణు విద్యుత్ ఒక్కటే పరిష్కారమనీ, అణు విద్యుత్ ఉత్పత్తి చేయడం చాలా చవక అనీ, అణు శక్తి ప్రమాద రహితమైనదనీ మన దేశ అణు విధానకర్తలు పదే పదే ప్రకటిస్తూ వస్తున్నారు.

తర్వాత ఏం జరిగిందో మనకు తెలుసు. పార్లమెంట్‌కు కూడా తెలియకుండా 10 నవంబర్ 2008న యు.పి.ఎ. ప్రభుత్వం అమెరికా అండర్ సెక్రటరీ ఆఫ్ స్టేట్‌కు ఒక ఉత్తరాన్ని ఫ్యాక్స్ చేసింది. అందులో పదివేల మెగా వాట్ల సామర్థ్యం గల అణుశక్తితో నడిచే విద్యుత్ ప్లాంట్ల నిర్మాణానికి అవసరమైన అణు సామాగ్రిని అమెరికా నుండి దిగుమతి చేసుకుంటామని రాసారు. తర్వాత ఇతర దేశాల్లో, భద్రతా, నాణ్యతా సంబంధమైన పరీక్షలు నిర్వహించకుండా అప్పటికే తయారై ఉన్న ఎలాంటి మోడల్ అణు రియాక్టర్లనైనా దిగుమతి చేసుకోవడానికి అంగీకరించారు.

అప్పటికే అమెరికా 'అణు ఒప్పందం' ఫలితంగా భారత్‌కు ఒనగూరే అనేక వాణిజ్య, వ్యూహాత్మక పరమైన ప్రయోజనాల గురించి అదే పనిగా చెపుతూ వచ్చింది. ఆ దేశంలో నిరుపయోగంగా ఉన్న అణు రియాక్టర్లను మనకు అంటగట్టడమే అసలు ఉద్దేశం.

జపాన్ అణు ప్రమాదం తర్వాత మన్మోహన్‌సింగ్ మన దేశంలో అణు సంస్థల భద్రతకు మరింత సమగ్రమైన పరీక్షలు జరిపి పటిష్టమైన చర్యలు తీసుకుంటామని అన్నారు. అణు సంస్థ చైర్మన్ అయిన ఎస్.కె. జైన్ 'జపాన్ ప్రమాదం నుంచి గుణపాఠాలు తీసుకుని మన దేశంలో గల 19 అణు రియాక్టర్లపై సరైన భద్రతా చర్యలు తీసుకుంటామని, మనకు అణు విద్యుత్ తప్పవేరే మార్గం లేదని' అన్నారు. మన దేశంలో అనేక మంది శాస్త్రజ్ఞులు, గత అణుశక్తి కమిషన్ కమిషనర్ అయిన అనిల్ ఖాకోదర్‌తో సహా మనదేశ అణు సంస్థలన్నిటికీ తరుచుగా భద్రతా పరీక్షలు నిర్వహించాలనీ, ఉద్యోగులకు సరైన తర్ఫీదు ఇవ్వాలనీ, భద్రతకు ఎటువంటి లోపం లేకుండా, ఇటువంటి ప్రమాదాలు భవిష్యత్‌లో జరగకుండా పటిష్టమైన చర్యలు తీసుకోవాలనీ; ఇంకా అనేక సూచనలు చేసారు. అందరూ భద్రతా చర్యలు గురించి చెప్పడమే గాని అణుశక్తి ఎంత ప్రమాదకరమో చెప్పలేదు.

ఇక దేశ అణుశక్తి సీనియర్ విధానకర్త ఎస్. బెనర్జీ 'మీడియా ప్రచారం చేస్తున్నట్లు అణు ప్రమాద అత్యవసర స్థితి ఏమీ లేదనీ, ఇది కేవలం రసాయనిక ప్రతిచర్య మాత్రమే' అన్నారు. శివశంకర్ మీనన్, జాతీయ సలహాదారు మరింత ముందుకు పోయి 'వాడి పడేసిన అణు పదార్థాలున్న చోట మంటలు రేగాయని అణుశక్తి కమిషన్ అధికారులంటున్నారు. కాని అలా జరిగే అవకాశమే లేదు' అని మీడియాతో చెప్పారు. దీనిపై అమెరికా గత అణుశక్తి రెగ్యులేటరీ కమిషన్ కమిషనర్ అయిన పీటర్ బ్రాడ్‌ఫోర్డ్ 'ఇక్కడ జరగదు అనే వాక్యం అణు శక్తి పరిశ్రమలకు చాలా ప్రమాదకారి అవుతుంద'ని అన్నారు. మన పాలకులు, పాలసీ విధానకర్తలు, అణుశాస్త్రజ్ఞుల ప్రకటనలు చూసి వారిని, ప్రముఖ జర్నలిస్టు, ప్రమాదకరమైన అణు విద్యుత్ ప్లాంట్ల గురించి వివరంగా వ్యాసాలు రాస్తున్న అణుశక్తి వ్యతిరేక సంస్థ (సి.ఎన్.డి.పి.) నాయకులు ప్రఫుల్ బిద్వాయ్ 'అణు నీరోలు'గా వర్ణించడం చాలా సరైన అంచనా అని మనం కూడా ఒప్పుకుంటాం.

ఫ్రాన్స్, అమెరికాల నుండి పరీక్షలు నిర్వహించని అణు రియాక్టర్లను దిగుమతి చేసుకుంటున్న పాలకుల్ని గత అణుశక్తి రెగ్యులేటరీ బోర్డు (ఎ.ఇ.ఆర్.బి.) చైర్మన్ ఎ. గోపాలకృష్ణన్ తీవ్రంగా విమర్శించారు. ఫ్రాన్స్, అరెవా కంపెనీ సరఫరా చేస్తున్న యూరోపియన్ ప్రెస్‌రైజుడ్ రియాక్టర్లు (ఇ.పి.ఆర్.) ఇంతవరకు ఎక్కడా పరీక్ష చేయబడలేదని, అందుకే వాటి భద్రత, నాణ్యత విశ్వసనీయతల గురించి మనకు పూర్తిగా తెలియకపోవడమే కాకుండా అవి తీవ్రమైన ప్రమాదాలకు దారి తీస్తాయని' చెప్పారు. అంతే కాకుండా ప్రధాని ఆదేశించినట్లు భద్రతా చర్యలు తీసుకోవడానికి ఎ.ఇ.ఆర్.బి. స్వతంత్ర సంస్థ కాదనీ, ప్రభుత్వ జేబు సంస్థతో ప్రయోజనం ఏమీ ఉండదని కూడా అన్నారు.

పర్యావరణ శాఖ మంత్రి జైరామ్ రమేష్ ప్రధానికి ఉత్తరం రాస్తూ 'మన దేశంలో తయారైన రియాక్టర్లను వాడడమే మంచిదనీ, విదేశాల

నుంచి దిగుమతి చేసుకుంటున్న మల్టిపుల్ రియాక్టర్లను, ప్రతి ఒక్క దానికి విడిగా దాన్ని బలపరిచే నిర్మాణాలు చెయ్యాల్సి ఉంటుందనీ, అదే మన రియాక్టర్లయితే ఒకే రియాక్టర్ నుండి మరొక రియాక్టర్‌కు సహకారం లభిస్తుందనీ, ఈ విషయంపై జపాన్ ప్రమాదం నుండి గుణపాఠాలు తీసుకోవాలనీ' అంటూ తన అభిప్రాయం తెలిపారు. కాని ఏప్రిల్ 16 నాటికి మాట మార్చేసి 'ఎన్ని సమస్యలున్నా, జయితాపూర్ అణు విద్యుత్ ప్లాంట్ నిర్మాణం జరిగి తీరుతుందనీ, దానికి ఒక స్వతంత్ర స్థాయి భద్రతా విధానాన్ని ప్రవేశపెట్టాల్సి ఉంటుందనీ' ఒక ఉచిత సలహా పారేసాడు. ఈ విధంగా మాట మార్చడం ఈయనకు కొత్తేమీ కాదు. ఒడిశాలో నిర్మించబోతున్న కొరియాకు చెందిన 'పోస్కో' స్టీల్ ప్లాంట్ ప్రాజెక్ట్‌కు మొదట అనుమతిని నిరాకరించి, చివరకు ఏవో కొన్ని పనికిరాని సూచనలతో అనుమతి ఇచ్చేసాడు. గత పది సంవత్సరాల నుండి కొనసాగుతున్న బ్రహ్మాండమైన ప్రజా ఉద్యమం వల్లనే నేటి వరకు అక్కడ ప్రాజెక్ట్ నిర్మాణం చేయలేకపోయారు.

దేశంలో ఎగిసిపడుతున్న అనేక ప్రజా ఉద్యమాల ధాటికి తట్టుకోలేక, వాటిని బలహీనం చెయ్యడానికి ప్రభుత్వం కావాలనే జైరామ్ రమేష్‌ను పర్యావరణ శాఖ మంత్రిగా నియమించారు. పర్యావరణ పరిరక్షకుడిగా ప్రజలు వ్యతిరేకిస్తున్న కొన్ని ప్రాజెక్ట్‌లకు పర్యావరణ శాఖ అనుమతి నిరాకరించడంతో ఈయన దేశంలో పర్యావరణాన్ని, ప్రజల్ని రక్షించడానికి అవతరించిన రక్షకుడిగా మీడియాలో పెద్ద ప్రచారం జరిగింది. సామ్రాజ్యవాద శక్తులకు అనుకూలమైన ఆయన నిజ స్వరూపం పోస్కో ఉదంతంతోనూ, నేడు జయితాపూర్ అణు విద్యుత్ సంస్థ విషయంలోనూ స్పష్టమయింది.

నిజానికి మన దేశంలో తయారైన అణు రియాక్టర్లు 1960లో డిజైన్ చేసినవి. అవి చాలా పురాతనమైన సాంకేతిక పరిజ్ఞానంతో, నేటి కాలానికి అవసరమైన భద్రతా విధానాలు లేకుండా నిర్మించబడ్డవి. అందుకే గతంలో మన 'అణు విద్యుత్ కేంద్రాలంత ఘోరమైన రక్షణా ఏర్పాట్లు గల కేంద్రాలు ప్రపంచంలో ఎక్కడా లేవని' నోబెల్ బహుమతి గ్రహీత డా. హెలెన్ కాల్డికాట్ వ్యాఖ్యానించారు.

మన దేశంలో 20 అణు విద్యుత్ సంస్థలున్నాయి. అందులో ప్రెసరైజుడ్ హెవీ వాటర్ రియాక్టర్లు (పి.డబ్ల్యూ.ఎచ్.ఆర్.) 18 మన దేశ శాస్త్రజ్ఞులు తయారు చేసినవే. బాయిలర్ వాటర్ రియాక్టర్లు (బి.డబ్ల్యూ.ఆర్.) రెండింటిని అమెరికా జనరల్ ఎలక్ట్రిక్ సంస్థ నుండి దిగుమతి చేసుకున్నవి. మొట్టమొదట రాజస్థాన్‌లో నిర్మించిన వంద మెగావాట్ల ప్లాంట్ ప్రస్తుతం మూత పడిపోయింది. కొత్త ప్రాతిపాదనల ప్రకారం దేశంలో ఆరు ప్రాంతాలలో విదేశాల నుండి దిగుమతి చేసుకుంటున్న 36 రియాక్టర్లలో మొత్తం 40 వేల మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తి చేయాలని, 2032 నాటికి 60 వేల మెగావాట్లకు చేరాలని ప్రణాళికలు సిద్ధం చేసారు.

అప్పుడే తమిళనాడు, తిరునల్వేలి జిల్లా, కూడంకళంలో రష్యా నుండి దిగుమతి చేసుకున్న రెండు రియాక్టర్లలో ప్లాంట్ నిర్మాణం జరిగింది. ఇక మిగతావి మహారాష్ట్రలో జయితాపూర్, ఒడిశాలో సోనేపూర్‌లలో ఫ్రెంచ్ రియాక్టర్లు, గుజరాత్‌లో ఛాయామిలివెర్ధి, మన రాష్ట్రంలో శ్రీకాకుళం జిల్లా కొవ్వాడలో అమెరికా రియాక్టర్లతో ప్లాంట్‌ల నిర్మాణం చేయబోతున్నారు. కొవ్వాడలలో 9564 మెగావాట్ల సామర్థ్యంతో అణు విద్యుత్ ప్లాంట్‌ను నాలుగు సంవత్సరాలలో నిర్మించబోతున్నామని, వచ్చే ఏడాదికే మొదటి రియాక్టర్ (1594 మెగావాట్లు) నిర్మాణం పూర్తి చేసే లక్ష్యంతో ఉన్నామనీ, గుంటూరు జిల్లా నిజాంపట్నంలో ఆరు వేల మెగావాట్ల సామర్థ్యం గల ప్లాంట్‌ను, కడప జిల్లా పులివెందులలో 1400 మెగావాట్ల సామర్థ్యం గల ప్లాంట్లను కూడా నెలకొల్పబోతున్నామని అణు విద్యుత్ కమిషనర్ ఎస్.కె.జైన్ జపాన్ ప్రమాదం తర్వాతే ప్రకటించాడు.

1960లో అమెరికాకు చెందిన జనరల్ ఎలక్ట్రిక్ సంస్థ మనకు రెండు రియాక్టర్లను అమ్మింది. ఆ డిజైన్ రియాక్టర్లే నేడు జపాన్ ఫుకుషిమా ప్లాంట్‌లో ప్రమాదానికి గురయ్యాయి. వాటితోనే కొవ్వాడలో ప్లాంటు నిర్మించబోతున్నారు.

తమ అభిప్రాయాలను లెక్క చెయ్యకుండా మనదేశంలో ఫోక్రాన్ అణుపరీక్ష జరిపామని, దానికి ప్రతికారంగా అమెరికా భద్రతకు సంబంధించిన అణు సామగ్రిని అకస్మాత్తుగా నిలిపివేసిన కారణంగా జనరల్ ఎలక్ట్రిక్ సంస్థే నిర్మించిన తారాపూర్ అణు సంస్థ ఎన్నో భద్రతా సమస్యలను ఎదుర్కొంది.

జపాన్ ఫుకుషిమా ప్లాంట్‌లో అణు రియాక్టర్ల కన్నా వాడి పడేసిన ఫ్యూయల్‌రాడ్స్‌లో అత్యధిక శాతం అణు ధార్మికత విడుదలైందని రుజువైంది. అటువంటి రియాక్టర్లతోనే నిర్మింపబడిన తారాపూర్ ప్లాంట్‌లో నాలుగు దశాబ్దాల నుండి వాడేసిన ఫ్యూయల్ రాడ్స్ పేరుకుపోయి ఉన్నాయి. ఎందుకంటే వాటిని తీసుకోవాల్సిన అమెరికా, వాటిని తిరస్కరించడమే కాకుండా, మన దేశం వాటిని తిరిగి వాడడానికి అనువుగా సాగించే విధానాన్ని కూడా అంగీకరించకపోవడమే కారణం. అమెరికా అనుకూల విధానాలు కొనసాగించకపోతే ఎదురయ్యే ప్రమాదాలు పై సంఘటనలే రుజువు చేస్తున్నాయి.

జపాన్ ప్రమాదం తర్వాత ఫ్రాన్స్, నార్మండీలో నిర్మాణంలో ఉన్న ఇ.పి.ఆర్. రియాక్టర్లపై తాత్కాలిక నిలుపుదల చేయాల్సిన అవసరం ఉందనీ, ఫ్రాన్స్ అణు భద్రతా అధికార సంస్థ (ఎ.ఎస్.ఎన్.) అధ్యక్షుడు ఆండ్రేక్లాడ్ అన్నారు. ఇవే రియాక్టర్లను మహారాష్ట్ర, జయితాపూర్‌లో నిర్మించబోతున్నారు. ఖర్చు తగ్గించే నెపంతో కార్మికుల్ని తొలగించి అణు భద్రతా చర్యల్ని నిర్లక్ష్యం చేస్తున్న ఫ్రాన్స్ ప్రభుత్వంపై అణు సంస్థలో పనిచేస్తున్న ఫ్రాన్స్ కార్మికులు గత కొన్ని నెలల నుండి ఆందోళన చేస్తున్నారు.

అంతకన్నా ప్రమాదకర విషయమేమంటే రియాక్టర్లకు సంబంధించిన ఎలక్ట్రిక్ పనుల్ని నిర్వహిస్తున్న ఇ.పి.ఎఫ్. సంస్థ నుండి బయటపడిన సమాచారం ప్రకారం, ఇ.పి.ఆర్. రియాక్టర్ల మీద పనిచేస్తున్న ఇంజనీర్లు 'నాసిరకం పరికరాల్ని ఉపయోగించడం వలన ఆ రియక్టర్లు భవిష్యత్‌లో చెర్నోబిల్‌లో లాగా అతిపెద్ద ప్రమాదానికి గురై, అంటే రియాక్టర్లు పూర్తిగా ద్రవరూపంగా కరిగిపోయే ప్రమాదం ఉంద'ని అభిప్రాయపడ్డారు. అందుకే ఫ్రాన్స్ అణు భద్రతా అధికార సంస్థ ఇ.పి.ఆర్. రియాక్టర్ల నిర్మాణంలో కొత్త రక్షణా చర్యలు తీసుకోవాలని నిర్ణయం తీసుకుంది. అటువంటి ప్రమాదకారి అయిన రియాక్టర్లను మన నెత్తిన రుద్దాలని చూస్తున్నారు.

జపాన్‌లో జరిగిన ప్రమాదంపై ప్రజల్లో వస్తున్న వ్యతిరేకతను గమనించి జర్మనీ ప్రభుత్వం తమ దేశంలో ఉన్న అణు రియాక్టర్ల జీవిత కాలాన్ని పొడిగించబోమని ప్రకటించింది. స్విట్జర్లాండ్‌లో నిర్మించబోతున్న కొత్త రియాక్టర్ల ప్రతిపాదనని విరమించుకొన్నారు.

జయితాపూర్‌కు సప్లై చెయ్యబోతున్న ఫ్రెంచ్, అరెవా కంపెనీ రియాక్టర్ల (ఇ.పి.ఆర్.)తో, ఫ్రాన్స్‌లోనే ఫ్లామన్ విల్లేలో ప్లాంట్ నిర్మాణం జరిగింది. దాన్ని పరిశీలించిన ఫిన్నిష్, ఫ్రెంచ్, బ్రిటన్‌లకు చెందిన ఇంజనీర్లు మూడు వేల నాణ్యత, భద్రతా సమస్యల్ని కనుగొన్నామని తెలిపారు. సౌదీ అరేబియా అవే రియాక్టర్ల కోసం చేసుకున్న ఒప్పందాన్ని పై విషయాలు తెలిసాక రద్దు చేసుకుంది. ఆ పాటి ధైర్యం మన పాలకులు చెయ్యగలరా? జర్మనీకి చెందిన 'కామర్జ్ బాంక్' ప్రాజెక్ట్ విశ్వసనీయతపై అనుమానాలతో పాటు తమకు ఉన్న మంచి పేరు పోతుందనే కారణాలతో, జయితాపూర్ ప్రాజెక్టుకు ఆర్థిక సహకారం అందించాలని తీసుకొన్న నిర్ణయాన్ని వెనక్కు తీసుకుంది.

అణు శాస్త్రజ్ఞుడు, ప్రపంచ పర్యావరణ పరిరక్షణ సంస్థ సభ్యుడు అయిన మార్క్ చెర్నాయిక్ 'మహారాష్ట్ర జయితాపూర్‌లో నిర్మించబోతున్న అణు విద్యుత్ వలన ఆ దేశ పర్యావరణంపై పడే ప్రభావం అంచనా వేయడానికి ఏర్పడిన సంస్థ (ఇ.ఐ.ఎ.) ఇచ్చిన రిపోర్టు చాలా అసమగ్రంగా ఉందని, సమస్య లోతుల్లోకి వెళ్లకుండా పై పై విషయాల మీదే పరిశీలన జరిపార'ని విమర్శించారు.

మహారాష్ట్ర తీర ప్రాంతంలో ఉన్న జయితాపూర్ భూకంపానికి గురయ్యే జోన్ 3 నుండి జోన్ 5 లో ఉండి, ప్రమాదానికి గురయ్యే ప్రాంతంగా అధికారికంగా రికార్డయి ఉంది. గత ఇరవై సంవత్సరాలలో అక్కడ చిన్నపాటి భూకంపాలు సంభవించాయి. అందులో 1993లో వచ్చిన భూకంపం రిక్టర్ స్కేల్‌పై 6.2గా నమోదయి, దాదాపు తొమ్మిది వేల మంది చనిపోయారు. మరొక భూకంపంలో పెద్ద బ్రిడ్జి కూలిపోయింది.

గుజరాత్ తీర ప్రాంతాన అమెరికాకు చెందిన జి.ఇ. కంపెనీ రియాక్టర్లతో ఎనిమిది వేల మెగావాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేసి అణు విద్యుత్ ప్లాంట్ నిర్మించాలని నిర్ణయించారు. కాని ఆ ప్రాంతం కూడా భూకంప ప్రమాద జోన్ 3గా గుర్తించబడింది. జనవరి 2001లో వచ్చిన భూకంపంలో వేలాది మంది చనిపోయారు.

సరైన భద్రతా చర్యలు తీసుకోకపోవడం వల్లనే కర్ణాటక, కైగాలో 130 టన్నుల బరువు గల ప్లాంట్ పైకప్పు విరిగి కిందపడిపోయింది. ఆ ప్రమాదం ప్లాంట్ నిర్మాణంలో ఉన్నప్పుడు జరిగింది. అదే ఆపరేషన్ జరిగే సమయంలో జరిగి ఉంటే ఊహించలేని అతిపెద్ద ప్రమాదం జరిగి ఉండేది. ఈ మధ్యనే ప్లాంట్‌లో మంటలు చెలరేగితే వివరాలు తెలపకుండా మామూలు ప్రమాదమేనని బుకాయిస్తున్నారు.

1993లో నరోరా ప్లాంట్‌లో పెద్ద ప్రమాదం జరిగి మంటలకు గురైంది. ఆ ప్లాంట్‌కు విద్యుత్ సరఫరా అందించడానికి 17 రోజులు పట్టింది. సరైన భద్రతా చర్యలు లేకపోవడమే వీటన్నిటికీ కారణం.

సమాచార హక్కు కార్యకర్త చేతన్ కొఠారి బాబా అటామిక్ రీసెర్చ్ సెంటర్ (బి.ఎ.ఆర్.సి.) నుండి పొందిన వివరాల ప్రకారం, గత పదిహేను సంవత్సరాలలో అణుశక్తి సంస్థల్లో పనిచేస్తున్న 1930 మంది శాస్త్రజ్ఞులు, ఇతర ఉద్యోగులు చనిపోయారు. ఇందులో 197 మంది ఆత్మహత్య చేసుకొన్నారు. బి.ఎ.ఆర్.సి.లో 680 మంది చనిపోయారు. న్యూక్లియర్ పవర్ కార్పొరేషన్‌లో 346 మంది, ఎన్.ఎఫ్.సి.లో 172 మంది, యూరేనియం కార్పొరేషన్ ఆఫ్ ఇండియా (యు.సి.ఐ.ఎల్.)లో 86 మంది చనిపోయారు. కాని వీరిలో ఎంత మంది అణుధార్మికతకు గురై చనిపోయారో వివరాలు తెలపకుండా జాగ్రత్తపడ్డారు. 1972లో తారాపూర్ అణు విద్యుత్ సంస్థలో జరిగిన ప్రమాదంలో ఇద్దరు ఇంజనీర్లు మరణించారు. 1972 నాటికే ఆ సంస్థ 1300 మంది ఉద్యోగులను తొలగించింది. వారందరు అణు ధార్మికతకు గురవ్వడమే కారణం.

కల్పకంలో ఉన్న ప్లాంట్‌లో 2003లో లీకేజీ వలన ఆరుగురు కార్మికులు ప్రమాదకరమైన అణు ధార్మికతకు గురయ్యారు. 2009 నవంబర్‌లో కర్ణాటక కైగా ప్లాంట్‌లో అణు ధార్మికతకు గురైన మంచినీటిని తాగి 50 మంది ఉద్యోగులు అణు ధార్మికతకు గురయ్యారు.

మార్చ్ 1999లో మద్రాస్ అటామిక్ పవర్ సంస్థలో పరికరాలను పరీక్షిస్తుండగా ప్రమాదవశాత్తు అణు ధార్మికతతో నిండిన హెవీ వాటర్ బయటకు లీకయింది. ఈ పనిలో పాల్గొన్న 42 మంది కార్మికులు తీవ్ర అణు ధార్మికతకు గురయ్యారు. వైద్య పరీక్షలు జరిపి వారిలో ఆరుగురు కార్మికులను అణు సంస్థ పనుల నుండి తప్పించారు.

ఇలాంటి ప్రమాదాలు వేల సంఖ్యలో జరిగాయి. వాటిలో చాలా వాటిని బయట ప్రపంచానికి తెలియకుండా దాచేసారు. ప్రమాదాలు జరిగిన వెంటనే మేనేజ్‌మెంట్లు ఇది కేవలం కార్మికుల అజాగ్రత్త వల్లనే జరిగిందని ప్రకటించేసి నెపం కార్మికుల మీదే తోసేయడం సర్వ సాధారణం. ప్రమాదం మరీ పెద్దదై, దాయడానికి వీలు కానప్పుడు మాత్రమే అవి ప్రమాదకరమైనవని, అన్ని భద్రతా చర్యలు తీసుకున్నామని, భయపడాల్సింది లేదని, పనికి రాని హామీలిస్తూనే ఉన్నారు.

మన దేశంలో అణు సంస్థల్లో పనిచేస్తున్న కార్మికులు తీవ్రమైన అసంతృప్తితో ఉన్నారు. మేనేజ్‌మెంట్లు, కార్మికుల మధ్య అనేక ఘర్షణలు చోటు చేసుకొంటున్నాయి. అవి ప్రధానంగా పని ప్రదేశాల్లో సరైన భద్రతా చర్యలు తీసుకోకపోవడం గురించే. ఉదాహరణకు 1997లో మద్రాస్ ప్లాంట్‌లో అప్పటికే అణు ధార్మికత సోకిన ఐదుగురు కార్మికుల్ని ఇంకా అధిక ప్రమాదం ఉన్న చోట పని చెయ్యమంటే భయంతో నిరాకరించినందుకు వారిని మేనేజ్‌మెంట్ సస్పెండ్ చేసింది. దానిపై ప్లాంట్ కార్మికులు ఇరవై ఐదు రోజులు సమ్మె చేశారు.

ఈ అణు సంస్థల్లో రెగ్యులర్ ఉద్యోగుల కంటే కాంట్రాక్టు కార్మికులు వేలాది మంది పనిచేస్తున్నారు. వారితో ప్రమాదకరమైన పనులు చేయించడం వలన వారిలో అధిక శాతం అణు ధార్మికతకు గురవుతున్నారు. ఈ విషయాలను రుజువు చేస్తూ అనేకమంది సామాజిక స్పృహ ఉన్న రచయితలు తమ గ్రంథాలలో రికార్డు చేసి ఉన్నారు.

జపాన్ ప్రమాదం తర్వాత భద్రతా చర్యల్ని తీసుకొంటామని ఆర్భాటంగా ప్రకటిస్తున్న మన పాలకులు, అణు సంస్థల్లో జరుగుతున్న కార్యక్రమాలు, ప్రమాదాల గురించి వివరాలు ప్రజలకు తెలియకుండా ఉండేందుకు అవసరమైన చట్టపరమైన చర్యలు తీసుకున్నారు.

అవేమంటే 'ఇండియన్ అటామిక్ ఎనర్జీ చట్టం 1962' సెక్షన్ 19 (సమాచారంపై ఆంక్షలు – బహిరంగపరచడం), సెక్షన్ 24 (నేరాలు – శిక్షలు) ప్రకారం, అణు సంస్థల్లో ఎవర్నీ ప్రశ్నించే అవకాశమే లేదు. పర్యావరణ పరిరక్షణా చట్టం 1986, అణు సంస్థలకు వర్తించదు. డిపార్ట్‌మెంట్ ఆఫ్ అటామిక్ ఎనర్జీ (డి.ఎ.ఇ.)కు కేటాయించే బడ్జెట్ వివరాలు అతి రహస్యం. చివరకు పార్లమెంట్‌కు కూడా చెప్పనవసరం లేదు. ఇక అణు ధార్మికత గురించి పరీక్షలు కేవలం ప్రభుత్వ అణుశక్తి సంస్థలే చెయ్యాలి తప్ప, స్వతంత్ర సంస్థల్ని అనుమతించరు. భద్రత,

సమాచార సేకరణ – పర్యవేక్షణా బాధ్యతలు నిర్వహిస్తున్న ఎ.ఇ.ఆర్.బి. సంస్థ స్వతంత్ర సంస్థ కాదు. ప్రభుత్వ జేబు సంస్థ. ప్రభుత్వ పాలసీలకు అనుగుణంగా చెప్పే సమాచారమే దిక్కు తప్ప ప్రజలకు నిజాలు తెలిసే అవకాశాలు లేవు.

మహారాష్ట్ర జయితాపూర్‌లో ఫ్రెంచ్ 'అరెవా' కంపెనీ సరఫరా చేస్తున్న రియాక్టర్లతో ప్లాంట్ నిర్మించబోతున్నారు. ఇది ప్రపంచంలోనే అతి పెద్ద అణు విద్యుత్ సంస్థ అవుతుంది. దీనికి వ్యతిరేకంగా అక్కడ ప్రజలు బ్రహ్మాండమైన పోరాటం జరుపుతున్నారు. 'అరెవా గో బాక్, మాకీ అణు విద్యుత్తు వద్దు, అణు ధార్మికత ప్రజల్ని చంపేస్తుంది' అని వేలాది గొంతుకలతో నినదిస్తున్నారు. ఆ పోరాటాలకు 'కొంకన్ బచావో సమితి', 'కొంకన్ వినాశకారి ప్రకల్ప్ విరోధ్ సమితి', 'జనహిత సేవా సమితి'లతో కలిసి అనేక ప్రజాసంఘాలు నాయకత్వం వహిస్తున్నాయి. అరెస్టులు చేస్తున్నా పోరాటాన్ని కొనసాగిస్తున్నారు. నిషేధాజ్ఞలు ఉల్లంఘించినందుకు డెబ్బై ఏళ్ల ముంబాయి పూర్వపు హైకోర్టు జడ్జి బి.జి. కోల్సె పాటిల్‌ను అరెస్టు చేసి జైలుకు పంపారు. వివాద ప్రాంతానికి రాకుండా పూర్వపు సుప్రీంకోర్టు జడ్జి, ప్రెస్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా చైర్మన్ పి.బి. సావంత్, రిటైరైన నావల్ అడ్మిరల్ ఎల్. రామ్‌దాస్ లాంటి ప్రముఖులపై నిషేధాన్ని విధించారు. సామాన్య ప్రజలతో పాటు ఉద్యోగులు, డాక్టర్లు, లాయర్లు ఇతర వృత్తుల వారు ఐక్యంగా ఈ పోరాటంలో పాలు పంచుకుంటున్నారు.

శ్రీకాకుళం జిల్లా, రణస్థలం మండలం, కొవ్వాడలో నిర్మించ బోతున్న అణు విద్యుత్ కేంద్రానికి 16 కిలోమీటర్ల పరిధిలో 113 గ్రామాలున్నాయి. వాటిలో దాదాపు లక్ష మంది ప్రజలు జీవిస్తున్నారు. ఆ ప్రాంతంలో మంచి వ్యవసాయం ఉంది. అనేక రకాల పంటలు పండిస్తున్నారు. 12 మత్స్యకార గ్రామాలున్నాయి. ప్లాంట్ నిర్మాణ కారణంగా వీరంతా నిర్వాసితులవబోతున్నారు. జిల్లా కేంద్రమైన శ్రీకాకుళం కేవలం 24 కిలోమీటర్ల దూరంలోనే ఉంది. 1992లోనే ఈ విద్యుత్ కేంద్ర ప్రతిపాదన వచ్చింది. ప్రజల తీవ్రమైన వ్యతిరేకత వలన తాత్కాలికంగా ఆనాడు వెనక్కి తగ్గారు. నేడు ఈ ప్లాంట్‌కు వ్యతిరేకంగా ప్రజాపోరాటం సాగుతున్నది. వాళ్లకు మద్దతునిస్తూ అణు విద్యుత్ ప్లాంట్ల నిర్మాణానికి వ్యతిరేకంగా మానవ హక్కుల వేదిక, సోంపేట పర్యావరణ పరిరక్షణ సంఘం, తీరప్రాంత మత్స్యకారుల ఐక్య వేదిక, కాకరాపల్లి థర్మల్ వ్యతిరేక పోరాట కమిటీల ఆధ్వర్యంలో కొవ్వాడ చుట్టుపక్కల ఉన్న గ్రామాలలో రెండు రోజుల ప్రచార యాత్ర నిర్వహించారు.

విశాఖపట్నంలో జపాన్ ప్రమాద బాధితులకు సానుభూతి తెలుపుతూ, మన దేశంలో అణు విద్యుత్ వద్దే వద్దు అనే నినాదాలతో వివిధ ప్రజా సంఘాల ఆధ్వర్యాన నిరసన ప్రదర్శన పెద్ద ఎత్తున జరిగింది.

అణు విద్యుత్ ప్రమాద రహితమైందనే పాలకుల వాదన ఎంత మోసపూరితమైందో పై విషయాలను గమనిస్తే మనకు సులువుగా అర్థం అవుతుంది.

అణు విద్యుత్ అతి చవక అనే మరో అబద్ధాన్ని చూద్దాం. 'ఇప్పటి అణు విద్యుత్ కేంద్రాలలో తారాపూర్‌లో ఉత్పత్తి అవుతున్న విద్యుత్ ఖరీదు యూనిట్‌కు రు. 2.85, కైగాలో రు. 3.03, కూడంకళంలో రు. 3.75లు. థర్మల్ విద్యుత్ మాటకొస్తే బొగ్గుగని దగ్గరగా విద్యుత్ ఉత్పత్తి కేంద్రం నెలకొల్పితే యూనిట్ రు. 1. అదే బొగ్గు గనికి దూరంగా నిర్మిస్తే యూనిట్ రు. 1.50 అవుతుంది. గ్యాస్ ఆధారిత ప్లాంట్లలో యూనిట్ రు. 2.50 నుండి రు. 3.00లు ఉంటుంది. జల విద్యుత్ అయితే ఇంకా చాలా చవక. చాలా ప్రాజెక్టులు యూనిట్ ఒక రూపాయి లోపు ఖర్చుతో ఉత్పత్తి చేస్తున్నాయి. కేరళలోని కొన్ని జల విద్యుత్ ప్రాజెక్టుల్లో యూనిట్ 3 పైసలకు ఉత్పత్తి అవుతోంది' అంటూ బాలగోపాల్ అణు శక్తి ఒప్పందం మీద రాసిన వ్యాసం ద్వారా ప్రభుత్వం చెప్పే అబద్ధాన్ని నిరూపించి ఉన్నారు.

అణు విద్యుత్ తప్ప వేరే మార్గం లేదనే ప్రభుత్వ వాదన కూడా పూర్తిగా నిరాధారమైనది. ఎందుకంటే ప్రజల ప్రాణాలతో చెలగాటమాడే అణుశక్తికి బదులు అనేక ప్రత్యామ్నాయ మార్గాల గురించి దేశంలో అనేక మంది మేధావులు, సామాజిక కార్యకర్తలు చెప్పినా ప్రభుత్వం ఏనాడూ వాటిని ఖాతరు చెయ్యలేదు.

మనసుంటే మార్గముంటుందడానికి ఉదాహరణగా ఈ మధ్య చైనాలో 13.2 హెక్టార్లలో చెత్త నుండి విద్యుత్ ఉత్పత్తి చేసే ప్లాంట్‌ను టియాంజిన్ ఎలక్ట్రిక్ పవర్ కార్పొరేషన్ నిర్మిస్తోంది. రోజుకు 2 వేల టన్నుల చెత్తను ప్రాసెసింగ్ చేస్తారు. నిర్మాణం పూర్తి అయిన వెంటనే ప్లాంట్ సంవత్సరానికి 6,67,000 టన్నుల చెత్తను ఉపయోగించి 14.6 కోట్ల కిలోవాట్ల (1.46 లక్షల మెగావాట్ల) విద్యుత్ ఉత్పత్తి చేస్తారు. ఇంకొక విశేషమేమంటే చైనావాళ్లు విద్యుత్ కోసం ఈ పని చేయలేదు. ఆ దేశంలో పెరిగిపోతున్న చెత్త సమస్యను పరిష్కరించుకోవడంలో సమతమవుతూ చివరకు ఈ పరిష్కారాన్ని కనుగొన్నారు.

హిరోషిమా, నాగసాకీల విధ్వంసంలో ఒక అంచనా ప్రకారం నేటి వరకు మూడు లక్షల మంది, రష్యా చెర్నోబిల్ అణు ప్రమాదంలో తొమ్మిది లక్షల మంది, వారిలో ఎక్కువ మంది క్యాన్సర్‌తో చనిపోయారు. జపాన్ అణు ప్రమాదం చెర్నోబిల్ అణు ప్రమాదం స్థాయి కంటే నెం. 7కు చేరిందని జపాన్ వారే ప్రకటించారు. ఈ ప్రమాదాలతో ప్రపంచ ప్రజలంతా వణికిపోతుంటే మన ప్రధాని ఏప్రిల్ 16న 'ఎట్టి పరిస్థితిలోను అణు విద్యుత్ ఆపేది లేదని' చెప్పడం పిల్లికి చెలగాటం – ఎలకకు ప్రాణ సంకటం అన్న చందాన ఉంది.

భూకంపాలు వచ్చే ప్రాంతాల్లో ప్లాంట్‌లు నిర్మించవద్దనీ, ప్రజల ప్రాణాలు తీసే అణు విద్యుత్ మాకు వద్దనీ ప్రజలు డిమాండ్ చేస్తున్నా సామ్రాజ్యవాద శక్తుల, మల్టీ నేషనల్ కంపెనీల సేవకులుగా భారత పాలకులు ప్రజలపై తీవ్రమైన మారణకాండకు సిద్ధమవుతున్నారు. అత్యంత ఆధునిక టెక్నాలజీలో నిపుణులుగా పేరుగాంచిన జపాన్, తమ దేశంలో అణు ప్రమాదాన్ని నివారించడంలో ఎలా సతమతమవు తుందో మనం చూస్తున్నాం. ఇక మనకు తెలియని టెక్నాలజీతో ఇప్పటికే ప్రమాదకరమైనవిగా గుర్తింపబడిన విదేశీ రియాక్టర్లను మన నెత్తిన రుద్ది, మనల్ని సమూలంగా నాశనం చెయ్యడానికి కంకణం కట్టుకున్న మన పాలకుల దుర్మార్గాన్ని ప్రజాపోరాటాల ద్వారానే ఓడించగలం.

సామ్రాజ్యవాద వ్యతిరేక చైతన్యంతో, సింగూర్, నందిగ్రామ్, పోస్కో, నియంగిరి, సోంపేట, కాకరాపల్లి ప్రజల పోరాటాల స్ఫూర్తితో కొవ్వాడ, జయితాపూర్ ఇంకా ఇతర ప్రాంతాల్లో జరుగుతున్న అణు విద్యుత్ వ్యతిరేక ప్రజా ఉద్యమానికి అందరూ అండగా నిలవాలి. అణుశక్తి ఎంత ప్రమాదకరమైందో, దేశ ప్రజలకు వివరించి, చైతన్యాన్ని పెంచే కార్యక్రమాల్లో అందరూ భాగస్వాములు కావాలి.

*(రచయిత ట్రేడ్ యూనియన్ నాయకులు)* వీ

రక్తం చిందించిన ముప్పై ఏళ్ల ఇంద్రవెల్లికి ముందూ వెనకా ఆదివాసుల ఆరాట పోరాటాలను వివరిస్తున్నారు

**బి. వేణుగోపాల్ రెడ్డి**

# ఆదివాసుల రగల్ జెండా పోరాటం

ఆదిలాబాద్ ప్రధానంగా ఆదివాసుల ప్రాంతం. గోండులు రాజ్యాలను నిజర్మించుకొని పరిపాలన కొనసాగించారు. 1592 తర్వాత మొఘలుల ధాటికి తట్టుకోలేక గోండు రాజ్యాలు పతనమైనాయి. చాందా రాజు మొఘల్ రాజులకు విధేయుడైనాడు. కొన్ని ముఖ్యమైన గోండు కుటుంబాలకు సంబంధించిన రాజులు భూస్వాములుగా స్థిరపడినారు. వీరిని 'ముఖాషిలుగా' పిలిచేవారు. వీరి ఆధీనంలో కొన్ని ఊర్లు ఉండేవి. వీరి ఇనామ్ భూములు (మఖ్తాలు) సాగుచేసుకునే రైతుల నుండి రెవెన్యూ వసూలు చేసి రాజుకు చెల్లించేవారు. సాంస్కృతికంగా, న్యాయన్యాయ విషయాల్లో ముఖాషిలు ముఖ్యమైన పాత్ర పోషించేవారు. గోండులకు, ఈ వ్యవస్థ వల్ల ప్రత్యేకంగా ఇబ్బందేమి కలగలేదు. ఎప్పుడైతే 1803లో ఆదిలాబాద్ నిజాం రాజు ఏలుబడిలోకి పోయిందో ఆదిలాబాద్ ఆదివాసుల మనుగడ ప్రశ్నార్థకంగా మారింది. అనివార్యంగా బ్రిటిష్ చట్టాలు హైదరాబాద్ స్టేట్‌లో అమలైనాయి. భారత దేశమంతటా బ్రిటిష్ పరిపాలకులకు వ్యతిరేకంగా తిరుగుబాట్లు జరిగాయి. మొదట సిపాయిల తిరుగుబాటులో భాగంగా హైదరాబాద్ స్టేట్‌లో గోండు వీరుడు రాంజీ గోండు రోహిల్లాలకు నాయకత్వం వహించి, నిజాం రాజుపై తిరుగుబాటు చేశాడు. 1860లో రాంజీ గోండు అమరుడైనాడు. వివిధ సామ్రాజ్యాల కింద గోండులు నలిగి పోయారు. హైదరాబాద్ రాజ్య రెవెన్యూ మంత్రి సాలార్‌జంగ్ భూ యాజమాన్యాలకు సంబంధించిన చట్టాలను కఠినంగా అమలు పర్చాడు. స్థానిక గోండు రాజులు, ముఖాషిలకున్న అధికారాలన్ని హిందూ ఫ్యూడల్ భూస్వాములైన దేశ్‌ముఖ్, దేశ్‌పాండేలైన గిరిజనేతరుల చేతుల్లోకి వెళ్లిపోయాయి. ఈ వతన్‌దారుల వలసతో గోండుల రాజకీయ వ్యవస్థ, ఆర్థిక వ్యవస్థలు చిన్నాభిన్నమైనాయి. గోండు భూస్వాముల ఇనామ్ భూములన్నీ ఈ వతన్‌దారుల ఖాతాలలోకి వెళ్లాయి. గోండులు ఫ్యూడల్ వ్యవస్థ చట్రంలోకి వెళ్లిపోయారు. ఈ భూస్వాములు పటేల్, పట్వారీ యంత్రాగాన్ని ఉపయోగించుకొని భూముల రికార్డ్‌ను తారుమారు చేసి వేల ఎకరాల భూములను ఆక్రమించుకున్నారు. కరీంనగర్ నుంచి వచ్చిన దొరలు, భూస్వాములు చవకగా ఆదివాసి భూములను తమ పేరిట చేసుకున్నారు. ఆదివాసులు తమ భూముల నుండి బేదఖలైనారు. ఆదివాసులకు సంబంధంలేని అభివృద్ధి నమూన ఆదిలాబాద్ ప్రాంతంలో ఆరంభమైంది. రైల్వేలైన్లు, రోడ్లు వేయడంతో గిరిజనేతరుల వలస కొనసాగింది. సింగరేణి బొగ్గు గనులు, సిర్పూరు పేపర్ మిల్లు ఆదివాసి ప్రాంతంలో పెట్టడంతో గిరిజనేతరులు ఈ అభివృద్ధిని సులభంగా ఉపయోగించుకున్నారు. పేపరు తయారీకి అవసరమైన ముడి సరుకుకు ఆదిలాబాద్ అడవిని యథేచ్ఛగా నరికారు.

ఆదివాసులు సాధారణంగా పోడు పద్ధతిలో వ్యవసాయం చేస్తారు. రెండు మూడు పంటలు తీసుకున్న తరువాత వేరే భూమిలోకి వెళ్లి సాగుచేస్తారు. అట్లా మొదటి భూమిలోకి పంట సాగుచేయడానికి వెళితే మైదాన ప్రాంత వ్యక్తులు ఆ భూములను ఆక్రమించేవారు. అంతే కాకుండా అక్రమ పద్ధతిలో పట్టాహక్కులు పొందేవారు. అట్లా ఆదివాసులు నిస్సహాయ స్థితిలో తమ భూమిపై హక్కులు కోల్పోయి దిక్కుతోచని పరిస్థితిలో ఇంకా దట్టమైన అడవులలోకి వెళ్లవలసి వచ్చింది. పన్నులు కట్టినా పట్టా అయ్యేది కాదు. వడ్డీ వ్యాపారులు, భూ కబ్జాదారులు మైదాన ప్రాంతం నుంచి వచ్చి అక్రమ పద్ధతులలో భూములను ఆక్రమించి ఆదివాసులను తమ స్వంత భూముల నుండి వెళ్లగొట్టారు. ప్రభుత్వానికి ఈ విషయాలు పట్టేవి కావు. భూముల నుండి వచ్చే పన్నులు కావాలి. ఆ భూములు ఎవరు దున్నుకుంటే వారికేంటి? ఎవరు ఆకలితో మాడిసస్తే వారికేంది?

నిజాం సాగుదారులను ప్రోత్సహించడం వల్ల వేలల్లో సాగుదారులు నాందేడ్, పర్భనీల నుండి మరాఠాలు, బేరార్ నుండి బంజారాలు, మధ్య భారతం నుండి మహార్‌లు, కుంభీలు. బ్రాహ్మణ, కోమటి, వెలమ, రెడ్డి సమాజాలు కరీంనగర్ నుండి అధికంగా వలసలు ప్రారంభమైనాయి. అటవీ చట్టాల అమలుతో ఆదివాసీలు నిలువ నీడలేని దయనీయ స్థితిలోకి నెట్టబడ్డారు. లోతట్టు అటవీ ప్రాంతంలోకి తరమబడ్డ ఆదివాసులు తమ మనుగడకై మళ్లీ చెట్లు కొట్టుకొని వ్యవసాయం చేసే క్రమంలో జంగ్లాతు అధికారులు పన్నుల పేరుతో హింసించడం మొదలు పెట్టారు. పొట్టకచ్చిన పంటను తగులబెట్టారు. కోళ్లు, మేకలు ఎత్తుకు పోయారు. ఇట్లా ధ్వంసమైన ఆదివాసి బతుకులలో కొమురం భీం కుటుంబమొకటి. భీం ఈ పరిస్థితులను గ్రహించి పోరాటమే శరణ్య మార్గమని భావిస్తాడు. సహచరుల సూచన మేరకు తప్పని పరిస్థితిలో పోరాట బావుటాను ఎగరవేశాడు. వాస్తవానికి ఆదివాసులు ఒక రాజ్య భావనలో ఇమడలేకపోయారు. తరతరాలుగా అడివిని నమ్ముకొని జీవించిన వారికి హద్దులు గీసే ప్రయత్నం ఎవరుచేయలేదు. జంగల్‌కా రాజాలాగా వారు బతికారు. ఈ భీతావహ పరిస్థితిని చూసి వారు భయపడ్డారు. భీం పన్నెండు ఊర్ల పై రాజ్యాధికారం కోసం పోరాటం ప్రారంభించాడు. తీవ్ర ప్రతిఘటనలనంతరం భీం జోడెన్ ఘాట్ దట్టమైన అడవులలో యుద్ధ భూమిలో అమరుడవుతాడు (1940). దాదాపు పన్నెండు మంది గోండు వీరులు అమరులైనారు.

కొమురం భీం మరణానంతరం నిజాం సర్కారు కొన్ని సంస్కరణలను ప్రారంభించింది. ప్రఖ్యాత మానవ పరిణామ శాస్త్రవేత్త

హెమన్ డార్ఫ్‌ను గిరిజన స్థితుగతుల అధ్యయనానికి ప్రత్యేకంగా నియమించింది. 1946లో ఆదివాసి నివాస ప్రాంతాలను షెడ్యూల్డ్ ప్రాంతాలుగా గుర్తించారు.

దస్తూర్-ఉల్-అమల్, 1354 ఫస్లీ ప్రకారం గిరిజన భూపరి పాలనకు సంబంధించి ప్రత్యేక అధికారిని నియమించడమే కాకుండా ప్రత్యేక చట్టాలను తయారు చేసింది. గిరిజన విద్య, ఆరోగ్య విషయాల పై కూడ ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నారు. హెమన్ డార్ఫ్ పదివేల గిరిజన కుటుంబాలకు లక్షా అరవైవేల ఎకారల భూములను పంచిపెట్టాడు. అంతేకాకుండా గిరిజన సామాజిక స్థితిలో మార్పు రావాలంటే విద్యతోనే సాధ్యమవుతుందని నమ్మి ఆదివాసి ప్రాంతాలలో ముప్పై సర్కారు బడులను ప్రారంభించడమే కాకుండా వారి భాషలోనే బోధన చేయడానికి ఉపాధ్యాయ శిక్షణ సంస్థలను ఏర్పాటు చేసాడు. హెమన్ డార్ఫ్ 1949 సంవత్సరం వరకు ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నాడు.

ఈ సంస్కరణలు కొంత కాలమే పనిచేశాయి. నిజాం ప్రభుత్వం భారత యూనియన్‌లో విలీనమైన తారువాత రాజకీయ నాయకుల అండతో ఫారెస్టు కంట్రాక్టరులు, ప్రభుత్వ ఉద్యోగులు ఇష్టారాజ్యంగా ప్రవర్తించారు. తమ స్వంత ప్రయోజనాలను నెరవేర్చుకునే ప్రయత్నం చేసారు తప్ప ఆదివాసి సమస్యలను పట్టించుకోలేదు.

1956 తరువాత హైదరాబాద్ స్టేట్ భాషా ప్రాతిపదిక రాష్ట్రాల పేరిట ఆంధ్రలో విలీనం కావడంతో అప్పటి వరకు అమలవుతున్న ఆ కాస్త చట్టాలు అమలైన దాఖలాలు లేవు. షెడ్యూల్ ప్రాంత చట్టాలను మార్పు చేశారు. గిరిజన భూయాజమాన్య హక్కులను అమలు పర్చలేదు. దానిని 1963 భూ మార్పిడి చట్టంగా మార్చారు. అప్పటివరకు పట్టాలను పొందిన ఆదివాసులు తమ భూములు కోల్పోయే పరిస్థితి ఏర్పడింది. లంబాడ, మరాఠాలు అధికంగా ఈ భూములను కొల్లగొట్టారు. 1950 అటవీ రక్షణ చట్టం అమలు పేరుతో పోడును పూర్తిగా నిషేధించారు. దీనితో ఆదివాసులు ఇంకా దట్టమైన అడవులలోకి వెళ్లవలసి వచ్చింది. విస్తారమైన రోడ్లు వచ్చాయి. ఉట్నూరు నుండి ఆసిఫాబాద్, గుడిహత్నూర్ నుండి ఉట్నూర్ రోడ్డు, మంచిర్యాల నుండి ఉట్నూర్ రోడ్లు పడడంతో ఆదివాసుల సాంస్కృతిక దోపిడికి మార్గాలు పడినట్లయింది. గిరిజనేతరుల వలస సులువుగా జరగడానికి వీలు కలిగింది. వ్యాపార కులాలైన మరాఠ, హత్కర్, మర్వాడి, ముస్లిం, సావుకార్లు ఉట్నూర్, ఇంద్రవెల్లి, జైనూర్‌లలో స్థిరపడ్డారు, ఆదివాసి ఆర్థిక వ్యవస్థలోకి ఈ వ్యాపార శక్తులు ప్రవేశించాయి. ఆదివాసి అంగళ్లలో ఈ వ్యాపారస్తులు కూర్చొని వారు తెచ్చిన వస్తువులకు పదింతలు సంపాదించారు. ఆదివాసి సమాజం స్వయం సమృద్ధిగా బతికేది. ఒక ఉప్పు తప్ప వారు ఏమీ కొనరు. దీంతో వ్యాపారులకు అవకాశం దొరికినట్లయింది. ఆదివాసులు సాగు చేసే పత్తి, జొన్న, తొగ్గరి పంటలను తక్కువ ధరకు తీసుకొని తమ వస్తువులను ఎక్కువ ధరకు అమ్మేవారు లేదా వస్తు మార్పిడి పద్ధతి ద్వారా ఆదివాసీల నుండి ఎక్కువ పరిమాణంలో వస్తువులను స్వీకరించేవారు. కొలతలకు సంబంధించిన విషయంలో చాలా మోసాలు జరిగేవి. ఉదాహరణకు పది కిలోల పత్తిని ఒక ఆదివాసి వ్యాపారికి అమ్మాడనుకుంటే దానిని ఐదు కిలోల పరిమాణంలో తూకం వేస్తాడు. అంతే కాకుండా రేటు విషయంలో మార్కెట్ రేటులో సగం కంటే తక్కువ చెల్లిస్తాడు. ఇట్లా ఆదివాసుల్ని సులువుగా మోసం చేసే వ్యాపారులు గిరిజన ప్రాంతాలలో కోట్లకు పడగలెత్తారు. ఇట్లా ఆదివాసుల్ని సరకులకు ఎరచూపి అప్పుల పాల్జేసి బాకీ కింద బంగారం, గొర్లు, మేకల్ని పట్టుకునేవారు. కొన్ని సందర్భాల్లో భూముల్ని కూడ ఆక్రమించేవారు. వాటిని సంవత్సరం సంవత్సరం వడ్డీ కింద జమ చేసుకునేవారు. ఇట్లా గోండుల ఆర్థిక వ్యవస్థ చిన్నాభిన్నమైంది. భవిష్యత్తు అంధకారమైంది.

షావుకార్లు, ముస్లీంలు, లంబాడీలు అడివిని యథేచ్ఛగా నరికి భూముల్ని సాగు చేసుకుంటున్నారు. షెడ్యూల్ ప్రాంత చట్టాల ప్రకారం ఆదివాసీలకు సంబంధించిన భూముల్ని ఎవరు కొనరాదు, అమ్మరాదు. కాని ఈ నిబంధనలకు వ్యతిరేకంగా గిరిజనేతరులు అతి తక్కువ ధరలకు భూములను చేజిక్కించుకున్నారు. 1977లో ప్రభుత్వం లంబాడీలను గిరిజనులుగా గుర్తించడంతో నిజమైన ఆదివాసులకు ముప్పు ఏర్పడింది. యథేచ్ఛగా భూముల్ని ఆక్రమించుకున్నారు. అంతే కాకుండా మహారాష్ట్ర ప్రాంతం నుండి పెద్ద వలస ప్రారంభమైంది. ఆదివాసులు దుర్భర దారిద్ర్యంలో జీవిస్తుంటే లంబాడాలను గిరిజనులుగా గుర్తించి రిజర్వేషన్లు అమలు పర్చింది. ఇప్పటికీ లంబాడాలు ఆదివాసీల కంటే కూడ అభివృద్ధి ఫలాలను అందుకోవడంలో ముందున్నారు. మైదాన ప్రాంత వాసుల సుఖ జీవనానికి కలప విలాస వస్తువు అయింది. వాస్తవానికి ఆదివాసులు పోడు వ్యవసాయం చేసుకుంటే అడవి తరగలేదు ఆధునిక మానవుడి లాలస వల్లనే తరిగింది. టేకు లాంటి విలువైన వృక్ష సంపద అంతరించిపోయే దశకు చేరుకుంది. కాని ఒక ఆదివాసి తన అవసరానికి అడివిని ఉపయోగించుకుంటే కేసులు, అరెస్టులు. మేకలు మేపితే పన్ను, కొమ్మ కొడితే పన్ను. జంగ్లాత్ షేరేదార్, అమీన్‌ల వేధింపులకు హద్దు లేకుండా పోయింది.

ఆదివాసి సమస్యల పట్ల ప్రత్యేక దృక్పథం ఉన్న సి.పి.ఐ. (ఎం.ఎల్) పీపుల్స్ పార్టీ ఆదిలాబాద్ ఆదివాసుల సమస్యలను ప్రధాన భూమికగా చేసుకొని పోరాటం నడిపింది. ఇది ఇంకా దండకారణ్యాలకు తన ఉద్యమ జెండాను విస్తరించడానికుపయోగపడింది. నక్సలైట్లు ఆదివాసీల జీవనాన్ని అవగతం చేసుకున్నారు. వారి భాషను నేర్చుకున్నారు. వారిభాషలోనే పాటల్ని అల్లి పాడేవారు. వారి సాంస్కృతిక వాయిద్యం 'తుడుం'ను పోరాట వాయిద్యంగా మలచుకున్నారు. తుడుం మోగితే ఒక దగ్గర సమావేశమై భవిష్యత్ కార్యాచరణ చేయడమేనన్న సంకేతమిచ్చారు.

ఇంద్రవెల్లి ఆదిలాబాద్ జిల్లా కేంద్రానికి 40 కి.మీ దూరంలో ఉంది. ఇది గోండు గిరిజనులకు సంబంధించిన ప్రాంతం. వారి దేవత ఇంద్రాయి మాత పేరు మీద గ్రామం ఏర్పడింది. ఇపుడు ఇక్కడ అసలైన ఆదివాసుల జనాభా చాలా తక్కువ. అంతా బయట నుండి వచ్చిన గిరిజనేతరుల జనాభానే అధికం. చిన్న సైజు పట్టణంలా ఒక వ్యాపార కేంద్రంగా మారిపోయింది. ఎందరో వడ్డీ వ్యాపారులు వచ్చి స్థిరపడ్డారు. ఇంద్రవెల్లికి కొద్ది దూరంలోనే చాలా పల్లెల ఆవాసాలున్నాయి. గోండుల ఆర్థిక వ్యవస్థలోకి వడ్డీ వ్యాపారులు ప్రవేశించారు. వారి సంతల్లోకి చొచ్చుక వచ్చారు. గిరిజనుల దోపిడి యథచ్ఛగా కొనసాగింది.

1980 తర్వాత నక్సలైటు ఉద్యమం తన కార్యాకలాపాలను విస్తృతపర్చింది. వివిధ సంఘాలను ఏర్పర్చింది. దానిలో భాగంగానే గిరిజన రైతు కూలీ సంఘాన్ని ఏర్పర్చింది. నిర్మాణాత్మక కార్యక్రమాలను ఎన్నో చేపట్టింది. కూలీ రేట్లు, తునికాకు రేట్లు, ఇంకా ఎన్నో సమస్యలను పరిష్కరించింది. తొడసం కట్టి ఆదివాసి నాయకుడు సంఘ నిర్మాణాన్ని

చేపట్టాడు. కట్టి చదువుకున్న వ్యక్తి కావడంతో ఉద్యమ నిర్మాణానికి తోడ్పడ్డాడు. తన మిత్ర బృందంతో కలసి ఆదివాసి పల్లెలన్ని తిరిగి వారిని చైతన్య పర్చేవాడు. వడ్డీ వ్యాపారులు ఎట్లా మోసం చేస్తున్నారు, వారు మన డబ్బుతో ధనవంతులైన వైనం వివరించి చెప్పేవాడు. ప్రభుత్వం వైఖరిని ఎండగట్టేవాడు. చాలా మంది ఆదివాసులు గిరిజన రైతు కూలి సంఘాలలో పని చేయనారంభించారు. సంఘం ఆధ్వర్యంలో ఒక మొదటి మహాసభను జరుపుకోవాలని నిర్ణయం తీసకున్నారు. 1981 ఏప్రిల్, 20 సమావేశ తేది నిర్ణయించారు. ఊరూర, పల్లె పల్లె కరపత్రాలు పంపిణీ చేశారు. కరపత్రంలో గిరిజనేతరులు, అటవీ అధికారులు తమ భూములను ఆక్రమించారు. ఆ భూములు తిరిగి తమకు అప్పచెప్పాలని, పంటలను పండించుకోడానికి పరిస్థితులు కల్పించాలని, అటవీ హక్కులు కల్పించాలని, గిరిజన భూయాజమాన్య చట్టం 1964 అమలు పర్చాలని స్పష్టంగా పేర్కొన్నారు. కినుక హనుమంతరావు మొదటి మహాసభ అధ్యక్షుడు, తొడసం కట్టి, రాజేశ్వర్, దేవరావ్, మడావి రాజు మొదలగు వారు సభ్యులు. ప్రభుత్వం మొదట అనుమతి ఇచ్చింది. చివరి నిమిషంలో తన నిర్ణయాన్ని మార్చుకుంది. ప్రభుత్వం గిరిజన చైతన్యాన్ని అదిమి పట్టాలని నిర్ణయించింది.

ఇంద్రవెల్లి మండలం దగ్గరి గ్రామాల ప్రజలు సమావేశానికి యుద్ధ దండులా బయలు దేరారు. సంప్రదాయ ఆయుధాలతో, ఒక చేత ఎర్రజెండాతో, పాటలు పాడుకుంటూ, తుడుం మోగిస్తూ సమావేశానికి బయలుదేరారు. ఆ రోజు వారంతపు సంత, వేల సంఖ్యలో ఆదివాసులు సమావేశపు స్థలానికి చేరుకున్నారు. తుడుం మోతతో ఆ పరిసర ప్రాంతం మారుమ్రోగింది. జిల్లా ఎస్.పి. ఎం.వి. కృష్ణారావుతో సహా ఐదు వందల మంది పోలీసు బలగాలు గిరిజనులను చుట్టుముట్టాయి. గిరిజనులను అదుపుచేయడానికి పోలీసులకు సాధ్యం కాలేదు. సాయుధ బలగాలు గిరిజనులను చుట్టుముట్టి చెట్లపైకెక్కి కాల్పులు జరిపారు. కనీస మానవత్వం లేకుండా ఆదివాసుల్ని పుట్టకొకరు, చెట్టుకొకరు చొప్పున కాల్చి చంపారు. పరుగెత్తుకుంటూ దార్లో, వాగుల్లో, లోయల్లో ఎంతో మంది ప్రాణాల్ని వదిలారు. గాయాల పాలైన వారి లెక్కలేదు. ప్రభుత్వ ఎక్స్ ఆఫిసియో ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ (ఆర్.డి.ఒ) కాల్పులకు అనుమతి ఇవ్వాలి కాని అలాంటిది జరుగలేదు. పోలీసు ఉన్నత అధికారులే కాల్పులకు అనుమతి ఇచ్చి ఎంతో మందిని పొట్టన పెట్టుకున్నారు. దాదాపు 25,000ల మంది గిరిజనులు ఈ పోరాటంలో పాల్గొన్నారు. అంతేకాకుండా వేల సంఖ్యలో ఇంద్రవెల్లి సమావేశానికి వస్తున్న ఆదివాసులను గుడిహత్నూర్ రోడ్డు వైపు నుండి, ఊట్నూరు రోడ్డు వైపు నుండి ఇంద్రవెల్లికి రాకుండా కాపలాకాశారు. ప్రభుత్వం కేవలం 13 మంది మాత్రమే చనిపోయారని తన తప్పుడు నివేదికల్ని ఇచ్చింది. ప్రత్యక్ష సాక్షుల కథనం ప్రకారం దాదాపు 70 మంది ఆదివాసి ప్రజలు కాల్పుల్లో మరణించారు. పిట్టబొంగరం గ్రామానికి సంబంధించిన చాలా మంది గిరిజనులు ఈ సంఘటనలో పాల్గొని అమరు లైనారు. వడగాం, పాండుగూడ గ్రామలకు సంబంధించిన గిరిజనులు కూడ చనిపోయారు. భారత దేశంలో ఇంద్రవెల్లి సంఘటన చరిత్ర సృష్టించింది. మొదటిసారి సాయుధులైన పోలీసు బలగాలను తరిమికొట్టి చరిత్ర సృష్టించారు. ఈశ్రూబాయి సాయుధ పోలీసు కానిస్టేబుల్‌ను చంపి తన విప్లవ పంథాను చాటింది. పార్టీ ఆదివాసి రక్త తర్పణానికి నిదర్శనంగా అమరుల దినోత్సవాన్ని ప్రతి ఏటా ఏప్రిల్ 20న జరుపుతోంది.

ఇంద్రవెల్లి కాల్పులు జరిగిన ప్రాంతంలో పార్టీ స్మారక స్థూపాన్ని నెలకొల్పింది. కినుక హన్మంత్‌రావు తన స్థలాన్ని పార్టీకి అమ్మి పట్టా చేయించి ఇచ్చాడు. ఆ స్థలంలోనే నేడు మనకు కనిపిస్తున్న స్థూపం ఇంద్రవెల్లి స్థూపం. మొదటి స్మారక సమావేశాన్ని ప్రభుత్వం నిషేధించడం వల్ల రెండవ అమరుల స్మారక దినోత్సవాన్ని 1983 ఏప్రిల్ 20న జరుపుకున్నారు. స్థూపావిష్కరణ గద్దర్ చేశారు.

ఇంద్రవెల్లి స్థూపాన్ని దగ్గరుండి నిర్మాణం గావించిన వ్యక్తి ఆంధ్రప్రదేశ్ రైతు కూలీ సంఘం అధ్యక్షులైన గంజి రామారావు (రైతు కూలి సంఘం 1981 నెల్లూరులో ఏర్పడింది). వ్యయ ప్రయాసలకోర్చి, అరెస్టులు, కేసులు భరించి రెండు సంవత్సరాలు ఇంద్రవెల్లిలోనే ఉండి భారతదేశంలో ఎక్కడా లేని విధంగా చైనా 'టిన్‌మెన్ స్క్వేర్' రూపంలో స్థూపాన్ని నిర్మించి, ప్రజలకు బహూకరించిన గొప్ప త్యాగశీలి గంజి రామారావు. స్థూపం 20 అడుగుల ఎత్తులో, పైన సుత్తి కొడవలితో, కింద విశాలమైన స్టేజి, మెట్లతో అద్భుత నిర్మాణం గావించారు.

ఇంద్రవెల్లి నుండి ఉట్నూర్ వెళ్లె దారిలోని స్థూపం ఆదివాసి పోరాటాన్ని మనకు గుర్తుకు తెస్తుంది. వివిధ పోరాటాలకు వాహికగా ఉన్నది. దేశంలో జరుగుతున్న ఆదివాసి పోరాటాలను చిత్రికపడుతున్నది. ఎందరో ఆదివాసి అమరుల త్యాగాలను గుర్తుకు తెస్తున్నది. గిరిజన రైతు కూలీ మృతవీరులకు విప్లవ జోహార్లు అర్పించింది. 'ప్రజా వీరులు మృత్యుంజయులు, ఆ కొండలు ఎరుపు, పూలు ఎరుపు, వారి మరణం ఎరుపు, మన శ్రద్ధాంజలి ఎరుపు'. అంటూ ప్రజల పోరాటాన్ని పీపుల్స్‌వార్ పార్టీ ఈ విధంగా గౌరవిస్తే దోపిడి, పీడకులు ఆ ఆనవాళ్లను తుదముట్టించే ప్రయత్నాలు చేసారు. ఇంద్రవెల్లి స్మారక స్థూపాన్ని చెరిపివేసే ప్రయత్నంలో భాగంగా 1985లో డైనమైట్లతో పేల్చివేశారు. పోలీసులు తమకు సంబంధం లేదని కొట్టిపారేసినా ఆదివాసులు, ప్రజల తీవ్ర ప్రతిఘటనలనంతరం ఐ.టి.డి.ఏ ప్రభుత్వ నిధులతో పునర్నిర్మించింది. వివిధ వివాదాలకు కారణభూతుడైన అప్పటి జిల్లా పోలీసు అధికారి వివేక్ దూబే స్థూపానికి తెల్లరంగు వేయించాడు. విప్లవోద్యమాన్ని ప్రపంచంలో ఎక్కడ ఇట్లా తెల్లరంగు వేసి అవమాన పర్చిన దాఖలా లేదు. పోరాట సంకేతమైన ఎరుపును తట్టుకోలేకపోవడం కావచ్చు. సుబ్బారావు పాణిగ్రాహి తన పాటలో అన్నట్లు 'ఎరుపంటే కొందరికి భయం భయం పసి పిల్లలు వారికంటే నయం నయం' - బహుశా భయమే ఈ పని చేయించి ఉండవచ్చు. అనేక రకాలుగా ఇంద్రవెల్లి ఆదివాసుల పోరాటాన్ని చెరిపివేసే ప్రయత్నాలు పాలకులు చేశారు. అంతేవేగంతో మళ్లీ ఆదివాసుల పోరాటాలు ఆదిలాబాద్‌లో ప్రారంభమైనాయి. ఇంద్రవెల్లి తరవాత అనేక సంఘటనలు జరిగాయి. ఇలా నిరంతరం ఒక ఘర్షణ వాతావరణం ఆదిలాబాద్‌లో నెలకొని ఉంది.

నేడు ఆదిలాబాద్ ఆదివాసులు మౌనం వీడారు. వారికి జరుగుతున్న అణచివేతను ప్రశ్నిస్తున్నారు. తెలంగాణ అస్తిత్వ ఉద్యమంలో భాగంగా ఆదివాసులు రాబోయే తెలంగాణలో 1/70 చట్టాన్ని అమలు పర్చాలని చెపుతున్నారు. జల్, జంగల్, జమీన్‌లపై పూర్తి అధికారాన్ని అడుగుతున్నారు. లంబాడాలను ఎస్.టి.రిజర్వేషన్ నుండి తొలగించాలని కోరుతున్నారు. అన్ని వసతులను అనుభవిస్తున్న లంబాడాలు ఇతర రాష్ట్రాలలో షెడ్యూల్ తెగలు కారు. కావున మా జీవన విధానానికి ఆటంకమవుతున్నారని, వారిని యస్.టి జాబితా నుండి తొలగించాలని ఆదివాసులు పోరాడుతున్నారు.

*(రచయిత సామాజిక శాస్త్ర పరిశోధక విద్యార్థి)* వీ

*రాజకీయ నాయకులు, భూస్వామ్య శక్తుల నుంచి పోలీసు అధికారుల దాకా ఎస్.సి., ఎస్.టి. అత్యాచార నిరోధక చట్టాన్ని ఏ విధంగా నీరుగారుస్తున్నారో వివరిస్తున్నారు* **చిమ్మె జాన్ బర్నబాస్**

# ఎస్.సి., ఎస్.టి. అత్యాచార నిరోధక చట్టం

**11** సెప్టెంబర్ 1989న పార్లమెంట్‌లో ఆమోదం పొందిన 'ఎస్.సి. / ఎస్.టి. అత్యాచార నిరోధక చట్టం 1989', భారతదేశంలో 1990 నుంచి అమలులోనికి వచ్చింది. అనగా ఇప్పటికి దాదాపు ఇరవై ఒక సంవత్సరాలు పూర్తి అయింది. బాధితులు కేవలం ఎస్.సి. / ఎస్.టి. లు మాత్రమే కావడం చేత, సమాజంలో వారు తరతరాల నుంచీ అణచివేతకు గురయినవారు కావడం చేత, సహజంగానే నిచ్చెనమెట్ల వ్యవస్థతో కూడిన సమాజం కనుక, వారిపై చిన్నచూపు ఉంటుంది. అయితే ప్రజాస్వామిక వ్యవస్థలో జీవిస్తున్నాం కనుక, ప్రపంచంలోనే అతి పెద్దదయిన లిఖిత రాజ్యాంగాన్ని, ప్రాథమిక హక్కులను (ఆర్టికల్ 14-32) కలిగి ఉన్నాం కనుక భారత రాజ్యాంగం ఇచ్చిన ప్రాథమిక హక్కుల స్ఫూర్తితోనే, బాధితుల తరఫున అనగా ఎస్.సి. / ఎస్.టి.ల తరఫున కొన్ని విషయాలను ఇక్కడ చర్చించదలిచాను. నూటికి ఐదు శాతం కూడా కోర్టులలో నిందితులకు శిక్షలు పడడం లేదు.

1985లో ఆంధ్రప్రదేశ్‌లో ఎన్.టి. రామారావు ప్రభుత్వ హయాంలో జరిగిన 'కారంచేడు' మారణహోమంనకు నిరసనగా వచ్చిన దేశవ్యాప్త ఉద్యమ స్ఫూర్తితోనే దళితులపై దాడులను నిరోధించడానికి, ఈ దేశంలో వేళ్లూనికొని ఉన్న 'కుల వ్యవస్థ'ను అంగీకరిస్తూనే, భారత పాలకవర్గాలు ఈ చట్టాన్ని తీసుకొని వచ్చాయి.

దళితులకు 'రక్షణ'గా, జీవితంలో - ఆత్మగౌరవంతో, ఆత్మ విశ్వాసంతో బతకాలనే దృఢనిశ్చయాన్ని ఇవ్వాల్సిన ఈ చట్టాన్ని ప్రభుత్వ వ్యవస్థలో భాగస్వాములైన పోలీసులు (కేసులు నమోదు చేయదలసింది వారే కాబట్టి), దళితులకు కోర్టుకు వచ్చి, 'సాక్ష్యం' చెప్పేవరకూ రక్షణ కల్పించాల్సిన పోలీసులు, ఏ విధంగా దళితులకు రక్షణ కల్పించకుండా - నిందితుల కొమ్ము కాస్తున్నారో, నిందితులకు సహకరిస్తున్నారో తెలుసుకుందాం.

ఈ చట్టంలోని సెక్షన్ 3వ క్లాజులోని 15 సబ్ క్లాజులు - దళితులపై జరిగే దాడులకు పోలీసులు నమోదు చేయవలసిన సెక్షన్ గురించి తెలియజేస్తుంది. అందులోనూ దళిత మహిళలపై జరిగే అత్యాచారాలపై మరీ ప్రత్యేకంగా తెలియచేయబడింది. ఫిర్యాదుదారుడు, ఏ దళిత కులానికి చెందిన వాడైనప్పటికినీ, తనకు జరిగిన అన్యాయాన్ని, నిర్దిష్ట కాల, మాన పరిస్థితులను తెలియజేస్తే, వెంటనే కేసు నమోదు చేసి, అనగా ఫస్ట్ ఇన్ఫర్మేషన్ రిపోర్ట్ (ఎఫ్.ఐ.ఆర్.) నమోదు చేసి, ఒక కాపీని ఫిర్యాదు దారునికిచ్చి, దాని పూర్తి విచారణ నిమిత్తం, సబ్ డివిజనల్ పోలీసు అధికారి (డి.ఎస్.పి.) స్థాయి అధికారికి వెంటనే పంపించాలి. కానీ, రాష్ట్రంలోని ఏ పోలీసు స్టేషన్‌లలోనూ, సబ్ ఇన్స్పెక్టర్‌లు గానీ, స్టేషన్ హౌస్ ఆఫీసర్‌లు (ఎస్.ఎచ్.ఒ.)లు గానీ ఆ విధంగా చేయడం లేదు. చేయకపోగా, దళితులనే అవమానకరంగా మాట్లాడుతూ, వారినే మానసికంగా మరింత వేదనకు గురి చేయుచున్నారు. ఇది వాస్తవం.

రాయలసీమ (కర్నూలు, కడప, అనంతపురం, చిత్తూరు) జిల్లాల లోనైతే, ముద్దాయిలతో పోలీసులు జల్సాలు చేస్తుండగా, దళితులు పోలీసు స్టేషన్‌లలో, నేలపై (కింద) కూర్చొని ఆవేదన చెందుతూ ఉంటారు. ఇది సర్వసాధారణం. అంతే కాకుండా నిందితులతో ఏ విధంగానైనా రాజీ చేయడానికి ప్రయత్నిస్తుంటారు. సర్వశక్తులూ ఒడ్డి, ఎంతో కొంత మొత్తానికి, ఫిర్యాదుదారులతో రాజీ చేస్తారు. ఎందుకనగా అందులో తమ వాటా, ఫిర్యాదుదారుడైన దళితుని వాటా కన్నా ఎక్కువగానే ఉంటుంది. ఒకవేళ దళితులు మొండిగా రాజీ కాకుండా నిందితుల అరెస్టును డిమాండ్ చేస్తే, వారిని 'రాజ'లాంఛనాలతో అరెస్ట్ చేసి, జైలుకు వెళ్లేదాకా సకల మర్యాదలు చేస్తారు. (నిందితుల దగ్గర పెద్ద మొత్తంల డబ్బు తీసుకొంటారు కాబట్టి - అది కూడా ముద్దాయిల సంఖ్యను బట్టి, పెరుగుతూ ఉంటుంది.)

ఎస్.సి. / ఎస్.టి. ప్రత్యేక కోర్టులలో 'బెయిల్ అప్లికేషన్' - ముద్దాయిలు (నిందితుల) తరఫున విచారణకు వచ్చినపుడు కేసు డైరీ ఫైల్ (సి.డి. ఫైల్) అది పోలీసు స్టేషన్‌లో తయారు చేయబడుతుంది. (ఎస్.సి. / ఎస్.టి. కేసు కాబట్టి డి.ఎస్.పి. తయారు చేస్తారు.) దానిని మరుసటి రోజే కోర్టులో ప్రవేశపెట్టి, నిందితులు ఎంత క్రూరులైనప్పటికినీ వారికి బెయిల్ ఇప్పించడానికి పోలీసులే ప్రయత్నిస్తూ, ఉత్సాహాన్ని ప్రదర్శించడం - కోర్టులలో సర్వసాధారణంమయిపోయింది. ఇది చాలా దారుణం - విచారకరం - ఇవన్నీ కూడా ఫిర్యాదుదారునికి తెలియ కుండానే జరుగుతూ ఉంటాయి. ఫిర్యాదుదారుడు, జిల్లా సెషన్స్ కోర్టులు (జిల్లా కేంద్రంలో ఉంటాయి) చుట్టూ తిరిగి, పర్యవేక్షించే పరిస్థితీ, జ్ఞానమూ, ఆ విధమైన ఆలోచనా ధోరణీ, ఆర్థిక - స్తోమత ఉండవు కాబట్టి, నిందితులూ, పోలీసులూ, ఒకరికొకరు సహకరించుకుంటూ ఉంటారు. ఫిర్యాదుదారుల వైపు నిలబడవలసిన పబ్లిక్ ప్రాసిక్యూటర్లు - పోలీసు అధికారుల చెప్పు చేతుల్లోనే ఉంటారు కాబట్టి, నిందితుల పట్ల ఉదాసీనంగా వ్యవహరించే పరిస్థితి ఉంటుంది. విచారించవలసిన విషయం ఏమిటంటే, చాలా చోట్ల, ఎస్.సి. / ఎస్.టి. కోర్టుల్లో పబ్లిక్ ప్రాసిక్యూటర్లు అగ్రకుల శక్తులైన రెడ్డి, కమ్మ, బ్రాహ్మణ లేదా ముస్లిం వర్గాలకు చెందినవారే అధికంగా కోర్టులలో ఉంటూ వస్తున్నారు. దీనివలన ఫిర్యాదుదారులు బలంగా, ధైర్యంగా వారిని ప్రశ్నించలేక

పోతున్నారు. ఎదుర్కోలేకపోతున్నారు. ఎస్.సి. / ఎస్.టి. చట్టం, 31 మార్చ్ 1995లో భారత ప్రభుత్వం జారీ చేసిన ప్రత్యేక రూల్స్ (ఎస్.సి. / ఎస్.టి. (ప్రివెన్షన్ ఆఫ్ అట్రాసిటీస్) రూల్స్ 1995) ప్రకారం, ఫిర్యాదుదారులు జిల్లా కలెక్టర్ – రెవెన్యూ డివిజనల్ స్థాయి అధికారులు – అన్ని విధాలుగా సహకరిస్తూ, రక్షణ కల్పించాలి. జిల్లా విజిలెన్స్ మానిటరింగ్ కమిటీ – జిల్లా కలెక్టర్ల అధ్యక్షతన ప్రతి నెలా జరుగుతూ ఉంటాయి. వాటిలో ఆర్.డి.ఒ. / డి.ఎస్.పి.లతో పాటు కొంతమంది దళిత సంఘాల ప్రతినిధులూ ఉంటారు. అయితే విచారణ సరిగా నిర్వహించని పోలీసు అధికారులపై, అనగా డి.ఎస్.పి. స్థాయి అధికారిపైనా కూడా ఎస్.సి. / ఎస్.టి. (పి.ఒ.ఎ.) అక్ట్ 1989లోని సెక్షన్ 4 ప్రకారం వారిని కూడా నిందితులుగా మార్చే ప్రక్రియపై రాష్ట్రంలో ఇంతవరకూ ఒక్క అధికారిపై కూడా చర్యలు తీసుకోలేదు. చర్యలు తీసుకోవడానికి ప్రయత్నించలేదు. ఎందుకనగా వారికి ఎస్.పి. / ఐ.జి. స్థాయి లేదా హోంమంత్రి స్థాయి వారితో సంబంధాలు ఉంటాయి. లేకుంటే నిందితులే వారిని, పై వారినుంచి 'రక్షణ' కల్పించే విధంగా చూస్తారు.

ఈ చట్టం ప్రకారం దళితులకు అందవలసిన నష్టపరిహారం కూడా 'ప్రాసెస్'లో చాలా అవరోధాలు ఉంటాయి. ఎందుకనగా ఫిర్యాదుదారుని, పరిశీలించిన లేదా పరీక్షించిన డాక్టర్ సర్టిఫికేట్, పోలీసు స్టేషన్‌లో ఇచ్చి ఉంటారు. పోలీస్ స్టేషన్ నుంచి జిరాక్స్ ప్రతి అయిన డాక్టర్ ధృవీకరణ పోలీసుల నుంచి పొందడానికి పోలీసులు మామూలు గానే 'మామూళ్లు' వసూలు చేస్తుంటారు. డాక్టర్ ధృవీకరణ లేకపోతే నష్టపరిహారం రాదు. ఈ విధంగా ఫిర్యాదుదారున్ని అనేక కష్టాలు పెడుతూ మానసిక క్షోభకు ఈ రెవెన్యూ పోలీసు వ్యవస్థలు గురిచేస్తూ ఉంటాయి. (నష్టపరిహారం ఇవ్వాల్సింది రెవెన్యూ వారు కాబట్టి.)

నేర విచారణ పై కోర్టులో సాక్ష్యం రికార్డ్ చేసే రోజు కూడా, ఇంటి దగ్గర బయలుదేరే స్థలం నుంచి, కోర్టు భవనం వరకూ ఎన్ని కిలోమీటర్లు ఉంటుందో, అన్నింటినీ లెక్కించి, బస్ టికెట్లు – ఆటో ప్రయాణం, భోజన ఖర్చులూ అన్నీ చెల్లించాలనీ 1995 రూల్స్ తెలియ జేస్తాయి. అవి కూడా కోర్టే సాక్ష్యమిచ్చే వారందరికీ వెంటనే చెల్లిస్తుంది. అయితే వారిచ్చే సాక్ష్యం కాపీపైన, పబ్లిక్ ప్రాసిక్యూటర్, ఫిర్యాదుదారుడూ ఇచ్చే ప్రత్యేక అర్జీపై సంతకాలు చేసిన తదనంతరం నగదు రూపంలో కోర్టు క్లర్కు చెల్లిస్తాడు. కానీ చాలా చోట్ల పోలీసులు కూడా అందులోనూ వాటా వసూలు చేస్తున్నారు. దీనిని ఎవరో, మాలాంటి వారు నిరోధిస్తే తప్ప పోలీసులు ఫిర్యాదుదారులను పీడించి వసూలు చేస్తూ ఉంటారు. ఇది విచారకరం.

నిందితుల పక్షం వహించే పోలీసు అధికారులపై ఎందుకు చర్యలు తీసుకోవడం లేదు?

ఈ కేసుల్లోని నిందితులు 'దళితేతరులు' కాబట్టి, ఎక్కువ సందర్భాల్లో వారికి అధికారంలో ఉన్న లేదా ప్రధాన ప్రతిపక్ష పార్టీల, వారి తాబేదార్ల అండ ఉంటుంది. నిందితులు దాదాపుగా ధనవంతులై ఉంటారు కాబట్టి, సహజంగానే పోలీసులు వారి పక్షం వహిస్తూ ఉంటారు. విచారించాల్సిన విషయం ఏమిటంటే తమ మాట వినని, కేసుల్లో రాజీకి రాని ఫిర్యాదుదారులపై పోలీసులు అక్రమంగా వేరొక ఇండియన్ పీనల్ కోడ్ (ఐ.పి.సి.) కేసులు నమోదు చేసి, అన్యాయంగా వారిని కూడా ముద్దాయిలుగా చూపెడుతూ ఉంటారు. ఎస్.సి. / ఎస్.టి. కేసుల్లో ఫిర్యాదుదారులు నిందితులతో రాజీ అయితే, వారిపై ఉన్న ఐ.పి.సి. కేసులను ఎత్తివేస్తామనీ, లేదా కోర్టులలో 'లోక్ అదాలత్' సెటిల్‌మెంట్ చేస్తామనీ, కొన్ని అన్యాయమైన సూచనలు చేస్తూ, కేసులు కొనసాగించాలంటే ఇరువైపులా డబ్బులు వసూలు చేస్తూ, వారి పబ్బం గడుపుకొంటూ ఉంటున్నారు. ఇది ప్రజలకు భారత రాజ్యాంగం కల్పించిన ప్రాథమిక హక్కులనూ, ప్రజాస్వామిక హక్కులనూ, రాజ్యాంగ పరిహార హక్కునూ (ఆర్టికల్ 226 లేదా 32) ఉల్లంఘించినట్లే. ఎస్.సి./ ఎస్.టి. (పి.ఒ.ఎ.) కేసులలో 'నిందితులకు' పోలీసులు సహకరించడాన్ని దళిత సంఘాలు, హక్కుల సంఘాలు పూర్తిగా ఖండిస్తున్నప్పటికీ, దానిని నిరోధించడంలో కొంత వైఫల్యం చెందామనే అంగీకరించాలి. ఎందుకంటే ఇది బహిరంగ రహస్యమే.

కర్నూలు జిల్లా ఆళ్లగడ్డ డి.ఎస్.పి. పరిధిలోని దాదాపు పన్నెండు పోలీసు స్టేషన్లలో పోలీసులు బహిరంగంగానే నిందితులతో పోలీసు స్టేషన్లలోనే 'మందు – విందులు' ఆరగిస్తూ ఉంటారు. నిందితులు పోలీసు స్టేషన్లలో ఉంటే, ఫిర్యాదుదారులు బయట చెట్ల కింద కాలం వెళ్లదీస్తూ ఉంటారు. అసలు, ఆళ్లగడ్డ డి.ఎస్.పి. కార్యాలయం గ్రామానికి ఒక కిలోమీటర్ దూరంలో నిర్మానుష్యమైన ప్రదేశంలో ఉంటుంది. అది ఒక 'పోలీసు సామ్రాజ్యం'. రాత్రి ఎనిమిది గంటల తర్వాత ఆ ప్రాంతంలో ఎవరూ సంచరించరు. ఇటీవల ఒక ఎస్.సి. / ఎస్.టి. కేసులో ఫిర్యాదుదారులైన మాణిక్యమ్మ అనే మహిళపై నిందితులు నెలలోపు గానే ఫిర్యాదు చేసిందనే దురహంకారంతో ఆటోలో ఆమె ప్రయాణిస్తుండగా, రాత్రిపూట ఆటో ఆపి, ఆటో డ్రైవర్‌పై, ఆమెపై చాగలమర్రి గ్రామ శివార్లలోనే దాడి చేశారు. ఆ మహిళ వస్త్రాపహరణకు గురవ్వగా, ఆళ్లగడ్డ డి.ఎస్.పి. ఆ నిందితులపై కేసు నమోదు చేయడానికి రెండవ ఫిర్యాదు తీసుకోవడానికి నిరాకరించాడు. ఆయన రెండవ ఎస్.సి. / ఎస్.టి. కేసు నమోదు చేయడానికి నిరాకరిస్తూ, ఐ.పి.సి. సెక్షన్ 323, 324, 506 ప్రకారం కేసు నమోదు చేయడానికి ప్రయత్నించారు. దళిత సంఘాలు బలంగా కోరడం వలన, అయిష్టంతో నిందితులపై ఎస్.సి. / ఎస్.టి. కేసు నమోదు చేశారు.

ఒక దళిత మహిళ ఒకే నెల రోజుల్లోపే రెండుసార్లు బహిరంగం గానే, అగ్రకులస్తుల చేతుల్లో దాడులకు గురయిందంటే ఈ ప్రాంతంలో ఉన్న బలమైన 'కుల వ్యవస్థ' అగ్రకుల, భూస్వామ్య దురహంకారానికి నిదర్శనం.

ఆళ్లగడ్డ డి.ఎస్.పి. పరిధిలో ఉన్న దాదాపు అన్ని పోలీసు స్టేషన్లు ప్రధానంగా గోస్పాడు, శిరువెళ్ల, ఆళ్లగడ్డ, చాగలమర్రి, రుద్రవరం, ఆళ్లగడ్డ (రూరల్) పోలీసు స్టేషన్లలో ఎస్.సి. / ఎస్.టి. కేసుల్లో నిందితులకు పోలీసుల పూర్తి సహకారం ఉంటుందని అది రాయడం కన్నా చూసి అనుభవించి, ఎదుర్కొన్న వారికే తెలుస్తుంది.

అందుకే దళితులు తమ హక్కుల సాధన కోసం, ఆత్మగౌరవంతో జీవించడం కోసం ఆత్మవిశ్వాసంతో, అగ్రకుల భూస్వామ్య శక్తులపై పోరాటం చేయాలి. వారికి సహకరిస్తున్న పోలీసు అధికారులపై, పోలీసు అధికారులకు సహకరిస్తున్న రాజకీయ నాయకులపై ప్రతిఘటనా పోరాటం చేయాలి. అంతిమ విజయం పోరాడేవారిదే.

'పోరాడితే పోయేదేమీ లేదు – బానిస సంకెళ్లు తప్ప' – కార్ల్ మార్క్స్.

*(రచయిత ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థ రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

ఆదివాసుల హక్కుల పరిరక్షణే నిజమైన ప్రజాస్వామ్యానికి చిహ్నమనీ, సామ్రాజ్యవాద కంపెనీల కోసం ఆదివాసులను అడవి నుంచి బేదఖలు చేయడం దుర్మార్గం అనీ అంటున్నారు **సి.ఎస్. పొదిల ఆజాద్**

# అడవిపై సామ్రాజ్యవాదుల కన్ను

దేశ ప్రజల్ని కాపాడడానికి అధికారికంగా సైనికులు దేశ సరిహద్దుల్లో కాపలా కాస్తున్నారు. కాని దేశంలోని అడవులలో దాగి ఉన్న ఖనిజ సంపదను ఈసమెత్తైనా ముట్టుకోకుండా రాబోయే తరాలకు అందించాలనే తపన తప్ప స్వార్థమెరుగని నిజాయితీపరులు, అనధికారికంగా కాపల కాస్తున్న వారు ఆదివాసులు. దేశ సరిహద్దుల్లో కాపల కాస్తున్న సైనికులతో సమానం గిరిపుత్రులు. కానీ ఆదివాసులు, గిరిజనులు బయటి ప్రపంచానికి కొత్తగా, వింతగా కనిపిస్తారు. కారణం వాళ్ల వస్త్రాలంకరణ. ఆలోచనా విధానం. బయటి ప్రపంచానికీ ఆదివాసులకీ ప్రతిదానిలో తేడా ఉంది. తినే తిండి నుండి చనిపోతే కాల్చి బూడిద చేసే వరకు... నేటి కంప్యూటర్ మనుషులు ఒకరి దగ్గరి నుండి ఇంకొక్కరు ఎలా దోచుకోవాలని అన్వేషిస్తారు. ఆదివాసులు నా దగ్గరున్నది ఇంకొకరికి ఎలా పంచాలని మార్గాలు కనుక్కొంటారు.

అడవిలోని క్రూర మృగాల నుండి ఎలా తప్పించుకోవాలో తెలిసిన ఆదివాసులు మనిషి రూపంలోని దాడికి దిగుతున్న మేకవన్నె మృగాల పంజా నుండి తప్పించుకోవడం ఎలాగో తెలియక విలవిలలాడుతున్నారు. అడవి సంపదకు కాపలా కాస్తున్న ఆదివాసులకు నేటి ప్రభుత్వం అరచేతిలో వైకుంఠం చూపిస్తామంటూ వారి జీవితాలను అంధకారంలో నెడుతోంది. నింగి నేల హద్దుగా అడవిలో హాయిగా సంచరిస్తూ కల్మషం లేని జీవితాలు గడుపుతున్న ఆదివాసులకు పెద్ద ఆపద పొంచి ఉంది. శవాలపై ఏరుకునే నీతి మాలిన రాజకీయాలకు, క్రూర మృగాల వంటి స్వార్థపరులైన మనుషులకు దూరంగా ఉంటూ కొండ కోనల్లో నివసిస్తున్న చెంచులకు నిద్రపట్టని భయం పట్టుకుంది. 2012 నాటికి యుగాంతం వస్తుందో, రాదో కాని నేడు నల్లమల అడవుల్లోని చెంచులు ఏరోజు కారోజు ప్రాణాలను అరచేతులలో పెట్టుకుని బిక్కుబిక్కుమంటూ రోజులు గడుపుతున్నారు. చెంచులు ఆదివాసుల జాతులు అంతరించే ప్రమాదం ఉన్న ఆపద పేరు – డీబర్స్ అనే బహుళజాతి సంస్థ.

డీబర్స్ అనే బహుళజాతి సంస్థ ప్రపంచ వ్యాప్తంగా వజ్రాలను, ఖనిజ సంపదను అన్వేషించే దక్షిణాఫ్రికాకు చెందినది. హైదరాబాద్‌లోని బేగంపేటలోని అటామిక్ మినరల్ డైరెక్టర్ ఫర్ ఎక్స్‌ప్లోరేషన్ అండ్ రిసెర్చ్ సెంటర్ రేడియో మెట్రిక్ ఏరియల్ సర్వే నిర్వహించగా నల్లమల అటవీ ప్రాంతంలో ఉన్న దాదాపు పదిహేను లక్షల ఎకరాల విస్తీర్ణం భూమిలో వజ్రాలు, వైడూర్యాలు, విలువైనటువంటి ఖనిజ సంపద దాగి ఉన్నదన్న విషయం బయటపడింది. దీన్ని దృష్టిలో ఉంచుకొని నల్లమల అటవీ ప్రాంతంలో దాగివున్న ఖనిజ సంపదను బయటికి తీయడానికి అనుమతి ఇవ్వాలని 2000లోనే డీబర్స్ సంస్థ రాష్ట్ర ప్రభుత్వానికి దరఖాస్తు చేసుకున్నది. రాష్ట్ర ప్రభుత్వం ఈ తరహా కంపెనీలకు అనుమతులివ్వాలంటే కేంద్ర ప్రభుత్వం అనుమతి తప్పనిసరి. అందులోను ఖనిజ సంపద నిక్షిప్తమైవున్న ప్రాంతం రాజీవ్‌గాంధీ టైగర్ ప్రాజెక్ట్ పరిధిలో ఉండడం వల్ల అనుమతి కోసం చాలాకాలం పాటు వేచి ఉండాల్సిందే.

కానీ రాష్ట్రంపై కేంద్ర ప్రభుత్వం ఒత్తిడి పెంచుతూ 2005 నుంచి వరుసగా 2006, 2007, 2008లలో నాలుగు దఫాలుగా అటవీ ప్రాంతంలోకి డీబర్స్ సంస్థను అనుమతించాలని కోరింది. దానికి తగ్గట్టుగానే నల్లమల అటవీ ప్రాంతంలో 2000 చదరపు కిలోమీటర్ల పరిధిలో తవ్వకాలకు డీబర్ సంస్థకు 21 ఆగస్ట్ 2008లో అనుమతి ఇచ్చింది. కేంద్రం నుండి అనుమతి వచ్చి రాగానే రాష్ట్ర ప్రభుత్వం 2009 నవంబర్ 16, 24 తేదీల్లో జి.ఒ. 236, 237, 242లను అమలులోకి తెచ్చి ఖనిజ సంపద, బంగారం, వజ్రాల తవ్వకాలకు శ్రీకారం చుట్టింది. మహబూబాబాద్ జిల్లా రాయపూర్ సమీపంలో గట్టు మండలం రాయవరం మొదలుకొని గద్వాల్, వనపర్తి, అచ్చంపేట, కల్వకుర్తి వరకు విస్తరించి ఉన్న అటవీ ప్రాంతంలోని పదిహేను లక్షల ఎకరాలను డీబర్స్ సంస్థకు తవ్వకాలు జరిపేందుకు ధారాదత్తం చేస్తోంది ప్రభుత్వం.

అందమైన నాగరిక ప్రపంచమంటూ ప్రభుత్వం చూపిస్తున్న అరచేతులలో వైకుంఠం వెనుక దాగి ఉన్న కుట్ర బయటపడడంతో నేడు చెంచులు 'దారిన పోయే దానయ్య' కాళ్లు పట్టుకొని మరీ బతిమిలాడుతూ, 'మేం పుట్టింది ఈ అడవిలోనే. సచ్చుడు కూడా అడవిలోనే సత్తాం. మాకు ఏ బంగ్లా వద్దు, ఏ ఉద్యోగం వద్దు' అంటూ మొర పెట్టుకుంటున్నారు. అయినా ప్రభుత్వం నల్లమల అటవీ ప్రాంతం నుంచి చెంచులను ఎలాగైన తరిమివేయాలనే ఆలోచనలతో జనవాసాల వల్ల పులులు, సింహాల సంతతి అంతరించే ప్రమాదం ఉందనీ, క్రూర మృగాల వల్ల చెంచుల ప్రాణాలకు ముప్పు వాటిల్లే ప్రమాదం ఉందనే సాకుతో నాగరిక ప్రపంచం నుండి అనాగరిక ప్రపంచంలోకి గెంటి వేస్తోంది. నల్లమల అటవీ ప్రాంతం నుండి చెంచులు బయటికి వస్తే 'పక్కా ఇల్లు – కుటుంబంలో ఒకరికి ఉద్యోగం' అనే రెండు ప్యాకేజీలను ఐ.టి.డి.ఎ. ప్రకటించింది. ఈ ప్యాకేజీలకు ఆకర్షణ చెంది మైదాన ప్రాంతంలో. ఉన్న చెంచులు, గిరిజనులు బయటికి వచ్చేసినప్పటికీ అభయారణ్యంలో ఉన్న పద్నాలుగు చెంచు పెంటలకు చెందిన సుమారు ఐదువందల కుటుంబాలు ఒప్పుకోవడం లేదు.

వ్యవసాయం గిట్టుబాటు కాక, అప్పుల పాలై ఆత్మహత్యలు చేసుకున్న రైతుల కుటుంబాలకు ఇప్పటికీ నష్టపరిహారం అందలేదనీ, జయతీ ఘోష్ కమిటీ సిఫారసులను వెంటనే అమలు చేయాలనీ అంటున్నారు **బి. కొండల్ రెడ్డి**

# రైతుల ఆత్మహత్యలకు ఎక్స్‌గ్రేషియా ఎక్కడ?

ఏ క్షణంలో జి.ఒ. 421 ప్రతిపాదించారో కాని ప్రస్తుతం అది అమలవుతున్న తీరును చూస్తే 420 (చీటింగ్) అంటే అతికినట్లు సరిపోతుందనిపిస్తోంది. 1991 నుంచి వచ్చిన ఆర్థిక సంస్కరణల ప్రభావం తీవ్రం కావడంతో మహారాష్ట్రలోని విదర్భ ప్రాంతంతో పాటు మన రాష్ట్రంలో కూడా రైతుల ఆత్మహత్యలు ఎక్కువ అయ్యాయి. సకాలంలో వర్షాలు లేక, బ్యాంకులు సకాలంలో కావలసినంత రుణాలు ఇవ్వక, మెట్ట వ్యవసాయం పైన పరిశోధనలు జరగక, నీటి పారుదల సౌకర్యం కల్పించక రైతులందరూ బోర్లపై ఆధారపడే స్థాయికి తీసుకు వచ్చిన ప్రభుత్వాలు కనీసం 'వాల్టా' (వాటర్ ల్యాండ్ అండ్ ట్రీ ఆక్ట్) చట్టాన్ని కాని, బోరు ఇన్స్యూరెన్స్ కాని అమలు చేయకపోవడంలో, బోర్ల కోసం ప్రయత్నించడం అవి విఫలమవ్వడం, నకిలీ విత్తనాలు, వ్యవసాయానికి పెట్టుబడి ఎక్కువ కావడం, పెట్టుబడికి తగిన ధర లేకపోవడం, అప్పుల వాళ్ల ఒత్తిడికి తట్టుకోలేక 1998 నుంచి చిన్న, సన్నకారు రైతులు, కౌలు రైతుల ఆత్మహత్యలు ఎక్కువ అయ్యాయి. అయితే ఈ రైతు ఆత్మహత్యలను ప్రభుత్వం సీరియస్‌గా తీసుకోకపోగా, వ్యవసాయం దండగ అని, ఇవి నిజమైన ఆత్మహత్యలు కావని, హిస్టీరియా అని, వయస్సు పైబడినవారు కాయకష్టం చేతకాక ఆత్మహత్యలు చేసుకుంటున్నారని రైతును ఎన్నో విధాలుగా అవమానించింది. కాని ఆత్మహత్య చేసుకుంటున్న సగటు రైతు వయస్సు 36 సంవత్సరాలు అని ఈ ప్రభుత్వం, అధికారులు గుర్తెరిగితే మంచిది.

---

నాడు రాష్ట్ర ప్రభుత్వం ఎలాంటి పాలన ఇస్తానని గద్దెనెక్కిందో, ఏ రాజ్యాంగం సాక్ష్యంగా ప్రమాణాలు చేశారో అవన్ని మరిచి నేడు చెంచులను బలవంతంగా బయటకు గెంటివేస్తున్న హార్వర్డ్ విద్యార్థి 'చిదంబరం రహస్యాలను' బయటపెట్టాలి. దేశ సంపదను దోచుక పోవడానికి గుంటకాడి నక్కలా ఎదురుచూస్తున్న సామ్రాజ్య వాదులకు ప్రభుత్వం అనుమతివ్వడం వెనుక ఉన్న మర్మమేమిటి? దేశ అభివృద్ధి కోసమే మేమంతా పాటుబడుతున్నది అంటున్న చిదంబరం ప్రభుత్వం నిజంగా దేశ అభివృద్ధి కోసమైతే నిజాలెందుకు చెప్పదు? ప్రజాస్వామ్య వ్యవస్థకు నిజాయితీ, జవాబుదారీతనం ప్రజల పక్షాన నిలబడడం ప్రధానం. కానీ తన రాజకీయ వ్యవస్థలో లొసుగులు ఉన్నాయి కాబట్టే చిదంబర రహస్యాలను బయటికి చెప్పడానికి జంకుతున్నారు. దేశంలోని పలు రాష్ట్రాలలో లక్షల ఎకరాల భూమి మిట్టల్, టాటా, ఎస్సార్, వేదాంత, బహుళజాతి కంపెనీలకు ప్రభుత్వం అప్పజెప్పింది. అడవిలో దాగి ఉన్న అపార ఖనిజ సంపద, బాక్సైట్, బంగారం వంటి సంపదను యథేచ్ఛగా తవ్వుకోవడానికి పెద్ద పెద్ద పరిశ్రమలు స్థాపించడానికి, బడాబాబులకు ప్రభుత్వం అటవీ భూముల్ని ధారపోసింది. కొన్ని లక్షల భూముల్ని బడాబాబులకు ధారాదత్తం చేసిన ప్రభుత్వం ఎవరి అభివృద్ధికి పాటుపడుతుందో చెప్పాలి?

గ్రీన్‌హంట్ పేరుతో మావోయిస్టుల ఏరివేతను ప్రారంభించారు. కాల్పులు జరిపారు. కాని కాల్పులు జరిపింది ఏవరి మీద? ఆదివాసుల మీద. చచ్చిందెవరు? ఆదివాసులు. దీనివల్ల ప్రభుత్వం సాధించిందేమిటి? బాక్సైట్‌లకు, ఖనిజ సంపదకు కాపలాదారులుగా ఉన్న ఆదివాసులు మాయమవుతారు. తెలంగాణ ప్రజలు భూసంస్కరణలు చేయాలన్నారు. దున్నేవారిదే భూమి అన్నారు. కాని ప్రభుత్వం దానికి బదులు నాలుగు వేల మందిని బలి తీసుకుంది. ప్రభుత్వం చేయాల్సిన పనిని ప్రజాస్వామ్యంగా ప్రజా ఉద్యమం చేసింది. అది సాయుధ పోరుగా మారింది. విప్లవంగా రూపుదిద్దుకొంది. ఎంతోమంది వీరులు నేలకొరిగారు కాని, దాన్ని శాంతి భద్రతల సమస్యగా చిత్రీకరించారు. ఇది ఉద్యమాన్ని వాయిదా వేయడానికే పనికివచ్చింది తప్ప ఎగిసిపడుతున్న ప్రజా అగ్నిజ్వాలలను ఆపలేదు.

నేడు కూడా ఆదివాసులకు అదే జరగబోతోంది. అభివృద్ధి పేరుతో ప్రపంచదేశాల మధ్య చిచ్చుపెట్టి యుద్ధాలకు ఉసిగొల్పుతున్న అగ్రరాజ్యం అడుగుజాడల్లోనే నడుస్తున్నాడు చిదంబరం. అడవిలోని అటవీ సంపదను సామ్రాజ్యవాదులకు, ప్రైవేట్ శక్తులకు అందజేయాలనే ఉద్దేశ్యంతో నేడు ఆదివాసులను, చెంచులను బయటకు గెంటివేస్తున్న ప్రభుత్వం చెంచుల, ఇతర తెగల జాతుల మనుగడను ప్రశ్నార్థకంగా మారుస్తోంది.

ప్రభుత్వం ఎవరిని రక్షించేందుకు అటవి సంపదను సామ్రాజ్య వాదులకు, బడా పెట్టుబడిదారులకు అప్పగిస్తోంది? ప్రభుత్వం ప్రజల కాపలాదారో, బహుళజాతి కంపెనీల కాపలాదారో తేల్చి చెప్పాలి. ప్రజా ఉద్యమాన్ని తుపాకి గుండు ద్వారా అణచలేమని చరిత్ర నిరూపించింది. గ్రీన్‌హంట్ పేరుతో పరోక్షంగా ఆదివాసులపై దాడికి దిగిన ప్రభుత్వం నేడు ఒక అడుగు ముందుకు వేసి ప్రత్యక్షంగా ఆదివాసులను, చెంచులను అడవిలో నుండి గెంటి వేస్తోంది. అడవి తల్లి నుండి బయటకు గెంటివేయబడుతున్న ఆదివాసులకు, చెంచులకు అండగా ఉంటూ వారిని రక్షించడమే నిజమైన ప్రజాస్వామ్యం.

*(రచయిత విద్యార్థి, పి.డి.ఎస్.యు. సభ్యులు, నర్సంపేట)*

ప్రభుత్వం కళ్లు తెరిచేలోపే ఎన్నో కుటుంబాలకు పురుగుల మందే పెరుగన్నం అయింది. ఈ పరిస్థితి ఇలాగే కొనసాగితే చిన్న, సన్నకారు రైతుల మనుగడకే ప్రమాదం అనుకొన్న మేధావులు, జర్నలిస్టులు, రైతు సంఘాలు, హక్కుల సంఘాలు ఒక్కటై ప్రభుత్వం మీద ఒత్తిడి తీసుకు రావడంతో 2004 ఏప్రిల్‌లో అధికారంలోకి వచ్చిన వై.ఎస్. రాజశేఖరరెడ్డి ప్రభుత్వం రైతు ఆత్మహత్యల గురించి పూర్తిస్థాయి విచారణకుగానూ ప్రముఖ ఆర్థిక నిపుణులు జయతీ ఘోష్ ఆధ్వర్యంలో కమిటీని నియమించింది. కె.ఆర్. చౌదరి, మల్లారెడ్డి లాంటి మేధావులు సభ్యులుగా గల ఆ కమిటీ రైతు ఆత్మహత్యలు నిరోధించడానికి ప్రభుత్వం ముందు సాగునీటి సౌకర్యం కల్పించాలని, జాతీయ బ్యాంకులు రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా నిబంధనలు పాటించి రైతులకు 18 శాతం రుణాలు ఇవ్వాలని, మెట్ట వ్యవసాయం ప్రోత్సహించాలని, పెట్టుబడి మీద 50 శాతం అదనంగా ధర కల్పించాలని స్వామినాథన్ కమిటీ సిఫారసులను అమలు చేయాలని సూచించింది. అయితే 1998 నుంచి రైతు ఆత్మహత్యలు జరుగుతుండడంతో ఆత్మహత్య చేసుకున్న రైతు కుటుంబాల కోసం ఈ కమిటీ ఒక లక్ష రూపాయల ఆర్థిక సాయం, ఆ కుటుంబానికి, అప్పుల వారికి ఒక్కసారి పరిష్కార రూపాన యాభై వేలతోపాటు, 1) ఆ కుటుంబంలోని పిల్లలను సాంఘిక సంక్షేమ స్కూళ్లలోనూ, హాస్టళ్లలోనూ చేర్పించడం; 2) ఇందిరా ఆవాస్ యోజన పథకంలో గృహ కేటాయింపు; 3) ప్రభుత్వ సంక్షేమ పథకాల కింద ఆర్థిక సహాయం; 4) పింఛను మొదలగు సౌకర్యాలు కల్పించాలని. ఈ కమిటీ ప్రభుత్వానికి నివేదిక సమర్పించింది.

ప్రభుత్వం ఈ నివేదికననుసరించి 1 జూన్ 2004 నాడు జి.ఒ. 421 జారీ చేసింది. ఈ జి.ఒ. ప్రకారం 1 జూలై 1998 నుంచి ఆత్మహత్య చేసుకున్న ఏ రైతుకైనా ఈ ప్యాకేజి వర్తిస్తుంది. ప్రారంభంలో కొన్ని కుటుంబాలకు మాత్రమే ఈ ఆర్థిక సాయం అందినట్లు మా పరిశోధనల్లో తేలింది. కాని ఎక్కడ కూడా ఆ కుటుంబంలోని పిల్లల కోణం నుంచి ఆలోచన చెయ్యలేదనిపిస్తుంది. రైతు ఆత్మహత్య జరిగిన కుటుంబంలోని ఇంటి యజమాని చనిపోవడంతో కుటుంబ భారమంతా భార్యపై పడడంతో అప్పటికి ఇంకా అప్పులు వాళ్ల ఒత్తిడికి తట్టుకోలేక, పిల్లలను పోషించలేక, సాంఘిక అవమానానికి గురై తాను కూడ ఆత్మహత్య చేసుకోవడంతో పిల్లలు అనాథలుగా మారుతున్నారు. ఈ బాధిత కుటుంబాలలోని పిల్లలు అనేక మంది గ్రామీణ ఉపాధి హామీ పనికి వెళ్తూ, పెట్రోలు బంకుల్లో పనిచేస్తూ, బేకరీలలో, రోజువారి కూలీకి వెళ్తూ తామే కుటుంబాన్ని పోషించవలసి వస్తోంది. ముఖ్యంగా ఆడపిల్లలకు బంధువులు తోడై కనీసం మాధ్యమిక విద్య పూర్తికాక ముందే పెళ్లిళ్లు చేసేస్తున్నారు. ముఖ్యంగా ఈ కుటుంబాలకు కనీస ఆహార భద్రత కరువై ఆకలి చావులకు దగ్గరవుతున్నారు. ప్రస్తుత విషయానికి వస్తే ఆత్మహత్యలు చేసుకున్న రైతు కుటుంబాలు ఇన్ని దుర్భర పరిస్థితులు అనుభవిస్తుంటే ప్రభుత్వం వారికి అందవలసిన ఎక్స్‌గ్రేషియా విషయంలో పూర్తిగా అన్యాయం చేస్తోంది.

1 జూన్ 2004 నాడు వెలువడిన జి.ఒ. ప్రకారం రైతు ఆత్మహత్యగా రుజువు కావాలంటే 13 ఆధారాలు చూపవలసి ఉంటుంది. అవి 1) ఎఫ్.ఐ.ఆర్. 2) పంచనామ, 3) పోస్టుమార్టమ్ రిపోర్ట్, 4) ఫైనల్ రిపోర్ట్, 5) ఫోరెన్సిక్ సైంటిఫిక్ ల్యాబ్ రిపోర్ట్, 6) అప్పుల కాగితాలు, 7) బ్యాంక్ అప్పుల కాగితాలు, 8) డిపెండెంట్ సర్టిఫికెట్, 9) అడ్రస్ ప్రూఫ్, 10) గత మూడు సంవత్సరాల నుంచి భూమి పహణి, 11) స్పెసిమన్ సిగ్నేచర్ ఫ్రం బ్యాంక్, 12) ఎం.ఎల్.వి.సి. రిపోర్ట్, 13) డి.ఎల్.వి.సి. రిపోర్ట్.

అయితే జి.ఒ. 421 ప్రకారం ఈ ఆధారాలు చూపించడానికి నిర్ణీత కాలవ్యవధి ఏమీలేదు. అన్ని ఆధారాలు ఉంటే 1 జూలై 1998 నుంచి ఏ రైతు ఆత్మహత్య చేసుకున్నా ప్రస్తుతం కూడా దరఖాస్తు చేసుకోవచ్చని ఉంది. అయితే వాస్తవానికి ఈ జి.ఒ. ప్రకారం ఏదైనా ఒక గ్రామంలో రైతు ఆత్మహత్య జరిగితే మండల స్థాయిలోని త్రిసభ్య కమిటీ (తహసిల్దార్, సబ్ ఇన్‌స్పెక్టర్, వ్యవసాయాధికారి) సుమోటోగా కేసును స్వీకరించి ప్రత్యక్షంగా ఆ గ్రామానికి వెళ్లి విచారణను జరిపి నివేదిక డివిజన్ స్థాయిలోని త్రిసభ్య (ఆర్.డి.ఒ., డి.ఎస్.పి., వ్యవసాయాధికారి) కమిటీకి పంపించాలి. వీరు తమ రిపోర్టును కలెక్టర్‌కు పంపితే అక్కడి నుండి ఎక్స్‌గ్రేషియా మంజూరు కావాలి. కాని నేటికీ ఆత్మహత్య చేసుకున్న రైతుల్లో ఎక్స్‌గ్రేషియా అందినవారు కేవలం 30 శాతం మాత్రమే. చాలా కేసులు విచారణకు నోచుకోవడం లేదు. విచారణ చేయవలసిన వారు చేయక కేవలం గ్రామస్థాయి అధికారులచే నామమాత్రపు విచారణ చేయించి అవి రైతు ఆత్మహత్యలు కాదని కొట్టి వేస్తున్నారు. చాలా కేసుల్లో ఆత్మహత్యలు చేసుకొన్న రైతులు చేసిన అప్పులు కొడుకు చదువు కోసమో, బిడ్డ పెళ్లి కోసమో చేసిన అప్పులుగా చెప్పి అవి వ్యవసాయం కోసం చేసిన అప్పులు కాదని కేసులను కొట్టివేస్తున్నారు. రైతులు కొడుకులను చదివించాలన్న, బిడ్డ పెళ్లి చేయాలన్న వ్యవసాయం మీద ఆధారపడాలి అని అధికారులు గుర్తెరగక పోవడం గమనార్హం. ఇదిలా ఉండగా ఇప్పటివరకు మేము పనిచేస్తున్న మెదక్, వరంగల్, మహబూబ్‌నగర్ జిల్లాలలో రెండు వందల మంది రైతు ఆత్మహత్య బాధిత కుటుంబాలు అన్ని ఆధారాలతో (13 డాక్యుమెంట్లు) దరఖాస్తు చేసుకున్నాగాని నష్టపరిహారం అందడం లేదు. నష్టపరిహారం ఎందుకు రావడం లేదని కారణం కోసం సమాచార హక్కు చట్టం ప్రకారం దరఖాస్తు చేసినా కారణం తెలియజేయడం లేదు.

ఒక్కొక్క కుటుంబం ప్రభుత్వ కార్యాలయాల చుట్టూ కనీసం ఇరవై సార్లు తిరిగారంటే పరిస్థితిని అర్థం చేసుకోవచ్చు. మరికొందరు స్థానిక దళారుల చేతిలో కూడా నష్టపోతున్నారు. ఆత్మహత్య చేసుకొన్న ఎఫ్.ఐ.ఆర్. కాపీ మొదలు అన్ని విషయాలలోను ఇబ్బంది పడుతున్న ఈ కుటుంబాలకు న్యాయం జరగడం లేదు. కావున ఈ రైతు ఆత్మహత్య చేసుకున్న బాధిత కుటుంబాలు ఆహార భద్రత కరువై ఆకలి చావులు సంభవించకముందే ఈ కుటుంబాలన్నింటికి సిట్టింగ్ జడ్జితో విచారణ జరిపించి న్యాయం చేయాలని డిమాండ్ చేస్తున్నారు. పుష్కరకాలమైనా ఎక్స్‌గ్రేషియా అందని కుటుంబాలు ఎక్స్‌గ్రేషియా ఎండమావేనని అనుకోకుండా ప్రభుత్వ అధికారులను ఆదేశించి, భవిష్యత్తులో రైతు ఆత్మహత్యలు జరగకుండా తగు ప్రణాళికలు రూపొందించాలి.

*(రచయిత కేరింగ్ సిటిజన్స్ కలెక్టివ్ ప్రతినిధి)* వీ

*దొంగ సొమ్ము కొన్నారనే ఆరోపణలతో నిత్యం పోలీసుల అవమానాలకూ, వేధింపులకూ బలవుతున్న స్వర్ణకారుల స్థితిగతులను వివరిస్తున్నారు* **ఏలేశ్వరం వెంకటేశ్**

# రికవరీ కేసులు - స్వర్ణకారుల గోసలు

ఎక్కడైన ఎవరి ఇంట్లోనయిన దొంగతనం, దోపిడి జరిగిందంటే, ఈనాడు బాధపడేది కేవలం బాధితులు మాత్రమే కాదు. స్వర్ణకారులు, బంగారం వ్యాపారులు కూడా ఆందోళన చెందుతారు. దొంగ బంగారం రికవరీ కోసం దొంగను పట్టుకొని పోలీసులు వస్తున్నారని తెలిస్తేనే వీరు హడలిపోతారు. నాలుగు రోజులు, వారం రోజులు ఒక్కొక్కసారి నెలల తరబడి షాపు మూసి మౌనవేదన అనుభవించడం, ఎదురు మాట్లాడలేని నిస్సహాయ స్థితిలో పడిపోవడం సర్వసాధారణమైంది. అది ఒక ప్రాంతంలో కాదు, దేశంలోని అనేక ప్రాంతాలలో కనపడే పరిస్థితి ఇది.

ఈ సందర్భంగా ఒక వాదన వినిపిస్తుంటుంది. తప్పు చేయని వారు, షాప్ మూసి ఎందుకు దాగుంటారు. ఏదో కొంత తప్పుచేసే ఉంటారు. లేకపోతే ఎందుకు భయపడి షాపులు మూసుకుంటారు అన్న మాటలు వినిపిస్తాయి. ఆలోచిస్తే ఇది కొంత నిజమేననిపిస్తుంది. పోలీసులు కూడా మీరు తప్పుచేస్తున్నారు కాబట్టే, భయపడుతున్నారు. లేకపోతే భయమేంటి అంటారు. ఈ వాదన వెనుక ఉన్న లోతును, వాస్తవాలను చూడాలంటే మనం అనేక అంశాలు చర్చించాలి. ముఖ్యంగా ఈ నాటి సమాజంలో పోలీస్ స్టేషన్‌కు వెళ్లడమనే భావననే ఏ విధంగా అర్థం చేసుకుంటున్నారో పరిశీలించాలి. స్టేషన్‌కు రమ్మని పిలిచారని అంటేనే, అదేదో యమ కింకరులు ఉండే ప్రాంతం, మా మానమర్యాదలు మంటలో కలిసాయి అన్న ఆందోళన, భయం ప్రజల్లో నెలకొన్న విధానాన్ని చూడాలి. పెద్ద పెద్ద అధికారుల దగ్గరకి వెళ్లవచ్చు, కలెక్టర్ దగ్గరికి వెళ్లవచ్చు. కాని ఒక ఎస్.ఐ. దగ్గరకు వెళ్లాలంటే మాత్రం భయం కలుగుతుంది. ఏదైన నేరం మోపి ఇంటికి కానిస్టేబుల్ వచ్చాడంటేనే, పంచ ప్రాణాలు గాలిలో తేలినట్టు అనిపిస్తుంది. ఆ మధ్యలో ఒక ఎస్.ఐ. గారు ఒక సమావేశంలో ప్రసంగిస్తూ దొంగను పట్టుకొని, 'దొంగగారు మీరు నేరం చేశారా? అంటే ఒప్పుకుంటాడా? లేదు, తగిన విధంగా దండన చేయాల్సిందే, భయంలో ఉంచవలసిందే' అని అన్నారు. అదే భయంలో ఉంచే విషయాన్ని, పోలీసులు సాధారణ ప్రజల విషయంలో కూడా అలాగే వ్యవహరిస్తున్నారు. అందుకే 'ఎంత మంచివాడైన, పోలీస్ అయినాక ఆ బుద్ధులు రాకుండా ఎలా ఉంటాయి' అన్న అభిప్రాయం ఏర్పడింది. పోలీస్ వ్యవస్థ మీద అపనమ్మకం, భయం కలగడానికి లాకప్ డెత్‌లు, ఎన్‌కౌంటర్ కథలు, డబ్బుంటే చాలు - కేసులు ఉల్టాపల్టా అయ్యే విధానాలు మొదలైనవన్నీ కారణాలవుతున్నాయి.

ఇందులో భాగంగానే స్వర్ణకారులు, బంగారం వ్యాపారులు జంకుతున్నారు. 'బంజరు దొడ్డికి వెళ్లినాక పెండ పెట్టక తప్పదు', దొంగ బంగారం రికవరీ కేసు మీద పొరపాటుగా పోలీసుల కళ్లకు చిక్కితే, ఎంతో కొంత బంగారం కట్టవలసిందే, తప్పు చేశావా లేదా అన్న అంశానికి సంబంధమే లేదు అన్న నిస్పృహ బయలు దేరింది. నిజానికి పోలీస్‌ల దృష్టిలో పడ్డవారెవరు ఎంతో కొంత బంగారం ఇచ్చి వచ్చినవారే గాని, ఏమీ చెల్లించకుండా బయటపడిన వారు అరుదు. ఈ కథలే స్వర్ణకారులను, బంగారం వ్యాపారులను తీవ్ర ఆందోళనకు గురిచేస్తున్నాయి. అందుకే ఒక్కొక్కసారి వారం, పది రోజుల పాటు దుకాణాలు మూసి, మౌనవేదనకు గురయ్యేలా చేస్తున్నాయి. అయితే మూసివేసి, విపరీతంగా ఆందోళన చెందడానికి కొంత వ్యక్తిగత బలహీనతలతో పాటు, నేటి సమాజంలో ఎవరిని ఎవరూ నమ్మలేని ఒకానొక సామాజిక వాతావరణం, సాధారణ ప్రజల మధ్య దెబ్బతింటున్న మానవ సంబంధాలు, సామూహిక శక్తులుగా, సంఘటిత సంఘాలుగా ఎదగలేని స్థితి, చట్టాల పట్ల కొరవడిన జ్ఞానం మొదలైన అనేక అంశాలు తోడ్పడుతున్నాయి.

సంఘాలు బలంగా లేవు, నేటి సమాజంలో వ్యక్తులు ధైర్యంగా లేరు. మానవ సంబంధాలు సవ్యంగా లేవు. కాని రాజ్యాంగంలో చట్టంలో ప్రజలకు అనేక రక్షణలున్నాయి. స్వర్ణకారులు అడపాదడపా చేసిన రాష్ట్రవ్యాప్త ఆందోళనల నేపథ్యంలో 'వీరిని కొట్టడానికి వీలులేదు, భయపెట్టడానికి వీలులేదు, అమానవీయంగా ప్రవర్తించడానికి వీలులేదు' అని ఇచ్చిన ప్రభుత్వ ఉత్తర్వులున్నాయి. అదీ కాకుండా మామూలుగా నేరస్తుల విషయంలోను అనేక రక్షణలు రాజ్యాంగం కల్పించింది. 'రాజ్యం తీసుకొనే చర్య సరయింది, సముచితమైంది అయి ఉండాలి. సమచారం రాబట్టడానికి, ఏ రకమైన హింసను ప్రయోగించినా అది సరయింది, సముచితమైనది, న్యాయమైంది' కాబోదు. అటువంటి చర్య ఆర్టికల్ 21 పై ఆక్రమణాత్మకమైనది. నేరం చేశాడని అనుమానం కలిగించే వ్యక్తిని ప్రశ్నించాల్సిందే అయితే అది సమర్ధనీయం, శాస్త్రీయం అయి ఉండాలి అని రాజ్యాంగం చెబుతుంది. కాని ఆచరణలో వేరుగా ఉంటుంది.

ఈ రికవరీకి సంబంధించిన అనేక కేసులు పరిశీలిస్తే మనకు ఆశ్చర్యం కలుగుతుంది. కొందరు పెద్ద అధికార్ల ఇళ్లల్లో దొంగతనాలు జరిగి ఓ 20 తులాలు పోతే, వారు దాన్ని 40 తులాలు పోయిందని కేసు పెట్టిన సందర్భాలు చాలా ఉంటాయి. ఇక వారు తమ అధికార శక్తులన్నీ ఉపయోగించి, పోలీస్ బాస్‌ల మీద ఒత్తిడి చేయడంతో వారు ఏదో ఒక నెపంతో దొరికిన దొంగను పట్టుకొని, స్వర్ణకారుల, బంగారం దుకాణాల చుట్టూ తిప్పుతారు. వారి మీద వీరి మీద, ఆ ఊర్ల ఈ ఊర్ల కొంత రికవరీ చేసి అనేక మంది అమాయక స్వర్ణకారులను బలి తీసుకొని, ఫలాన దొంగ దొరికాడు ఇంత బంగారం దొరికిందని ప్రెస్ మీట్ పెట్టి మరీ ప్రదర్శిస్తారు. వాస్తవానికి చూస్తే, ఆ వస్తువులు దగదగా మెరుస్తుంటాయి. పాత వస్తువుల్లా, దొంగిలించబడిన వస్తువుల్లా ఉండవు. ఇదంతా బంగారం పోగొట్టుకున్న వాళ్లను ముందే పిలిచి, వారికి కొంత బంగారం ఇచ్చి, కొంతవారిని కలుపుకొమ్మని చెప్పి కొత్తగా చేయిస్తారు. విలేకరుల ముందు, కోర్టు ముందు పెట్టక ముందే ఈ రిహార్సలంతా చేయిస్తారు. ఈ సందర్భంగా పదేళ్ల కింద విజయవాడ కనకదుర్గమ్మ

గుడిలో జరిగిన సంఘటన ఒకటి గుర్తు చేసుకోవాలి. కనకదుర్గమ్మ గుడిలోని కిరీటం దొంగిలించబడింది. తరువాత దానిని రికవరీ చేశారు. ఇదే మాదిరిగా ఓ దొంగను పట్టుకొని ఎక్కడెక్కడో రికవరీ చేసి, అలాంటి కిరీటాన్నే చేయించి, ప్రెస్ ముందు పెట్టారు. కాని, దానిని అంతకు ముందు అమ్మవారికి కానుకగా సమర్పించిన భక్తుడు నేను చేయించిన కిరీటం ఇది కాదు అని స్పష్టంగా చెప్పాడు. ఇలాగే రాష్ట్రం, దేశమంతటా ఇలాంటి సంఘటనలు అక్రమ రికవరీలు జరుగుతున్నాయి.

అయితే చట్టప్రకారం అనుమానం ఉన్న వ్యక్తిని, దొంగ సొత్తును తన వద్ద కలిగి ఉన్న వ్యక్తిని పోలీస్ చట్టం 1860 ప్రకారం అదుపులోకి తీసుకోవచ్చు. కాని, స్వర్ణకారుల విషయంలో గౌరవం, మర్యాద పాటించాలని ప్రభుత్వ ఉత్తర్వులు స్పష్టంగా చెప్పాయి. అది గాకుండా దొంగ సొత్తుని కలిగి ఉన్నారని అనుమానించిన వ్యక్తి, షాప్ దగ్గర పెద్ద మనుషుల సమక్షంలో పంచనామా చేయాలి. ఆ నేరం చేశాడని పెద్ద మనుషులు అంగీకరిస్తేనే అదుపులోకి తీసుకోవాలి. కాని వాస్తవానికి అలా జరగదు. పోలీసులను ప్రశ్నించే వాళ్ళు, న్యాయన్యాయాలను పోలీసుల ముందు చర్చించేవాళ్ళు లేరు. దీంతో పోలీసులు అనుమానితు లను అమానుషంగా జీపుల్లోకి ఎక్కించడం, వివరాలు తెలుపకుండానే, ఏ స్టేషన్ నుండి వచ్చాం, ఏ నేరం ఎంత నేరం మోపుతున్నాం అనే విషయాలు తెలపకుండానే అమానవీయంగా అక్రమంగా అదుపులోకి తీసుకోవడం సర్వసాధారణంగా కనిపిస్తుంది.

రాజ్యాంగంలోని ఆర్టికల్ 22(1) ప్రకారం అరెస్ట్ చేయడానికి కారణాలు తెలుసుకునే హక్కు, తనకు ఇష్టమైన న్యాయవాదిని సంప్రదించి తన కేసు వాదింప చేసుకొనే హక్కు ఉన్నాయి. క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లోని సెక్షన్ 50 ప్రకారం ఎవరినైనా అరెస్ట్ చేసినపుడు, ఆ నేరానికి సంబంధించిన పూర్తి వివరాలు, అతన్ని అరెస్ట్ చేయడానికి గల కారణాలు ఆ వ్యక్తికి పోలీస్ అధికారులు తప్పక చెప్పాలి.

ఇక స్టేషన్ తీసుకుపోయిన వ్యక్తిని ఎట్టి పరిస్థితులలోను చిత్రహింసలకు గురిచేసే హక్కు పోలీసులకు లేదు. చిత్రహింసలు అనే మాటకు రాజ్యాంగంలో సరియైన నిర్వచనం లేకపోయిన, బలహీనునిపై బలవంతుడు చేసే దౌర్జన్యాన్నే చిత్రహింసలు'. మానవ నాగరికతలోని చీకటి దిక్కుకు మరో పేరే ఈరోజు మనం చూస్తున్న చిత్రహింసలని సుప్రీంకోర్టు (డి.కె. బస్ కేసులో) అభిప్రాయపడింది. భారత రాజ్యాంగంలోని ఆర్టికల్స్ 21, 22 ఈ చిత్రహింసల గురించి రక్షణలు కల్పించాయి. అంతేగాకుండా పోలీసులు నేరస్తులను చిత్రహింసలకు గురిచేస్తే నేరం అవుతుంది. భారతీయ శిక్షాస్మృతి సెక్షన్ 330, 331 ప్రకారం వాళ్ళు శిక్షార్హులవుతారు. సెక్షన్ 331 ప్రకారం, ఒక వ్యక్తిని గాయపర్చడం ద్వారా లేదా బాధించడం ద్వారా అతని నుండి గానీ లేక అతనికి దగ్గరైన వ్యక్తి నుండి లేక అతనికి ముఖ్యమైన వ్యక్తి నుండి ఏదైన ఒక ఒప్పందం ప్రకటనను గాని లేక సమాచారాన్ని తెలుసుకునే నిమిత్తం వ్యక్తిని శారీరకంగా గాయపరిచినట్లయితే ఆ వ్యక్తికి ఏడు సంవత్సరాల వరకు జైలు శిక్ష, జరిమాన కూడా విధించబడుతుంది. ఉదా- 'జడ్' చేత నేరాన్ని ఒప్పించడానికి 'ఎ' అనే పోలీస్ అధికారి అతన్ని విపరీతంగా కొట్టాడు. ఆ అధికారి ఈ సెక్షన్ కింద శిక్షార్హుడవుతాడు. అంతేగాకుండా 'జడ్' దొంగిలించిన సొమ్ము ఎక్కడ ఉన్నదో చెప్పాలని 'బి' అనే వ్యక్తిని 'ఎ' అనే పోలీస్ అధికారి హింసించాడు. ఈ సెక్షన్ కింద పోలీస్ అధికారి శిక్షార్హుడవుతాడు. సెక్షన్ 330లో చెప్పినట్లు ఎవరైనా వ్యక్తిని చిత్రహింసలకు గురిచేస్తే సెక్షన్ 331 ప్రకారం, ఆ నేరానికి 10 సంవత్సరాల వరకు జైలు, జరిమాన విధించవచ్చు. కోర్టుకు పోతే, చట్టంలో ఇలాంటి రక్షణలు అనేకం ఉన్నప్పటికీ అనుమానితులపై చిత్రహింసలు జరుగుతూనే ఉన్నాయి. చాలా మందికి ఇది తెలియకపోవడం, పోలీస్‌లపై ఫిర్యాదు చేయాలంటే భయం నెలకొని ఉండడం. సరిగా ఇలాంటి సమకాలీన సందర్భంలోనే స్వర్ణకారులు గజగజ వణుకుతున్నారు. వారాలు, నెలల తరబడి షాపులు మూసి, ఏమి చేయలేని స్థితిలో పడి, ఈ కులంలో ఎందుకు పుట్టామా అని మధనపడుతున్నారు. బంగారం దుకాణదారులు ఉల్లిగడ్డల దుకాణాలు పెట్టుకున్నా బాధలేదు, ఈ బంగారం షాపులు ఎందుకు పెట్టుకున్నామా అని ఆవేదన చెందుతున్నారు.

అయితే దేశంలో దొంగతనాలు జరుగుతున్నాయి. దొంగలను పట్టుకోవలసిందే, రికవరీ చేయవలసిందే. దీనికి ఎవరూ అభ్యంతరం పెట్టరు. కాని ఆ చేసే రికవరీ సక్రమమైందిగా ఉండాలి. పొరపాటుగా జరిగిందని, ఇకముందు ఇలాంటి తప్పులు జరగకుండా జాగ్రత్తగా ఉండాలని, పశ్చాత్తాపం చెందేలా కేసులు వాస్తవాలతో కూడుకొని ఉండాలి. కాని, ఈనాడు జరుగుతున్న అనేక రికవరీ కేసులు అక్రమంగానే ఉంటున్నాయి. చాలా సందర్భాలలో దొరికిన కొందరు దొంగల మీదనే అనేక కేసులు పురమాయించి పొరపాటున ఎవరైనా తెలిసిన వారి ద్వారా వచ్చిన దొంగ ద్వారా 5 గ్రాములో 10 గ్రాములో కొనుగోలు చేస్తే, అది పోలీసుల దగ్గరికి వచ్చేసరికి 100 గ్రా, 200 గ్రాముల బంగారం దాకా చెప్పించ బడుతున్నది. స్వర్ణకారులు నోరు నెత్తికొట్టుకున్న, ఎంత గిజగిజలాడుకున్న కరిగే వారు కనబడడంలేదు. ఈ విషయంలో వీరిని నేరుగా కొట్టకున్నా దొంగలను ముందుకు తీసుకువచ్చి, పచ్చి బూతులు తిడుతూ రక్తం వచ్చేటట్లు కొట్టి, చూసే వారిని భయకంపితులను చేయడం, మానసికంగా మీకు అదే గతి పడుతుంది అనే భావన కలిగించడం ద్వారా పోలీసులు విజయం సాధిస్తున్నారు. సమాజంలో మర్యాదగా, గౌరవంగా బతికే ఈ జీవులు పోలీస్ దెబ్బలు అనే భావాన్ని ఊహించుకొంటేనే ముచ్చెమటలు పట్టి, చివరికి పోలీసులను ప్రాధేయపడి, కాళ్ళు మొక్కి చివరికి బేరం ఓటి కుదుర్చుకొని 200 గ్రా. చెబితే 100 గ్రాములకో, 70 గ్రాములకో సెటిల్ చేసుకొని విచారవదనంతో ఠాణా మెట్లు దిగుతున్నారు. ఇది నేడు ఒక ఆచారమైంది. ఒక తప్పనిసరి పరిస్థితి అయింది. వీళ్ల బతుకు ఒక దిక్కుతోచని నడి సముద్రంలో నావ అయింది.

ఈ స్థితిని చక్కదిద్దేవారు, ఈ అన్యాయాలను, అక్రమాలను, స్వర్ణకారుల గోసలను పట్టించుకొనే వారు కరువయ్యారు. కాని స్వర్ణకారులైన, బంగారు వ్యాపారులైన ఒక విషయం గుర్తుంచుకోవాలి. రక్షణ చట్టాలు చాలా ఉన్నాయి. వాటిని కబళించే పద్ధతులు కూడా చాలానే ఉన్నాయి. వీటికి అతీతంగా ఆలోచించడం నేర్చుకోవాలి. అక్రమ అరెస్ట్, అక్రమ నిర్బంధం ఎవరి విషయంలో జరిగినా ఎక్కడ జరిగినా ఒకే విధంగా స్పందించాలి. తప్పు జరిగిన చోట వీలైనంత మేరకు ప్రశ్నించాలి. బాధితులకు సహకరించాలి. అదేవిధంగా పోలీసులకు దర్యాప్తు సందర్భంగా తోడ్పాడాలి. న్యాయ అన్యాయాలను తెలుసుకునేందుకు ప్రయత్నించాలి. సాధ్యమైనంత వరకు సక్రమంగా, న్యాయంగా వ్యాపారం చేయాలి. అంతే న్యాయంగా సత్యవంతంగా పోలీసులతో మాట్లాడాలి. ధైర్యంగా ఉండాలి. పోలీసుల అక్రమ రికవరీలు ఆగిపోవాలి అంటే, చట్టబద్ధంగా న్యాయబద్ధంగా పోలీసులు ఆలోచించేలా, ఆచరించేలా పైస్థాయి నుండే ఒత్తిడి కావాలి. అందుకు కింది స్థాయిలో స్వర్ణకారులు ఆందోళనలు చేయడం చట్టాల గురించిన అవగాహన పొందడం, రాజకీయంగా సంబంధాలు పెంపొందించుకోవడం జరగాలి. ప్రజల నైతిక మద్దతు కూడా పొందగలగాలి. తప్పకుండా వీటితో చైతన్యం, ఆత్మవిశ్వాసం, సంఘటిత ధైర్యం ఏర్పడు తుందని, అక్రమ రికవరీలు చేయకుండా పోలీసులలో మానసిక పరివర్తన వస్తుందని ఆశిద్దాం.

(రచయిత స్వర్ణకారులు) వీ

భూమికీ, మనిషికీ సంబంధాన్ని నిర్దేశించే రెవెన్యూ పాలన ప్రారంభం, పూర్వాపరాల చరిత్రను వివరిస్తున్నారు

**ఎస్. సరళా వందనం**

# ఆంధ్రప్రదేశ్‌లో రెవెన్యూ పరిపాలన - 5

*(గత సంచిక తరువాయి...)*

**కు**తుబ్‌షాహీల పాలన నుండే రాష్ట్రంలో పరిశ్రమలు చాల ఉచ్ఛ స్థితిలో ఉన్నాయి. పరిశ్రమలలో ఎక్కువగా ఆయుధాగారాలకు, వ్యక్తులకు కావలసిన ఆయుధాలు తయారు చేసేవి. ఎగుమతుల కోసమే ఉత్పత్తి చేసే సిల్క్, మస్లిన్ వస్త్రాల పరిశ్రమలు, బంగారు వెండి జరీతో తయారు చేసే వస్త్రాలవి, చెక్క ఖనిజాలతో అలంకరణ కోసం చేసే వస్తువుల పరిశ్రమలు, వజ్రాల వెలికి తీత, వజ్రాల వ్యాపారం (ఎలిజబెత్ రాణి ధరించే కోహినూర్ వజ్రం గోల్కొండ గనుల నుంచే వెలికి తీశారు), నౌకాయానం కోసం నౌకలు తయారు చేసేవి ముఖ్యంగా ఉండేవి. డచ్ దేశస్తులు క్రీ.శ. 1606లోనే ఒక ఫర్మానా ద్వారా కుతుబ్‌షాహీల నుండి కోరమాండల్ తీరం పొడవునా వస్త్రాల ఎగుమతులు చేసుకోవడానికి అనుమతి పొందారు. ఇందుకోసం రాష్ట్రంలో కొత్తగా 'దాదాని' పద్ధతిని (వస్త్రాల తయారీ దారులకు ముందుగా కొంత మొత్తం నగదు అడ్వాన్స్‌గా ఇచ్చి ఒప్పందం చేసుకోవడం) మొదలుపెట్టారు. డచ్‌వాళ్లు తరువాత గోల్కొండ, మచిలీపట్నం దగ్గర ఫ్యాక్టరీలు కూడా నిర్మించి, స్వదేశీ వ్యాపారస్తు లందరినీ తమ ఆధీనంలోకి తెచ్చుకున్నారు. వీరి వ్యాపారానికి కావలసిన సామాగ్రిని స్థానిక తయారీదారులకు, వ్యాపారస్తులకు మధ్య ఒప్పందాలు కుదర్చడంలో రెవెన్యూ యంత్రాంగం కీలకపాత్ర పోషించేది. ఒకటవ నిజాం పరిపాలనలో అంటే ఎనభై ఏళ్ల తరువాత కూడా ఇదే కొనసాగింది. నిజాం పాలనలో ఆయుధ పరిశ్రమ మాత్రం ఉచ్ఛదశలో ఉంది కానీ, వజ్రాల గనులలో మొత్తం తవ్వకాలు అయిపోవడం వలన ఆ పరిశ్రమ, అధునాతనమైన నౌకలు డచ్చి, పోర్చుగీసు, బ్రిటిష్ వారి దగ్గర ఉండడం వలన నౌకాయాన పరిశ్రమ క్షీణదశకు చేరుకుంది.

నిజాం తన పాలనా కాలం మొత్తంలో భూమిపై అధికారాన్ని కాని, భూమి శిస్తు వసూలు చేసుకొనే అధికారాన్ని కాని అప్పటికే రాష్ట్రంలో ఉన్న డచ్చి, పోర్చుగీసు, బ్రిటిష్ వారికి అప్పగించలేదు. నిజాం తన పాలనలో ఉత్తర భారతం నుంచి వచ్చే పార్శీలు, మార్వాడీలు, బొహ్రాలు, మైమూన్లు, ఖోజాల లాంటి వ్యాపార కుటుంబాల వారిని రాష్ట్రంలో బ్యాంకర్లుగా, వ్యాపారస్తులుగా స్థిరపడడాన్ని మాత్రం అడ్డుకోలేదు. ఈ వ్యాపారస్థులు రాష్ట్రంలో స్థిరపడి ప్రభుత్వంలోని 'పాయిగా నవాబులకు' సైన్యాన్ని పోషించడానికి, ఇతర ఖర్చులకు ముందుగా ధనం ఇచ్చేవారు. ఈ ధనాన్ని వారు తిరిగి తీర్చడానికి బదులుగా వీరి ఆధీనంలో ఉండే భూములపై పన్ను వసూలు చేసుకొనే అధికారాన్ని పొందేవారు. ఇలాంటి విస్తీర్ణాల్ని 'తనఖా మహలత్ జాగీర్లు' అంటారు. పాల్మర్ అండ్ కో కొన్ని జిల్లాలను తనఖా పెట్టుకొని ముప్పై లక్షల రూపాయల పన్నును వసూలు చేసుకొంది. నిజాం పరిపాలన ముగిసే సమయానికే ఉత్తర భారతానికి చెందిన ఈ బ్యాంకర్లు, వ్యాపారస్తులు జాగీర్దార్లుగా, జమీందార్లుగా కూడా ఉండి శిస్తు గ్రహీతలలో 42 శాతం మంది ఉన్నారు. 18వ శతాబ్దాంతానికంతా భూమిపై శిస్తు వసూలు చేసుకొనే అధికారం పొందిన వాళ్లలో 62 శాతం మంది వీరే ఉన్నారు. భూమి శిస్తు వసూలు చేయడానికి కొత్తగా ఈ దళారీ వ్యవస్థ పుట్టుకొచ్చింది. తరువాత కాలంలో వీరే బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ వ్యాపారాలకు రాష్ట్రంలోనూ, దేశంలోనూ ఏజెంట్లుగా మారారు. మొఘలుల కాలం నుంచి రెవెన్యూ యంత్రాంగం గ్రామాలలో పటిష్ఠంగా ఉండడం వలన ఈ ఉత్తర భారత బ్యాంకర్లకు, వ్యాపారస్తులకు రెవెన్యూ యంత్రాంగమే శిస్తు వసూలు చేసి ఇచ్చేది.

నిజాం తన రాజ్యాన్ని విస్తరించుకోవడంతో పాటు పటిష్ఠమైన పాలన నందించడమే ధ్యేయంగా పనిచేశాడు. ఇందుకోసం వ్యవసాయం అభివృద్ధి చెందడమే ముఖ్యమని భావించాడు. అప్పటికే వ్యాపారం చేసుకోవడానికి వచ్చామనే వంకతో దేశాలకు దేశాలకే ఆక్రమించు కోవాలని వచ్చిన పోర్చుగీసు వారిని కాని, బ్రిటిష్ వారిని కాని తన సామ్రాజ్యంలో రాజకీయ పట్టు సాధించడం కోసం కాని, పదవుల పంపిణీలో తలదూర్చడానికి కాని నిజాం అవకాశం ఇవ్వలేదు.

### బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ పాలనలో రెవెన్యూ వ్యవస్థ (1766-1856)

క్రీ.శ. 1748లో నిజాం ఉల్ - ముల్క్ చనిపోయిన తరువాత సింహాసనం కోసం జరిగిన యుద్ధాలలో పోర్చుగీసు వారి సహాయంతో సలాబత్ జంగ్ నిజాంగా ప్రకటించుకున్నాడు. తనకు సహాయం చేసిన పోర్చుగీసు వారికి క్రీ.శ. 1752లో ఉత్తర కోస్తా జిల్లాల నుండి మచిలీపట్నం వరకూ సుమారు నలభై లక్షల రూపాయలు శిస్తు వసూలయే ప్రాంతాలకు శిస్తు వసూలు చేసుకొనే అధికారం ఇచ్చాడు. 14 మే 1759లో క్లైవు పోర్చుగీసువారిని విజయనగర రాజులైన ఆనందరాజుల సహాయంతో ఓడించి, నిజాం దగ్గర నుండి కోస్తా జిల్లాలను 'సనద్'గా పొందాడు. తదనంతరం జరిగిన అధికార పోరాటంలో క్రీ.శ. 1762లో నిజాం ఆలీ బ్రిటిష్ వారి మద్దతుతో నిజాంగా ప్రకటించుకున్న తరువాత 1766లో వీరి మధ్య జరిగిన ఒప్పందం మేరకు ఉత్తర సర్కారు జిల్లాలన్నింటిలో శిస్తు వసూలు చేసుకొనే అధికారాన్ని ఈస్ట్ ఇండియా కంపెనీకి బదలాయించారు.

ఇంతే కాకుండా లార్డ్ క్లైవు 1766లో ఢిల్లీ సుల్తానుతో స్వయంగా సంప్రదింపులు జరిపి విజయనగరం నుండి చెన్నపట్నం (మద్రాసు) వరకు ఈస్ట్ ఇండియా కంపెనీ పేరు మీద ఇనాము పొందాడు. అప్పటి నుండి రాష్ట్రంలోని భూ పరిపాలన (రెవెన్యూ పాలన) యావత్తూ కోస్తా జిల్లాల నుండి చెన్నపట్నం వరకూ ఈస్ట్ ఇండియా కంపెనీ ఆధ్వర్యంలో శిస్తు వసూలు జరిగింది.

అప్పటి వరకూ రాష్ట్ర పాలనలో సైన్యాధికారులే రెవెన్యూ వసూలు చేసే అధికారులుగా, ఒక్కొక్కసారి రెవెన్యూ అధికారులే సైన్యాధికారులుగా, న్యాయాధికారులుగా, అన్ని రకాల విధులు ఒకే వ్యక్తికి ఉండేవి. క్రీ.శ. 1786లో మద్రాసు రాష్ట్రంలో 'ఆంధ్ర బోర్డ్ ఆఫ్ రెవెన్యూ'ను నెలకొల్పారు. ఈ బోర్డ్‌లో ఈస్ట్ ఇండియా కంపెనీ డైరెక్టర్లు సభ్యులుగా ఉండి, బోర్డు గవర్నరు కింద పనిచేసేవారు. ఈ బోర్డ్ పరిధిలో కేవలం భూ పంపిణీ, భూ పరిపాలన, పన్ను వసూలు, పై స్థాయి నుంచి కింది స్థాయి వరకు రెవెన్యూ యంత్రాంగం పరిధిలో ఉండే విధులపై అధికారం ఉండేది. మొట్టమొదటిసారిగా రాష్ట్రంలోని కోస్తా జిల్లాలలో భూ పరిపాలన ఒక ప్రత్యేక శాఖ ఆధీనంలోకి వచ్చింది.

1786లో కార్న్ వాలిస్‌ను గవర్నర్ జనరల్‌గా నియమించారు. ఇతను ఆంధ్రబోర్డ్ ఆఫ్ రెవెన్యూ స్థాపించిన తరువాత 1789లో మొత్తం రెవెన్యూ వసూలు విధానాన్ని తమ బ్రిటిష్ ప్రభుత్వానికి, ఈస్ట్ ఇండియా కంపెనీకి ఆదాయం రావడానికి కావలసిన రీతిలో సమీక్షించాడు. స్వతహాగా కార్న్ వాలిస్ ఇంగ్లాండ్‌లో భూస్వామి కాబట్టి భూమిపై అధికారం జమీందార్లు, జాగీర్దార్ల అధీనంలోనే ఉంటే తమకు రెవెన్యూ వసూలు, ఇతర ఆదాయాలు బాగా వస్తాయని నిర్ణయించుకున్నాడు.

1793లో జమీందార్లను, జాగీర్దార్లను భూమికి స్వంతదారులుగా సెటిల్‌మెంట్ చేసి వీరు పన్ను వసూలును ప్రత్యక్షంగా కంపెనీకి పన్ను కట్టే ఏర్పాటు చేశాడు. అప్పటికే దేశంలోనే 57 శాతం సాగుభూమి ఈస్ట్ ఇండియా కంపెనీ అధీనంలో ఉంది. ఈ పద్ధతి వలన బ్రిటిష్ వారికి క్రమంగా పన్ను వసూలు అవడమే కాకుండా వీరికి విశ్వాసంగా ఉండే ఒక కొత్త తరగతి ప్రజలు దొరికారు. ఈ విధంగా కార్న్ వాలిస్ వ్యవసాయం చేయని భూమిపై అధికారం కలిగి ఉండే ఒక కొత్త దళారీ వ్యవస్థను ప్రోత్సహించాడు.

నిజాం అలీ ఆంధ్ర బోర్డ్ రెవెన్యూ నెలకొల్పిన నాలుగు సంవత్సరాల తరువాత అంటే 1790లో తనకు రాజ్యాధికారం రావడానికి, సింహాసనంలో నిలదొక్కుకోవడానికి సహాయం చేసిన బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీకి వారి సేనలను, రెసిడెంట్ కమిషనర్‌ను తన ఆధీనంలో ఉన్న సికింద్రాబాద్ ప్రాంతంలో ఉండడానికి ఒప్పందం చేసుకుని వారికి ఆ ప్రాంతం పై పూర్తి అధికారాన్ని అప్పగించాడు.

క్రీ.శ. 1800లో రాయలసీమ జిల్లాలను నిజాం దత్తత చేసేటప్పటికి ఈస్ట్ ఇండియా కంపెనీ తన ఆధీనంలో కోస్తా తీరప్రాంత జిల్లాలైన గంజాం, విజగపట్నం, గోదావరి, కృష్ణ, నెల్లూరు జిల్లాలకు ఐదుగురు కలెక్టర్లను రెవెన్యూ పరిపాలన కోసం నియమించింది. రాయలసీమ ప్రాంతాలకు హెడ్‌క్వార్టర్స్‌గా అనంతపూర్‌ను చేసి 24 అక్టోబర్ 1800లో థామస్ మన్రోను ప్రిన్సిపల్ కలెక్టర్‌గా నియమించింది. థామస్ మన్రో కింద నలుగురు సబ్ కలెక్టర్లు హర్పనహళ్ళి, ఆదోని, కడప, కంభంలో పరిపాలనలో అతనికి సహాయం చేయడానికి నియమించారు. 1793లో కారన్ వాలిస్ ప్రవేశపెట్టిన జమీందారీ సెటిల్‌మెంట్ వలన, భవిష్యత్తులో జమీందార్లు బలపడడం వలన ఈస్ట్ ఇండియా కంపెనీకి నష్టం కలుగుతుందని థామస్ మన్రో గ్రహించాడు. ఇప్పటివరకు ఆంధ్ర కోస్తా ప్రాంతంలో జమీందార్లు, జాగీర్దార్లు, రాయలసీమ ప్రాంతంలో పాలెగాండ్లు ముందుగా పేష్కష్ చెల్లించి భూమి శిస్తు వసూలు చేసుకొనే అధికారం పొందేవారు. 1800లో ఈ పద్ధతి రద్దు చేసి, వీరికి నెలవారీ ఉపకారవేతనం (స్టైఫండ్) ఇచ్చే పద్ధతి ప్రవేశపెట్టాడు. ఈ జమీందార్లు, పాలెగాండ్లు దగ్గర నుంచి స్వాధీనం చేసుకున్న భూములను రెండు లేక మూడు సంవత్సరాలు కౌలుకు, అద్దెకు ఇవ్వడం అనే పద్ధతి అవలంబించాడు. కాని థామస్ మన్రో నిర్ధారించిన భూమి శిస్తు చాలా ఎక్కువగా ఉండడం వలన భూములు తీసుకున్న రైతులు రెవెన్యూ కట్టలేక జైళ్లలో పడ్డారు.

1802లో రైతువారీ పద్ధతిలో భూమి పంపిణీ చేయడం మొట్ట మొదటిసారిగా రాష్ట్రంలో ప్రవేశపెట్టాడు. బ్రిటిష్ వారికి భూమిపై శిస్తు కట్టినంత కాలం తమ అధీనంలో ఉన్న భూములను రైతులు అమ్ముకున్నా, కౌలుకిచ్చుకున్నా, వారసత్వంగా అనుభవించినా వారిని భూమి నుంచి ఎవరూ వెళ్లగొట్టరు. ఇలా మొట్టమొదటిసారి భూమి సాగుచేసే రైతు చేతిలో అమ్మకానికి పనికి వచ్చే వస్తువుగా అయింది. ఇందుకోసం 1802లో భూమి రిజిస్ట్రేషన్ క్రమబద్ధీకరణ చట్టం చేశారు. 1803లో భూమి, ఆంధ్ర రెవెన్యూ బోర్డు కేంద్రీకృత పరిధిలో ఉండే విధంగా బోర్డ్ ఆఫ్ రెవెన్యూ క్రమబద్ధీకరణ చట్టం చేశారు. రైతువారీ పద్ధతి ప్రవేశపెట్టి, జమీందార్ల దగ్గర భూమిని స్వాధీనం చేసుకొని ఈస్ట్ ఇండియా కంపెనీ ప్రభుత్వ ఆధీనం (కలెక్టర్లు)లో భూ పంపిణీ చెయ్యడం లాంటి భూ సంబంధ లావాదేవీలు, వాటి క్రమబద్ధీకరణకు వారికి అధికారం ఉండడం కోసం 1803లో కలెక్టర్ల క్రమబద్ధీకరణ చట్టం చేశారు. ఈ చట్టం వలన పరిపాలనలో కలెక్టర్లకు విశేష అధికారాలు ఉండి ప్రతి గ్రామానికి పన్ను నిర్ధారణ, పన్ను వసూలు, ఇతర అన్ని అధికారాలు కలెక్టర్ల ఆధీనంలో ఉండేవి. పరిపాలన అంతా కలెక్టరు చుట్టూ తిరిగే విధంగా అధికారం మారింది.

థామస్ మన్రో తను నిర్ణయించిన భూమి శిస్తు విధానం వలన రైతులు పండిన పంటలో దాదాపు 2/3 వంతు పంట శిస్తు రూపంలో ప్రభుత్వానికి చెల్లించాల్సి రావడం వలన ప్రభుత్వానికి వచ్చే ఆదాయం తగ్గిపోవడం, పొలాలు బీళ్లుగా మారడం చూసి తను ప్రిన్సిపల్ కలెక్టరుగా ఉన్నప్పుడే 1807లో అన్ని రకాల భూములపై తను నిర్ణయించిన పన్నులో 25 శాతం మాఫీ చేయమని ప్రభుత్వానికి సిఫారసు చేశాడు కాని 1821లో తిరిగి మన్రో గవర్నర్ జనరల్‌గా వచ్చే వరకూ ఆ సిఫారసు అమలు కాలేదు. ఈ మధ్యకాలంలో 1817లో సైన్యం ఆధీనంలో ఇంతకు ముందు నిజాం పరిపాలనలో పాయిగా భూములపై భూమిశిస్తును వసూలు చేసుకోవడం కోసం 'రెవెన్యూ రికవరీ' (మిలిటరీ అధికారుల) క్రమబద్ధీకరణ చట్టం చేశారు. 1817లోనే కోర్టు ఆఫ్ డైరెక్టర్ల ఉత్తర్వు ద్వారా రైతువారీ సెటిల్‌మెంట్ వలన భూములు పొందిన వారందరూ ఈస్ట్ ఇండియా కంపెనీ ఆధ్వర్యంలో నడిచే ప్రభుత్వానికి భూమి శిస్తును కట్టాలని కూడా నిర్ణయించడం జరిగింది.

*(ఇంకావుంది)*

*(రచయిత రాష్ట్ర ప్రభుత్వ రెవెన్యూ అధికారి)*
*saralareddy007@gmail.com*

వీ

హైదరాబాద్ డిక్లరేషన్‌లో ప్రకటించిన నూతన మెడికల్ కోర్స్ ప్రజలందరికీ ప్రాథమిక వైద్యం అందడానికి వేసిన ముందడుగుగా అభివర్ణిస్తున్నారు **డా. రాపోలు సత్యనారాయణ**

# కొత్త మెడికల్ కోర్స్‌కు ఆహ్వానం

జనవరి 11-12, 2010న రెండు రోజులపాటు హైదరాబాద్‌లో కేంద్ర ఆరోగ్య మంత్రి గులాం నబీ ఆజాద్ అధ్యక్షతన జరిగిన ఆరోగ్య మంత్రుల జాతీయ సదస్సులో 'హైదరాబాద్ డిక్లరేషన్' పేరిట కీలకమైన నిర్ణయాలు తీసుకొన్నారు. 28 రాష్ట్రాల, కేంద్ర పాలిత ప్రాంతాల ఆరోగ్య మంత్రులు, కార్యదర్శులు పాల్గొన్న ఈ సదస్సులో మూడున్నర సంవత్సరాల బిహెచ్‌ఆర్‌సి కోర్స్ ప్రకటన విప్లవాత్మకమైనది. దీనిపై అర్థవంతమైన చర్చ చేయడమే ఈ వ్యాసం ఉద్దేశం!

దేశంలో ఎన్ని వైద్య విధానాలున్నప్పటికీ ప్రధాన చికిత్సా మార్గంగా అల్లోపతి అగ్రస్థానం వహించింది. యురపియన్ల వలస పాలనలో మన దేశంలోనికి ప్రవేశించింది అల్లోపతి వైద్యం. 1510లోనే గోవాలో రాయల్ హాస్పిటల్ నిర్మాణం జరిగింది. ముందుగా వారి అధికారులు, సిబ్బంది కోసం రప్పించుకొన్న వైద్యాధికారులు, ఏర్పర్చుకొన్న వైద్యశాలలు క్రమంగా ఈ దేశీయుల అవసరాలు కూడా చూడడం మొదలైంది. అలాగే స్థానికులకు శిక్షణ అందించాలనే ఆలోచన కూడా వారికి కలిగింది. 1703లో రాయల్ హాస్పిటల్‌లో సహాయక వైద్య సేవల కోసం శిక్షణ ప్రారంభమైంది. ఆ విధంగా పోర్చుగీస్ వారు అల్లోపతి వైద్య విద్యకు భారతదేశంలో బీజావాపన చేసారు. అది 1801లో - అంటే ఒక శతాబ్ది అనంతరం - మూడు సంవత్సరాల కోర్స్‌గా, అటు పిమ్మట 1821లో 4 సంవత్సరాల కోర్స్‌గా అభివృద్ధి చేశారు.

ఇక భారత భూభాగాన్ని ఏకఛత్రాధిపత్యంలోనికి తెచ్చుకున్న బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ వారు 1822లో కలకత్తాలో మొదటి మెడికల్ స్కూల్ ప్రారంభించారు. పండిత్ మధుసూదన్ గుప్తా ఈ కోర్స్‌లో ఉత్తీర్ణుడైన తొలి వ్యక్తి. 1826లో బొంబాయిలో, 1827లో మద్రాస్‌లో కూడా వైద్య పాఠశాలలను నెలకొల్పారు. వీటిలో శిక్షణ 3 సంవత్సరాలు ఉండేది. దీనిని లైసెన్సియేట్ కోర్స్ (ఎల్.ఎం.ఎస్.) అనే వారు. బోధన మొదట్లో స్థానిక భాషల్లో ఉండేది. అస్థి పంజరాలు, అవయవ నమూనాలు, చిన్న జంతువులు, పోస్ట్‌మార్టం పరీక్షలను శరీర నిర్మాణ బోధనకు వినియోగించుకొనే వారు. 1836లో శవ ఛేదనను అనాటమీ టీచింగ్‌కు మొదటి సారిగా వినియోగించారు. 1833లో సర్ విలియం బెంటింగ్ కమిటీ భారతదేశంలో వైద్య విద్యాభివృద్ధి కోసం చేసిన సూచనల మేరకు కలకత్తా, మద్రాస్, బొంబాయిలలో తొలి వైద్య కళాశాలలు ప్రారంభించారు. 1835లో కలకత్తాలో 4 సంవత్సరాల ఎం.బి. కోర్స్‌తో మొదటి మెడికల్ కాలేజీ ఏర్పాటైంది. 1845లో ఎం.బి. కోర్స్‌ను 5 సంవత్సరాలకు పెంచారు. స్కూల్స్‌లో ఉత్తీర్ణులైన వారిని హాస్పిటల్ అసిస్టెంట్స్‌గా నియమించుకొనే వారు. వీరి కోసం మిలిటరీ / సివిల్ సబ్ అసిస్టెంట్ సర్జన్ అనే క్యాడర్‌ను సృష్టించారు. తెలుగు ప్రాంతానికి వస్తే హైదరాబాద్ సమీప బొల్లారంలో 1835లో, నెల్లూరులో 1876లో, విశాఖలో 1902లో మెడికల్ స్కూల్స్ ఏర్పాటైనాయి. మెడికల్ కాలేజీ విశాఖపట్టణంలో 1923లో ప్రారంభమైంది. భారతదేశంలోని వైద్య పట్టాలను గ్రేట్ బ్రిటన్‌లోని జనరల్ మెడికల్ కౌన్సిల్ గుర్తించేది. 1934లో ఇండియన్ మెడికల్ కౌన్సిల్ ఏర్పాటై ఆ బాధ్యతలను స్వీకరించింది. లైసెన్సియేట్ మెడికల్ ప్రాక్టీషనర్స్ కోసం మెడికల్ కౌన్సిల్ 1937లో కాండెన్స్‌డ్ ఎం.బి.,బి.యస్. కోర్స్‌కు రూపకల్పన చేసింది.

భారతదేశంలో భోరే కమిటీ (1946)తో పాటు, ముదలియార్ కమిటీ (1961), శ్రీ వాస్తవ కమిటీ (1975), బజాజ్ కమిటీ (1989) వంటి కమిటీలు వైద్య విద్య గురించి పలు సిఫార్సులు చేసాయి. స్వాతంత్ర్యానంతరం 1952లో దేశమంతటా ఒకే మౌలిక అర్హత ఉండాలని మెడికల్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా ప్రతిపాదించింది. ఫలితంగా ఇండియన్ మెడికల్ కౌన్సిల్ చట్టం 1956 సవరణ ప్రకారం రిజిస్టర్డ్ మెడికల్ ప్రాక్టీషనర్ కావడానికి ఎం.బి.బి.యస్. కనీస అర్హతగా నిర్ణయమైంది.

ప్రస్తుతం దేశంలో 262 అల్లోపతి వైద్య కళాశాలలు ఉన్నాయి. ఏటా 29 వేల మంది పట్టభద్రులు అవుతున్నారు. అయినప్పటికీ 1665 జనాభాకు అల్లోపతి రిజిస్టర్డ్ మెడికల్ ప్రాక్టీషనర్స్ ఒకరు మాత్రమే. అదే యునైటెడ్ కింగ్‌డంలో చూస్తే 166.5కు ఒకరు ఉన్నారు. ప్రపంచ ఆరోగ్య సంస్థ లక్ష జనాభాకు 20 మెడికల్ ప్రాక్టీషనర్స్ ఉండాలని సూచించింది. కానీ ఇక్కడ లక్షకు 60 మంది ఉన్నారు. ఉన్న వారిలో 85 శాతం పట్టణ ప్రాంతాలకే పరిమితం కాగా పల్లెలు తల్లడిల్లుతున్నాయి. బుల్లెటిన్ ఆన్ రూరల్ హెల్త్ స్టాటిస్టిక్స్ (2006) ప్రకారం దేశంలో 7.5 శాతం ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో వైద్యాధికారులు లేకుండా నడిపిస్తున్నారు. 17.7 శాతం కేంద్రాలలో ఫార్మసిస్టులు లేరు. ఫార్మసీ చట్టం 1948 సెక్షన్ 42కు ఇది వ్యతిరేకమే కాక ఔషధ జనిత అవాంతరాలు వాటిల్లుతున్నాయి.

'తప్పకుండా మన వ్యవస్థలో ఏదో లోపం ఉన్నది... వైద్య, విద్యా రంగ నాయకులు ఈ చదువుల ప్రణాళిక గురించి గంభీరమైన ఆలోచన చేయాలి' 20 మార్చ్ 1980న కొత్త ఢిల్లీలో లేడీ హార్డింగ్ మెడికల్ కాలేజ్ వ్యవస్థాపక దినం సందర్భంగా ప్రసంగిస్తూ ఆనాటి ప్రధాని ఇందిరాగాంధీ అన్నారు. 1981 జనవరిలో హైదరాబాద్‌లో జరిగిన ఇండియన్ అసోసియేషన్ ఫర్ ద అడ్వాన్స్‌మెంట్ ఆఫ్ మెడికల్ ఎడ్యుకేషన్

20వ వార్షిక మహాసభలో లక్ష్మణ సామి ముదలియార్ స్మారక ప్రసంగం చేస్తూ 'మన దేశానికి సరిపోయే వైద్య విద్యకు రూపకల్పన చేసి, వైద్య సేవలు అందించడానికి మౌలిక వైద్యుడిని తయారు చేయాలి... లేకపోతే మన నిష్క్రియా పరత్వాన్ని చరిత్ర క్షమించదు' అన్నారు ప్రముఖ న్యూరో సర్జన్ బి. రామమూర్తి. అదే మహాసభలో 'గ్రామీణ ఆరోగ్యం - వైద్య విద్య' అనే అంశంపై కె. ఎన్. రావు స్మారక ఉపన్యాసం చేస్తూ 'వైద్య విద్య అవసరాల ఆధారంగా ఉండాలి. ఈ దిశగా ఏదో ఒకటి చేయడానికి ఇదే తరుణమైన సమయం' అని అన్నారు రాష్ట్ర వైద్య విద్యా సంచాలకులు డి. భాస్కర్ రెడ్డి. 1988లో ఆగ్నేయ ఆసియా ప్రాంతీయ వైద్య విద్యా మహాసభలో రీ ఓరియెంటేషన్ ఆఫ్ మెడికల్ ఎడ్యుకేషన్ (రోమ్) శీర్షికతో ప్రారంభోపన్యాసం చేస్తూ నాటి కేంద్ర మానవ వనరులు, ఆరోగ్య కుటుంబ సంక్షేమశాఖల మంత్రి పి.వి. నరసింహారావు 'ప్రస్తుతం మనకు సరిపడే జాతీయ వైద్య విద్యా రూపకల్పన కోసం ప్రయత్నిస్తున్నాం. ఈ తరుణంలో మన సమాజానికి అనువైన, మన అవసరాలకు అనుగుణంగా, ఖర్చు భరించగలిగేటటువంటి పరిష్కారాలతో కూడిన వైద్య విద్య కోసం సలహాలు ఇస్తారని సమ్మకంతో ఉన్నాను' అని అభిప్రాయాలను ఆహ్వానించారు. బహమస్‌లో జరిగిన 8వ కామన్ వెల్త్ మినిస్టర్స్ కాన్ఫరెన్స్‌లో పి.వి. నరసింహా రావు పాల్గొని "తదుపరి కొద్ది సంవత్సరాలలో మధ్య స్థాయి వైద్య ఆరోగ్య నిపుణులను పెద్ద ఎత్తున తయారు చేయవలసి ఉంది అని నొక్కి చెప్పారు. పి.వి. ప్రధాని అయిన తరువాత 1992 ఏప్రిల్ 1న మొదలైన 8వ పంచవర్ష ప్రణాళికలో నేషనల్ ఎడ్యుకేషన్ పాలసీ ఇన్ హెల్త్‌సైన్సెస్ అవసరాన్ని ప్రణాళికా సంఘం ప్రస్తావించింది. 2005లో దేశ వ్యాప్తంగా అమలులోనికి వచ్చిన 'జాతీయ గ్రామీణ ఆరోగ్యమిషన్' వారి టాస్క్ ఫోర్స్ ప్రాథమిక ఆరోగ్య సాధనకు 3 సంవత్సరాల కోర్స్ రూపకల్పన చేసి అల్లోపతి కమ్యూనిటీ హెల్త్ ప్రాక్టీషనర్స్‌ను తయారు చేయాలని చెప్పింది. వీరు ప్రత్యేకించి గ్రామీణ ప్రాంతాలకు పరిమితం అయ్యే విధంగా శిక్షణ ఉండాలని తెలిపింది. 2001లో ఛత్తీస్‌గఢ్ ముఖ్యమంత్రి అజిత్ జోగి ప్రభుత్వం ఆ రాష్ట్ర అవసరాలు తీర్చడానికి 3 సంవత్సరాల 'డిప్లొమా ఇన్ మెడిసిన్' కోర్స్ ప్రారంభించింది. కాని మెడికల్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా గుర్తింపు ఇవ్వ నిరాకరించింది.

మన రాష్ట్రంలో గ్రామాల్లో వైద్య విద్యార్హతలు లేని అన్ రిజిస్టర్డ్ మెడికల్ ప్రాక్టీషనర్స్‌ను గుర్తించడానికి 2008లో ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖరరెడ్డి తీసుకొన్న చొరవ చారిత్రాత్మకమైనది. ఎం.బి.బి.ఎస్ పట్ట భద్రుల నుండి వ్యతిరేకత వచ్చినా, ప్రత్యామ్నాయ పరిష్కారాలు ఆలోచించాడు. ఒక సంవత్సరం పాటు శీఘ్ర శిక్షణ ఇచ్చి కమ్యూనిటీ పారా మెడిక్స్‌గా గుర్తించడానికి నిర్ణయం తీసికొన్నాడు. 2009 నుండి తరగతులు ప్రారంభించాడు. ఇంటర్మీడియెట్ సైన్స్ అర్హత ఉన్న వారికి, అనుబంధ వైద్య వృత్తులలో ఉన్న వారికి బి.ఎస్‌సి. హెల్త్ సైన్స్ కోర్స్ ప్రారంభించే ఆలోచన చేసాడు. రిజిస్ట్రేషన్ కోసం పారా మెడికల్ బోర్డ్‌ను చట్టం ద్వారా ఏర్పాటు చేసాడు.

2010 జనవరిలో కేంద్ర ఆరోగ్య శాఖ గ్రామీణ వైద్యం కోసం మూడున్నర సంవత్సరాల బ్యాచెలర్ ఆఫ్ రూరల్ మెడిసిన్ అండ్ సర్జరీ (బి.ఆర్.ఎం.ఎస్.) అనే మెడికల్ డిగ్రీని ప్రతిపాదించింది. గ్రామీణ వైద్యం పట్ల ఆత్రుత గల వారు దీనిని హర్షించగా, రిజిస్టర్డ్ మెడికల్ ప్రాక్టీషనర్ల సంఘమైన ఇండియన్ మెడికల్ అసోసియేషన్ తీవ్రంగా వ్యతిరేకించింది. డిగ్రీలో సర్జరీ అనే పదం ఉన్నందువల్ల శస్త్ర చికిత్సలు చేసే ప్రమాదమున్నదని అభ్యంతరం చెప్పింది. అందులోని సర్జరీ పద నిర్వచనాన్ని క్లినికల్ సర్జరీగా కాకుండా, ఆపరేటివ్ సర్జరీ అని భ్రమించింది. దీనితో 2010 ఫిబ్రవరిలో దేశంలోని వైద్య కళాశాలల ప్రిన్సిపల్స్, వైద్య విద్యా సంచాలకులు కలిసి కొత్త ఢిల్లీలో రెండు రోజులు చర్చించి డిగ్రీలోని మెడికల్, సర్జరీ రెండు పదాలను తొలగించి బ్యాచెలర్ ఆఫ్ రూరల్ హెల్త్ కేర్ అని ఖాయం చేసారు.

హైదరాబాద్ డిక్లరేషన్‌లో ఏకగ్రీవ ప్రకటన చేసినప్పటికీ బిచ్ఆర్‌సి కోర్స్ వాస్తవ రూపం దాల్చడానికి అరిష్టాలు, అవరోధాలు ఉంటాయి. మార్పులు, చేర్పులు తప్పవు. ఈ గ్రాడ్యుయేట్లకు ఏ క్యాడర్ ఇవ్వాలి అనే సంశయం తలెత్తుతుంది. ఎం.బి.బి.ఎస్. గ్రాడ్యుయేట్లు ఈ కొత్త పట్ట భద్రులను వారి డిగ్రీలో మెడిసిన్ అని లేనందున పారా మెడికల్‌గా గుర్తించాలని పట్టు పట్టవచ్చు. కొత్త కోర్స్‌ను డెడ్ ఎండ్‌గా ఉంచాలా, గ్రాడ్యుయేట్ కోర్స్ అన్నందువల్ల భవిష్యత్తులో పోస్ట్ గ్రాడ్యుయేషన్ అవకాశాలు కల్పించాలా అనే శంక ఉత్పన్నం అవుతుంది. పిజి అవకాశం కల్పిస్తే ఎంబి,బిఎస్ తో సమానమైన అవకాశాలా? ప్రత్యేక పిజిలు రూపకల్పన చేయాలా? ఇలా చాలా సందేహాలు!

వివాదాలకు ఆస్కారం లేకుండా కోర్స్ నామకరణంలోనే మార్పు అవసరం. ఇందుకోసం మరికొన్ని ప్రొఫెషనల్ కోర్స్‌లను పరిశీలిద్దాం! ఫార్మసీలో డిప్లొమా, గ్రాడ్యుయేషన్, పోస్ట్ గ్రాడ్యుయేషన్, డాక్టొరల్, పోస్ట్ డాక్టొరల్; నర్సింగ్‌లో సర్టిఫికెట్ (ఎఎన్ఎం / ఎంపిఎచ్‌డబ్ల్యు-ఎఫ్), డిప్లొమా, గ్రాడ్యుయేషన్, పోస్ట్ గ్రాడ్యుయేషన్, ఇటీవల డాక్టొరల్ కూడా; అదే ఇంజనీర్‌లో సర్టిఫికేట్ (ఐటిసి), డిప్లొమా, గ్రాడ్యుయేషన్, పోస్ట్ గ్రాడ్యుయేషన్, డాక్టొరల్ అనే క్రమం కనిపిస్తుంది. అలాగే మెడిసిన్‌లో కూడా సర్టిఫికెట్, డిప్లొమా, గ్రాడ్యుయేషన్, పోస్ట్ గ్రాడ్యుయేషన్, సెకండ్ పోస్ట్ గ్రాడ్యుయేషన్ లేదా డాక్టొరల్ అనే ఆరోహణ క్రమం ఉంటే మన దేశ ప్రాంత అవసరాలకు తగిన మెడికేర్ వ్యవస్థ రూపదిద్దు కొంటుందనడంలో సందేహం లేదు. అందుకు మరికొన్ని సూచనలు:

**ఎ) సర్టిఫికెట్ కోర్స్ ఇన్ మెడిసిన్ :** గ్రామాలలో అన్ రిజిస్టర్డ్ మెడికల్ ప్రాక్టీషనర్స్ అర్హతలు లేకుండానే సేవలు అందిస్తున్నారు. వీరిని నియంత్రించాలంటే శిక్షణ ఇచ్చి సర్టిఫికెట్ ప్రదానం చేయాలి. ఇది కేవలం గ్రామ ప్రాంతాలలో, స్వయం ఉపాధికే పరిమితం! ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిటీ పారామెడిక్స్ శిక్షణ పేరుతో 2009 నుండి ఈ సర్టిఫికెట్ కోర్స్ నడుస్తున్నది. ఇలాగే దేశంలోని అన్ రిజిస్టర్డ్ మెడికల్ ప్రాక్టీషనర్స్ అందరికి సర్టిఫికెట్‌లు ఇచ్చి ఆ తరువాత శిక్షణ కార్యక్రమాన్ని రద్దు చేయవచ్చు.

**బీ) డిప్లొమా కోర్స్ ఇన్ మెడిసిన్ :** వైద్య శాస్త్రంలో డిప్లొమేట్ / లై సెన్సియేట్ కోర్స్‌లు మనకు గతంలో ఉన్నవే! పునరుద్ధరణ చేసుకోవడమే మన కర్తవ్యం! బిచ్ఆర్‌సి కొత్త కోర్స్ భవిష్యత్‌లో మరిన్ని చిక్కులకు దారి తీయకుండా ఉండాలంటే డిప్లొమా స్థాయిలో ఉండడం మంచిది. ఏ కొత్త కోర్స్‌కు రూపకల్పన చేసినా ఆ మార్పులను ఇండియన్ మెడికల్ కౌన్సిల్ అక్ట్, ఇండియన్ మెడికల్ డిగ్రీస్ అక్ట్‌లకు సవరణలు చేయవలసి ఉంటుంది. ఈలోగా కొత్త కోర్స్ నామకరణం పై తుది నిర్ణయం తీసికోవాలి. ఇంటర్మీడియెట్ సైన్స్ తరువాత మూడున్నర సంవత్సరాల డిప్లొమా కోర్స్ ఇన్ మెడిసిన్ / డిప్లొమా ఇన్ మెడిసిన్ అండ్ సర్జరీ చేసిన వారు గ్రామీణ ప్రాంతాల్లో స్వయం ఉపాధి కొరకు, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో సివిల్ సబ్ అసిస్టెంట్ సర్జన్ అనే కొత్త క్యాడర్‌లో నియామకానికి అర్హులవుతారు. మొదటగా గ్రామీణ

*వస్తుగతమైన, శాస్త్రీయమైన ఆధారాలు లభించాక పురాతన నమ్మకాలు కనుమరుగు అయిపోయాయనీ, తెలియని విషయాలు ఆ కాలానికి మిస్టరీగానే ఉంటాయనీ అంటున్నారు* **డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# 'అతీంద్రియ' పరిశోధనల చరిత్ర

మనసులోని ఆలోచనలు కార్యరూపం దాల్చగలవని మనుషులు ఆదిమ యుగంలోనే గ్రహించారు. మన శరీరాలకు సంబంధించినంత వరకూ 'అనియంత్రితం'గా కూడా అనేక ముఖ్య కార్యకలాపాలు జరుగుతూనే ఉంటాయనే విషయం ఆధునిక విజ్ఞానం ద్వారానే మనకు తెలిసింది. బతికున్నన్నాళ్లూ మన గుండె ఆగకుండా కొట్టుకుంటూ ఉందంటే అందుకు చిన్న మెదడు నుంచి 'కొట్టుకో, కొట్టుకో' అని ఎప్పటికప్పుడు హెచ్చరికలు అందుతూ ఉండడమే కారణం. ఇలాంటి అత్యవసర ప్రక్రియలు మన నియంత్రణకు లోబడకుండా, నిద్రావస్థలోనూ, అపస్మారకస్థితిలోనూకూడా చావకుండా ప్రాణుల మనుగడకై ప్రకృతిలో జరిగిన ఏర్పాటు ఇది. ఈ విషయాలు 'విద్యాధికులైన' వారందరికీ స్కూల్లోనే నేర్పుతారు. మన సిద్ధులూ, యోగులూ కొందరు ప్రయత్నపూర్వకంగా సాధనచేసి సామాన్యంగా మన అదుపులో ఉండని ప్రక్రియలపై కొద్దిపాటి నియంత్రణ సాధించినట్టుగా కొన్ని ప్రయోగాల్లో తెలుస్తోంది. మహేశ్‌యోగి తదితరుల ప్రయత్నాల్లో రక్తపోటు తగ్గడం, నాడి కొట్టుకునే వేగంలో మార్పులు వగైరా అంశాలపై పరిశోధనలు జరిగాయి. ఈ పద్ధతిలో మనకు 'తెలియకుండా' మన శరీరాల్లోనూ, ఆలోచనల్లోనూ ఏదైనా మార్పు కలిగితే అది ఈనాటి ఆధునికులకుకూడా అద్భుతంగా అనిపిస్తుంది.

మన మెదడులో ఎన్నో పొరలుంటాయి. వేలకోట్లాది నాడీ కేంద్రాల మధ్య లెక్కలేనన్ని లింకులుంటాయి. ఎగిరే బంతిని ఎవరైనా కొట్టగలరు కాని మేటి ఆటగాళ్లు అందులోనే అద్భుతమైన పటిమ చూపుతారు. మెదడుకూ, దేహానికీ అసామాన్యమైన కోఆర్డినేషన్ కనబడుతుంది. హిప్నాటిజంలో సుప్త చేతనావస్థలో మెదడు పనిచేసే తీరు వింతగా అనిపిస్తుంది. అయినా ఇలాంటి విషయాలలో మనకు 'దైవాంశ' ఏదీ కనబడదు. మానసికంగా లొంగిపోవడానికి సిద్ధంగా ఉన్న భక్తులకి మాత్రం ఎవడో బాబా చెప్పే ప్రవచనం వినగానే ఒళ్లు

---

ప్రాంతాలలో పని చేస్తున్న ఫార్మసిస్టులు, ఆసక్తి గల నర్సులకు ఈ కోర్సులో ప్రవేశం కల్పించి ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో ఖాళీలను భర్తీ చేయాలి. చాలా దేశాలలో ఫార్మసిస్టులను, నర్సులను నాన్ ఫిజీషియన్ క్లినిషియన్స్‌గా గుర్తించి మెడికల్ ప్రాక్టీస్‌కు అనుమతి ఇచ్చిన అనుభవాలు మనం చూస్తున్నాం. తాజా ప్రవేశాలను గ్రామీణ విద్యార్థులకే పరిమితం చేయాలి. అందులో 1/3 వంతు మహిళ కోటా ఉండాలి.

**సి) గ్రాడ్యుయేషన్ ఇన్ మెడిసిన్ :** ప్రపంచ ఆరోగ్య సంస్థ స్టడీ గ్రూప్ (1962) మెడికల్ గ్రాడ్యుయేషన్ 4 సంవత్సరాల అధ్యయనం, 1 సంవత్సరం అభ్యాసం కలిపి 5 సంవత్సరాల ఏకరూపత గల కోర్సుగా ఉండాలని సిఫార్సు చేసింది. మెడికల్ గ్రాడ్యుయేట్ కోర్సులు వివిధ దేశాలలో వివిధ పేర్లతో ఉన్నప్పటికీ, మన దేశంలో మొదట ఎంబి తో ప్రారంభమై, అనతి కాలంలోనే ఎం.బి.బి.ఎస్.గా స్థిరపడింది.

**సి. 1) కాండెన్స్‌డ్ ఎం.బి.బి.ఎస్. :** గ్రాడ్యుయేట్ ఫార్మసిస్టులకు, ఉత్సాహవంతులైన గ్రాడ్యుయేట్ నర్సులకు, రాబోయే డిప్లొమేట్ మెడికల్ ప్రాక్టీషనర్లకు పి.హెచ్.సి.లలో పనిచేసే కట్టడితో కాండెన్స్‌డ్ ఎం.బి.బి.ఎస్. శిక్షణ ఇచ్చి సివిల్ అసిస్టెంట్ సర్జన్ క్యాడర్‌లో నియమించాలి.

**సి. 2) గ్రాడ్యుయేట్ స్పెషాలిటీ కోర్సులు :** ఇంజనీరింగ్ గ్రాడ్యుయేషన్‌లో చాలా బ్రాంచ్‌లున్నాయి. వైద్య శాస్త్రంలో కూడా ఎం.బి.బి.ఎస్., బిఫార్మ, బిడిఎస్ అనే ప్రధాన యూజీ కోర్సులున్నాయి. గత కొన్నేండ్లుగా ఫిజియోథెరపీ అందుబాటులోనికి వచ్చింది. వైద్యశాస్త్రంలో పిజి స్పెషలిస్ట్ తయారుకావడానికి ఇంటర్మీడియెట్ తరువాత సుమారు 8 సంవత్సరాలు, సూపర్ స్పెషలిస్ట్ కావడానికి 11 సంవత్సరాలు పడుతుంది. విలువైన సమయాన్ని, ధనాన్ని పొదుపు చేయటానికి నేత్ర వైద్యం, చర్మవైద్యం, అస్థి వైద్యం, ఉర్ధ్వాంగ చికిత్స, పుపుస వ్యాధులు, అనెస్తీషియా వంటి యూజీ స్థాయి కోర్సులు ప్రారంభిస్తే బాగుంటుంది.

**డి) మెడికల్ రిజిస్ట్రేషన్ :** ప్రైవేట్ వైద్యశాలల నమోదు నియంత్రణ చట్టం 2010 అమలు పరచాలంటే వైద్య విద్యతో పాటుగా మెడికల్ రిజిస్ట్రేషన్ ప్రక్రియలో సంస్కరణలు అవసరం. రాష్ట్ర వైద్య మండలిలో మెడికల్ గ్రాడ్యుయేట్లకు 'ఎ' శ్రేణి, డిప్లొమేట్లకు 'బి' శ్రేణి, సర్టిఫైడ్ ప్రాక్టీషనర్లకు 'సి' శ్రేణి రిజిస్ట్రేషన్ ఇవ్వాలి. అలాగే పిజి స్పెషలిస్ట్‌లకు ఎ1 సూపర్ స్పెషలిస్ట్‌లకు 'ఎ2' శ్రేణి రిజిస్ట్రేషన్ ఇచ్చి రిజిస్టర్డ్ మెడికల్ ప్రాక్టీషనర్స్ స్థాయి నిర్ధారణ చేయవచ్చు.

1978 ఆల్మా ఆటా డిక్లరేషన్ ఇచ్చిన 2000 సంవత్సరం నాటికి అందరికి ఆరోగ్యం నినాదం తెరమరుగైంది. గ్లోబల్ విజన్ 2020, మిలీనియం డెవలప్‌మెంట్ గోల్స్ జపం వినబడుతోంది. ఏ సంస్కరణ చేసినా ప్రజా ప్రయోజనమే ప్రథమ ప్రాధాన్యంగా ఉండాలి. కొత్త మెడికల్ కోర్సుతో అందరికి వైద్యం అందడానికి సరియైన దిశలో కార్యాచరణ అలస్యంగానైనా ఆరంభమైనదని చెప్పవచ్చు.

*(రచయిత ఫార్మసిస్ట్, పబ్లిక్ హెల్త్ నిపుణులు)* వి

పులకరించి పోతుంది. దాంతో ఆధ్యాత్మికం, ఆవకాయ అంటూ రెచ్చిపోయి 'సకల' సృష్టి రహస్యాలూ తెలిసిపోయినట్టు ప్రచారం చేస్తారు.

ఎవరూ పలకకుండా వినబడే శబ్దాలూ, ఎదుట నిజంగాలేని 'దృశ్యాలూ' మనకు చాలా గాఢమైన భ్రాంతినీ, అనుభూతినీ కలిగిస్తాయి. వీటికి కారణం ఆధ్యాత్మికవిషయాలమీద నిజాయితీతో కూడుకున్న నమ్మకమే కావచ్చు. మత ప్రచారానికి తోడ్పడే ఈ అనియంత్రిత నాడీ సంకేతాలు మెదడు పైపొర నియోకార్టెక్స్ మీద ప్రసరించే ఎలెక్ట్రికల్ 'ఘోష' మాత్రమే అని మనకు నమ్మబుద్ధి కాదు. దీనికి తోడయేవి చావు తరవాత ఏమవుతుందనేదాని గురించిన అపోహలు. ఆధునిక దృక్పథం అవలంబించ ప్రయత్నించేవారిలో కొందరు మెదడుకు 'వెలపల' ఏదో ఉందనీ, మన అవగాహనలో కొంతైనా మెదడుతో సంబంధం లేని ఆ 'తరంగాలను' అందుకునే ప్రక్రియలో టెలిపతీ వంటి నిదర్శనాలు కనబడతాయనీ భావిస్తారు.

ప్రాణం తరవాత మనుషులకు అతిముఖ్యమైనది అవగాహనే. ఏదైనా మన అవగాహనకు లోనవుతోందా లేదా అన్న ప్రశ్న మనుషులను చాలా బాధిస్తూ ఉంటుంది. మనకు ఎంత ప్రధానంగా అనిపించినప్పటికీ ఈ అవగాహన అనేదానికి ప్రకృతిలో ఎటువంటి ప్రాముఖ్యతా ఉన్న దాఖలాలు లేవు. విశ్వంలో జరిగిన, జరుగుతున్న సంఘటనలను 'గుడ్లప్పగించి' ఎవరూ చూడలేదు, చూడ నవసరమూ లేదు.

దయ్యాలూ, భూతాలూ, పూనకాలూ, చేతబడులూ, సోది చెప్పడాలూ వగైరాలంటే మనదేశంలో అనాదిగా నమ్మకం ఉంది. ఈ పద్ధతిలో కాకుండా పంతొమ్మిదో శతాబ్దం అంతంలో పాశ్చాత్య దేశాల్లో అతీంద్రియ విషయాల గురించిన 'శాస్త్రీయ' ఆసక్తి మొదలైంది. ఇవి మన అయిదు ఇంద్రియాలకూ అతీతమైనవిగా అనిపించిన సంగతులు. ఈ 'సైకిక్ సొసైటీలు' తర్కానికి అందవనిపించిన విషయాల మీద పరిశోధనలు చెయ్యబూనుకున్నాయి. పేరాసైకాలజీ అనే ఒక మనస్తత్వ శాస్త్రం వంటిది మొదలైంది. మనకు తెలిసిన భౌతిక, జీవశాస్త్రాలకూ, మనస్తత్వ విశ్లేషణకూ లోబడని విచిత్ర సంఘటనలను దీని పరిధిలోకి తీసుకోవాలని ప్రయత్నించారు. ఇంద్రియాలకు అతీతంగా అనిపించే అవగాహనా (ఎక్స్ట్రా సెన్సరీ పర్సెప్షన్), భౌతికమైనవి కావనిపించే శక్తులద్వారా దూరాన ఉన్న వస్తువులను కదిలించడం వగైరాలు ఇటువంటివి. వీటి గురించి చాలామంది ఆసక్తి కొద్దీ పరిశోధనలు చేశారు. మొదట్లో హిప్నాసిస్ కూడా ఇందులో భాగంగా పరిగణించినా తరవాత అది వైద్యశాస్త్రంలోనూ, సైకాలజీలోనూ చేరిపోయింది. సంగతేమిటో అర్థమయేదాకా ఏ విషయాన్నైనా మిస్టరీగా భావిస్తారనడాని కిది ఉదాహరణ. ఇందుకు అనేకసమాజాలూ, సొసైటీలూ ఏర్పడ్డాయి. వీటిలో కొన్ని చనిపోయినవారి ఆత్మలతో సంపర్కం సాధించి, సంభాషణలు జరిపి, సంకేతాలనూ, సమాచారాన్నీ ఇచ్చిపుచ్చుకునే ప్రయత్నాలుకూడా చేస్తూ ఉండేవి.

షెర్లాక్ హోమ్స్ అనే ప్రసిద్ధ డిటెక్టివ్ పాత్రను సృష్టించిన ఆంగ్ల రచయిత సర్ ఆర్థర్ కోనన్ డాయిల్, ప్రముఖ శాస్త్రవేత్త సర్ ఆలివర్ లాడ్జ్ వంటి మేధావులు కూడా ఈ సమావేశాల్లో పాల్గొంటూ ఉండేవారు. తమ ఇంటో చనిపోయినవారి ఆత్మలు చప్పుళ్ల ద్వారా తమకు సందేశాలు పంపుతున్నాయనీ, తమ ప్రశ్నలకు అవును, కాదు అనే పద్ధతిలో లెక్క ప్రకారం తలుపు తట్టినట్టు వినబడే శబ్దంద్వారా జవాబులిచ్చారనీ కొందరు ప్రకటించారు. బల్లమీద పెట్టిన ఒక నాణెంమీద ఇద్దరు ముగ్గురు వేళ్లుపెట్టి 'ప్రశ్న' వేస్తే అది ఏదో ఒక సమాధానం 'దిశ'గా తనంతట తానే కదులుతుందనే పిచ్చి నమ్మకం స్కూలు పిల్లల్లో ఉండేది.

ఇలాంటి స్థాయిలో కాకుండా సీరియస్‌గా అతీంద్రియ సంఘటనలకు నిజంగా గురిఅయినట్టు చాలామంది చెపుతూ ఉండడంతో ఈ సంఘటనల వాస్తవాలను పరిశోధించడానికి అమెరికాలో కూడా శాస్త్రీయ పరిశోధనలు జరిగాయి. మూసిన పేకముక్కలను చూడకుండా గుర్తించేవారిని పరీక్షకు పెట్టి, స్టాటిస్టికల్‌గా ఫలితాలను విశ్లేషించారు. అలాగే పాచికలను విసిరినప్పుడు సరిగ్గా అంచనా వెయ్యగలమని చెప్పేవారిని కూడా పరిశీలించారు. ఫలితాల గురించి 60 శాతం పైగా సరిగ్గా చెప్ప గలగడం విపరీతమైనదిగా భావించారు. అంతకు తక్కువైతే అది ఒక్కొక్కప్పుడు సరిగ్గానూ, మరొకప్పుడు తప్పుగానూ నమోదయే మామూలు అంచనాకింద పరిగణించబడింది. ప్రకృతికి అతీతమైనశక్తులనేవి అసలు ఉన్నాయా అనే ఆసక్తి శాస్త్రవేత్తలకు పెరగడంతో కొన్ని యూనివర్సిటీల్లో పేరాసైకాలజీ కోర్సులు మొదలయాయి. 1970 తరవాత వీటిమీద ఆసక్తి తగ్గుతూ పోయింది. అందుకు ముఖ్యకారణం ఇలాంటి సంఘటనలు తగినన్నిసార్లు రిపీట్ కాలేదు. మూఢవిశ్వాసంతో కాకుండా నిజంగా వివరణకతీతమైన సంఘటనలు జరుగుతున్నాయా అని పరిశీలించిన శాస్త్రవేత్తలకు నమ్మదగిన సాక్ష్యాలు లభించకపోవడంతో వారి ఆసక్తి సన్నగిల్లింది. యూనివర్సిటీల్లో ఈ విభాగాలు మూతపడ్డాయి. పేరాసైకాలజీకి శాస్త్రస్థాయి లభించనేలేదు.

ఇప్పటికీ మనుషులకు రెండుమూడు'రకాల' శరీరాలు ఉన్నాయని కొందరు నమ్ముతారు. ఈ స్పెషల్ గుణం మిగతా ప్రాణులకు వర్తిస్తుందో లేదో వీళ్లు చెప్పరు. పోనీ ఇది నమ్ముదామా అంటే శరీర నిర్మాణాన్ని బట్టి మనుషులకూ ఇతర క్షీరదాలూ, జంతువులకూ ఉండే పోలికలు నిరాకరించరానివిగా అనిపిస్తాయి. అమీబానుంచి ప్రతి సూక్ష్మజీవికీ ఆత్మలను ఆపాదిస్తూ పోతే వీటన్నిటికీ పధ్నాలుగు లోకాలుకూడా చాలవేమో. సోవియట్ రష్యాలో ఒకప్పుడు శరీరం వెలపల ఉండే కాంతిపుంజాన్ని ఫోటోగ్రాఫ్ చేసే ప్రయత్నాలు జరిగాయి. ఇవికూడా నమ్మదగినవికావని నేటి శాస్త్రవేత్తలు అంటున్నారు.

*(రచయిత అణుధార్మిక శాస్త్రవేత్త)* వీ

## దేశ జనాభా

భారత దేశ జనాభా 2011 లెక్కల ప్రకారం 121,01,92,422 ఉంది. ప్రపంచ జనాభాలో మన దేశ జనాభా 17.5 శాతం. ప్రపంచ జనాభాలో 19.4 శాతాన్ని కలిగిఉన్న చైనా అగ్ర స్థానంలో ఉండగా భారత్ రెండవ స్థానంలో ఉంది. మొత్తం జనాభాలో పురుషులు 62,37,24,248 కోట్లు ఉండగా స్త్రీలు 58,64,69,174 కోట్లుగా ఉంది. భారత దేశ జనాభాను మొదటి సారి 1872లో లెక్కించారు. 2011లో జరిగిన జనగణన 15వది. గత పదేళ్ల కాలంలో 18.1 కోట్ల జనాభా పెరిగింది. గత 9 దశాబ్దాల జనాభా పెరుగుదల రేటుతో పోలిస్తే ఈసారి తగ్గింది. 2001లో జనాభా పెరుగుదల రేటు 21.5 శాతం కాగా, ఈ సారి అది 17.64 శాతమే. రిజిస్ట్రార్ జనరల్ ఆఫ్ ఇండియా, భారత జనాభా లెక్కల కమిషనర్ సి. చంద్రమౌళి మార్చి 31న ఈ వివరాలను వెల్లడించారు.

## గూర్ఖాలాండ్ కోసం తీర్మానం

గూర్ఖాలాండ్‌ను ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చేయాలని కేంద్రాన్ని కోరుతూ సిక్కిం శాసనసభ మార్చ్ 29న తీర్మానించింది. పశ్చిమబెంగాల్ నుంచి డార్జిలింగ్ ప్రాంతాన్ని ప్రత్యేక రాష్ట్రంగా ప్రకటించాలని గూర్ఖా జనముక్తి మోర్చా(జిజెఎం) ఆందోళన చేస్తోంది. ఈ డిమాండ్ కారణంగా పశ్చిమబెంగాల్ పక్కనున్న సిక్కిం కూడా ఆర్థిక ఒడుదొడుకులకు గురవుతుంది. ఈ కారణంగానే గూర్ఖాలాండ్ ఏర్పాటుకు తీర్మానం చేయాల్సి వచ్చిందని సిక్కిం ముఖ్యమంత్రి పవన్‌కుమార్ చామ్లింగ్ ప్రకటించారు.

## నెత్తురు చిందిస్తున్న రైతుకూలీలు

మహారాష్ట్రలోని జైతాపూర్‌లో 9900 మెగావాట్ల అణువిద్యుత్ ప్లాంట్‌ను న్యూక్లియర్ పవర్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా నిర్మాణానికి ప్రతిపాదించింది. ఈ ప్లాంట్ ప్రపంచంలోనే అతిపెద్దది. స్థానిక ప్రజలు 2007 నుండి పవర్ ప్లాంట్‌ను వ్యతిరేకిస్తూ ఆందోళన చేస్తున్నారు. అణువిద్యుత్ ప్లాంట్‌ను వ్యతిరేకిస్తున్న ఉద్యమకారులపై ఏప్రిల్ 18న పోలీసులు జరిపిన కాల్పుల్లో అబ్దుల్ సయనేకర్ అనే వ్యక్తి మరణించాడు. ప్లాంట్‌కోసం 2335 మంది రైతుల నుంచి 2400 ఎకరాల భూములను బలవంతంగా సేకరించారు.

## ప్రపంచ కప్‌ను గెల్చుకున్న భారత్

ఏప్రిల్ 2, 2011న ముంబాయిలోని వాంఖెడే స్టేడియంలో అంతర్జాతీయ క్రికెట్ పదవ ప్రపంచ కప్ ఫైనల్ మ్యాచ్ జరిగింది. కెప్టెన్ ధోని నాయకత్వంలోని భారత జట్టు ప్రపంచ కప్‌ను గెలుచుకుంది. శ్రీలంక యాభై ఓవర్లలో 275 పరుగులు చేసింది. భారత జట్టు 48.2 ఓవర్లలో నాలుగు వికెట్లు కోల్పోయి 277 పరుగులు చేసి విజయం సాధించింది. భారత జట్టు ప్రపంచకప్ సాధించడం ఇది రెండవ సారి.

## ఎవరీ కోయ కమెండోలు?

మావోయిస్టులపై పోరాడేందుకు సామాన్య ప్రజలకు ఆయుధాలు ఇవ్వడం కుదరదని సుప్రీంకోర్టు స్పష్టం చేసింది. కోయ కమెండోల పేరిట నక్సల్స్ వ్యతిరేక సాయుధ బృందాన్ని ఏర్పాటు చేయడంపై వివరణ ఇవ్వాలని ఏప్రిల్ 6న సుప్రీంకోర్టు ఛత్తీస్‌గఢ్ ప్రభుత్వాన్ని కోరింది. కోయ కమెండోలు ఎవరు? వారిని ఎలా నియమించారు? పోరాడాలంటూ వారికి ఆయుధాలు ఇవ్వడం చాలా ప్రమాదకరం అని జస్టిస్ బి. సుదర్శన్ రెడ్డి, జస్టిస్ ఎస్.ఎస్. నిజ్జార్‌లతో కూడిన ధర్మాసనం పేర్కొంది. ఎస్.పి.ఒ.లకు కేటాయిస్తున్న నిధుల్లో 80 శాతం కేంద్రం ఇస్తున్నట్లు తమకు సమాచారం ఉందని సుప్రీంకోర్టు ధర్మాసనం కేంద్ర ప్రభుత్వాన్ని ప్రశ్నించింది.

## బినాయక్ సేన్ విడుదల

పౌరహక్కుల నేత బినాయక్ సేన్‌కు సుప్రీం కోర్టు ఏప్రిల్ 15న బెయిల్ మంజూరు చేసింది. సేన్‌పై దేశద్రోహ నేరం మోపడానికి ఎటువంటి ఆధారాలు లేవని అభిప్రాయపడింది. నాలుగు నెలల అనంతరం బినాయక్ సేన్ ఏప్రిల్ 18న ఛత్తీస్‌గఢ్ కేంద్ర కారాగారం నుండి విడుదలయ్యారు. బ్రిటిష్ పాలన నాటి చట్టాలను అమలు చేసే విషయంలో భారతదేశం కచ్చితమైన వ్యత్యాసం చూపించాలని సుప్రీంకోర్టు స్పష్టం చేసింది. బెయిల్ మంజూరు చేస్తూ దేశద్రోహం సెక్షన్‌ను ప్రభుత్వాలు, పోలీసులు దుర్వినియోగం చేస్తున్నారని అగ్రహం వ్యక్తం చేసింది.

## ఆజాద్ ఎన్‌కౌంటర్‌పై సిబిఐ దర్యాప్తు

దేశంలో మావోయిస్టుల వల్ల అంతర్గత సమస్య నెలకొందనే కారణంతో పోలీసులు నకిలీ ఎన్‌కౌంటర్లు జరపడానికి వీల్లేదని సుప్రీంకోర్టు స్పష్టం చేసింది. మావోయిస్టు నేత ఆజాద్, జర్నలిస్ట్ హేమచంద్ర పాండేల ఎన్‌కౌంటర్‌పై సిబిఐ విచారణకు అప్పగిస్తున్నట్లు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చిన నోటిఫికేషన్ పరిశీలించిన సుప్రీంకోర్టు ఈ మేరకు ఉత్తర్వులు జారీచేసింది. దర్యాప్తును తామే పర్యవేక్షిస్తామని జస్టిస్ ఆఫ్తాబ్ ఆలం, ఆర్.ఎం లోథాలు ఎన్‌కౌంటర్ కేసును మూడు నెలల్లో పూర్తి చేయాలని సుప్రీం కోర్టు ధర్మాసనం సిబిఐ ని ఆదేశించింది. ఈ కేసులో ఆరు వారాలలోగా మధ్యంతర నివేదికను సమర్పించాలని పేర్కొంది.

## గుజరాత్ అల్లర్లలో మోడీ ప్రమేయం

గోద్రా ఘటన అనంతరం జరిగిన అల్లర్లలో గుజరాత్ ముఖ్యమంత్రి నరేంద్ర మోడి ప్రమేయం ఉందని ఆరోపిస్తూ ఐ.పి.ఎస్. అధికారి సంజీవ్ భట్ సుప్రీంకోర్టులో ప్రమాణ పత్రం (అఫిడవిట్) దాఖలు చేశారు. 27 ఫిబ్రవరి 2002న అల్లర్ల సమయంలో మోడీ పోలీసు ఉన్నతాధికారులతో సమావేశం జరిపారు. ఈ సమావేశంలో హిందువులు ఆగ్రహావేశాలు వ్యక్తం చేయడానికి అవకాశం కల్పించడం అనివార్యం అన్నారని భట్ అఫిడవిట్‌లో స్పష్టం చేశారు. ఏప్రిల్ 27న అది విచారణకు రానుందని తెలిపారు. గుజరాత్ అల్లర్లపై దర్యాప్తు జరుపుతున్న సిబిఐ మాజీ డైరెక్టర్ ఆర్.కె. రాఘవన్ అల్లర్లలో నరేంద్ర మోడీ, మరో 61 మంది ప్రమేయంపై జరిపిన దర్యాప్తు రిపోర్ట్‌ను ఏప్రిల్ 25న సుప్రీంకోర్టుకు అందించారు.

## సురేష్ కల్మాడీ అరెస్ట్

కామన్‌వెల్త్ క్రీడల నిర్వాహక కమిటీ మాజీ అధ్యక్షుడు సురేష్ కల్మాడీని ఏప్రిల్ 25న సిబిఐ అరెస్ట్ చేసింది. కామన్‌వెల్త్ క్రీడల్లో అక్రమాలకు పాల్పడినట్లు ప్రాథమికంగా నిర్ధారించింది. ఆయన 141 కోట్ల రూపాయల కాంట్రాక్టులను స్విట్జర్లాండ్ సంస్థకు అక్రమంగా కేటాయించారని తేల్చారు. కాంగ్రెస్ పార్టీ కల్మాడీ ప్రాథమిక సభ్యత్వాన్ని రద్దు చేసింది. వీ

## సిరియాలో ప్రజాందోళనలు

సిరియా రాజధాని బీరుట్‌లో ప్రజాందోళనలు తీవ్రమయ్యాయి. గత నాలుగు దశాబ్దాలుగా నిరంకుశ పాలన చేస్తున్న అధ్యక్షుడు బషర్ అస్సాద్‌కు వ్యతిరేకంగా ప్రజలు తీవ్ర నిరసన వ్యక్తం చేస్తున్నారు. గత మూడు వారాలుగా ప్రజలు సిరియా ప్రధాన నగరాలలో ప్రదర్శనలు చేపట్టారు. ఈ సందర్భంగా జరిగిన కాల్పుల్లో 32 మంది మరణించారు. కాగా అణచివేతను ఇంకా తీవ్రతరం చేస్తామని అస్సాద్ ప్రభుత్వం ప్రకటించింది. ఆర్థిక సంస్కరణలు చేపట్టి ప్రజల జీవన స్థితిగతులు మెరుగుపరుస్తామని అస్సాద్ హామీ ఇచ్చారు.

## ఈజిప్ట్‌లో మళ్లీ నిరసన జ్వాలలు

ఈజిప్ట్ రాజధాని కైరోలోని తహ్రీర్ స్క్వేర్‌లో మళ్లీ ఆందోళనలు మొదలయ్యాయి. మాజీ అధ్యక్షుడు హోస్నీ ముబారక్ నేరాలపై విచారణ జరపాలనీ, సుప్రీం డిఫెన్స్ కౌన్సిల్ అధిపతి, రక్షణ మంత్రి హుసేన్ తాంతవి వెంటనే రాజీనామా చేయాలని నిరసనకారులు డిమాండ్ చేశారు. ఈ సందర్భంగా ఏప్రిల్ 9న జరిగిన ప్రదర్శనలో పాల్గొంటున్న ప్రజలకూ సైనికులకూ మధ్య జరిగిన ఘర్షణలో ఇద్దరు మరణించారు. కొంతమంది గాయపడ్డారు. ఈ ఘర్షణలతో సైనికులకూ ప్రజలకూ మధ్య వైరం పెరుగుతోంది.

## జపాన్‌లో మళ్లీ భూకంపం

మార్చ్ 11న వచ్చిన భూకంపం, సునామీలను మరిచిపోక ముందే మళ్లీ జపాన్‌లో భూమి కంపించింది. ఏప్రిల్ 7న భూకంపం సంభవించింది. ఇది రిక్టర్ స్కేల్‌పై 7.4గా నమోదయింది. ప్రాణ నష్టం సంభవించలేదు. అంతకు ముందు వచ్చిన సునామీ వల్ల నష్టపోయిన ప్రజలకు యుద్ధ ప్రాతిపదికన దెబ్బై వేల తాత్కాలిక ఇళ్లను నిర్మిస్తామని జపాన్ ప్రధానమంత్రి నాటో కాన్ ప్రకటించారు. ఆయన సునామీ వల్ల దెబ్బతిన్న మియాగీ రాష్ట్రంలో పర్యటించారు. బాధిత ప్రజలకు అన్ని రకాల సహాయ సహకారాలు అందిస్తామని హామీ ఇచ్చారు. సునామీ వల్ల దెబ్బతిన్న అణు రియాక్టర్ల నుంచి వెలువడుతున్న రేడియేషన్ వల్ల రియాక్టర్ పరిసర ప్రాంత ప్రజలు తీవ్ర ఇబ్బందులకు గురవుతున్నారు.

## లిబియాలో తీవ్రమవుతున్న పోరు

లిబియాలో గడాఫీ సేనలకూ, తిరుగుబాటుదారులకూ తీవ్ర పోరు నడుస్తోంది. కీలక పట్టణాలపై పట్టు కోసం గడాఫీ సేనలు పెద్ద ఎత్తున దాడులు నిర్వహిస్తున్నాయి. తిరుగుబాటుదారులకు ముఖ్య కేంద్రంగా కొనసాగుతూ, వారి స్వాధీనంలోని బెంఘాజీ నగర ప్రవేశానికి ముఖద్వారంగా నిలిచే అజ్డాబియా పట్టణంపై పట్టుకోసం గడాఫీ సేనలు ముమ్మరంగా దాడులు చేస్తున్నాయి. ఇరు వర్గాల మధ్య పోరాటం కొనసాగుతుండడంతో ప్రజా జీవనం అస్తవ్యస్తమైపోయింది. ఆహార పదార్థాలు, తాగు నీరు దొరక్క ప్రజలు తీవ్ర ఇబ్బందులకు గురవుతున్నారు.

## ఐవరీకోస్ట్‌లో ఘర్షణలు

ఐవరీకోస్ట్ అధ్యక్ష పీఠం కోసం జరుగుతున్న పోరులో వేలాది మంది ప్రాణాలు కోల్పోతున్నారు. అధ్యక్ష పీఠం కోసం అలస్సానె ఒటారా, లారెంట్ జిబాగ్‌బో మధ్య పోరు సాగుతోంది. 2010 అధ్యక్ష ఎన్నికలలో ఒటారా గెలిచినట్లు ఎన్నికల కమిషన్ చేసిన ప్రకటనను ఐవరియన్ పాపులర్ ఫ్రంట్ వ్యవస్థాపకుడు, అధ్యక్ష పదవిలో కొనసాగుతున్న జిబాగ్‌బో అంగీకరించకపోవడంతో ఈ వివాదం చెలరేగింది. మార్చ్ చివరి వారంలో జరిగిన ఊచకోతలో డ్యుకోయూ పట్టణంలో వెయ్యి మంది దాకా మరణించినట్లు వార్తలు వెలువడ్డాయి. ఏప్రిల్ 11న జిబాగ్‌బోను తిరుగుబాటుదారులు అరెస్ట్ చేశారు: బంకర్‌లో దాక్కొని ఉండగా ఆయనను పట్టుకున్నారు.

## బహ్రెయిన్‌లో దాడులు

బహ్రెయిన్ రాజధాని మనామాలో ఉన్న పెర్ల్ స్క్వేర్‌లో రాజు హమద్ బిన్ ఇసా అల్ ఖాలీఫాకు వ్యతిరేకంగా నిరసన తెలుపుతున్న ప్రజలపై సైనిక బలగాలు దాడులు చేశాయి. ఈ దాడుల్లో ఆరుగురు మృతి చెందారు. హెలికాప్టర్లు, యుద్ధ వాహనాలతో చుట్టుముట్టి బలగాలు నిరసన శిబిరాలకు నిప్పుపెట్టి, నిరసనకారులను వీథుల్లోకి తరిమారు. దాడుల అనంతరం ప్రభుత్వం పెర్ల్ స్క్వేర్ వద్ద కర్ఫ్యూ విధించింది. దేశంలో ర్యాలీలు, నిరసనలు, బైఠాయింపులపై నిషేధం విధించింది.

## సైనిక పాలన రద్దు

బర్మాలో అర్థ శతాబ్దంగా సాగుతున్న సైనిక పాలన రద్దయి ప్రజా ప్రభుత్వ పాలన ఏర్పడింది. శాంతి భద్రతలు, అభివృద్ధి సమితీ (ఎస్.పి.డి.సి.)ని అధికారికంగా రద్దు చేస్తున్నట్లు నియంత థాన్ ష్వే ప్రకటించారు. దేశ కొత్త అధ్యక్షుడిగా తెయిన్ సెయిన్ ప్రమాణ స్వీకారం చేశారు. ఉపాధ్యక్షుడిగా యుతిన్ ఆంగ్ ఊ, సాయి మౌక్ ఖామ్, మరో 55 మంది మంత్రులు కూడా ప్రమాణ స్వీకారం చేశారు. అయితే ష్వే తప్పుకున్నా, తెర వెనుక ఉండి అధికారంపై అజమాయిషీ చెలాయిస్తాడని విశ్లేషకులు చెబుతున్నారు.

## యెమన్‌లో సర్కార్ పతనం

యెమన్‌లో అధ్యక్షుడు అలీ అబ్దుల్లా సలేహ్ గద్దె దిగాలని ప్రజలు పెద్ద ఎత్తున నిరసన కార్యక్రమాలు చేపట్టారు. ఏప్రిల్ 4న తయాజ్ నగరంలో ఫ్రీడమ్ స్క్వేర్ చేరుకునేందుకు వేలాదిమంది ఆందోళనకారులు ర్యాలీగా తరలివచ్చారు. గవర్నర్ ప్రధాన కార్యాలయం దాటిన తర్వాత ఆందోళకారులను భద్రతా దళాలు అడ్డగించాయి. లాఠీచార్జ్ జరిపి భాష్పవాయువు గోళాలు ప్రయోగించాయి. అయినా, ఆందోళనకారులు ముందుకు దూసుకెళ్లడంతో భద్రతా దళాలు కాల్పులు జరిపాయి. ఈ కాల్పుల్లో పదిహేడు మంది అక్కడికక్కడ మరణించారు. వందలాది మంది గాయపడ్డారు. రోజురోజుకూ నిరసనలు ఎక్కువ కావడంతో దేశాధ్యక్షుడు సలేహ్ దేశం విడిచి పారిపోయేందుకు ప్రయత్నిస్తున్నాడని వార్తలు వస్తున్నాయి. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి, వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగానూ, జాగ్రత్తగానూ వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(21 మార్చ్ 2011 నుండి 20 ఏప్రిల్ 2011 వరకు 18 జిల్లాలలో అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 1970)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | - | 4 | - | 25 | 28 | 3 | 4 | 2 | 3 | 2 | - | - | 2 | 2 | 28 | 35 | - | - | - | 3 | 4 |
| హైదరాబాద్ | - | - | - | 5 | 12 | - | - | - | 1 | 5 | 4 | 12 | - | 1 | 37 | 28 | - | - | - | 3 | - |
| కరీంనగర్ | 1 | 4 | 3 | 29 | 31 | 7 | 16 | - | 1 | 7 | 1 | 1 | 5 | 6 | 21 | 24 | - | - | - | 4 | 4 |
| ఖమ్మం | - | - | - | 7 | 8 | 3 | 1 | 1 | 1 | 4 | 5 | 15 | 3 | 5 | 31 | 23 | - | - | - | - | 3 |
| మెదక్ | - | 6 | - | 6 | 15 | 1 | 9 | 3 | 3 | 5 | 4 | 5 | - | 6 | 34 | 34 | - | - | - | - | - |
| మహబూబ్‌నగర్ | 1 | 1 | - | 14 | 19 | 4 | 7 | - | 3 | 11 | 11 | 7 | 11 | 9 | 20 | 18 | - | - | - | 6 | 2 |
| నల్గొండ | - | 2 | - | 24 | 23 | 2 | 3 | 1 | 3 | 1 | 5 | 6 | 1 | 9 | 57 | 32 | - | - | - | 4 | 2 |
| నిజామాబాద్ | - | - | - | 10 | 12 | 1 | - | 2 | 1 | 1 | 5 | 5 | 6 | 7 | 25 | 27 | - | - | - | - | - |
| రంగారెడ్డి | - | 11 | - | 24 | 19 | 8 | 6 | 2 | 1 | 7 | 7 | 6 | 11 | 7 | 44 | 18 | - | - | - | 6 | - |
| వరంగల్ | - | 5 | 0 | 9 | 8 | 12 | 9 | 7 | 2 | 2 | - | - | 2 | 16 | 20 | 5 | - | - | - | - | 3 |
| అనంతపూర్ | 1 | 7 | 1 | 15 | 13 | 9 | 10 | - | - | - | 5 | 6 | 9 | 7 | 35 | 5 | - | - | - | 1 | 2 |
| చిత్తూరు | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | |
| కర్నూలు | - | 2 | - | 7 | 9 | 3 | 10 | 4 | 4 | 5 | 1 | 2 | 3 | 2 | 30 | 25 | - | - | - | 2 | - |
| గుంటూరు | - | - | - | 4 | 5 | 1 | 3 | - | - | 2 | 2 | 5 | 2 | - | 32 | 12 | - | - | - | 1 | 1 |
| నెల్లూరు | - | - | - | 1 | 9 | - | - | - | - | 1 | 1 | 1 | 1 | 3 | 26 | 15 | - | - | - | - | 1 |
| కడప | - | 2 | - | 4 | 2 | 4 | 3 | 2 | 3 | 5 | 2 | 3 | 2 | 3 | 18 | 6 | - | - | - | - | - |
| ప్రకాశం | - | 5 | 2 | 5 | 3 | 8 | 7 | - | 5 | 4 | - | - | - | 6 | 32 | - | - | - | - | - | - |
| శ్రీకాకుళం | 1 | - | - | 3 | 3 | 4 | 3 | 6 | 2 | - | 4 | 1 | 3 | 1 | 11 | 3 | - | - | - | - | - |
| విజయనగరం | - | 2 | - | 5 | 3 | 2 | - | 1 | 1 | 3 | 4 | - | 2 | 1 | 17 | 9 | 1 | 1 | 1 | 1 | 4 |
| తూర్పు గోదావరి | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | |
| మొత్తం | 4 | 51 | 6 | 197 | 222 | 72 | 101 | 31 | 34 | 65 | 61 | 75 | 63 | 91 | 518 | 319 | 1 | 1 | 1 | 31 | 26 |

అందిస్తున్నవారు : ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎల్. సంతోష్; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఎక్బాల్; నల్గొండ – గొడిశాల వెంకటేశ్వర్లు; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – ఎస్. శంకరయ్య; వరంగల్ – ఎ.కుమార్; అనంతపూర్ – కె. నాగేశ్వరచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – దస్తగిరి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – మహమ్మద్ ఇబ్రహీమ్ సాహెబ్; గుంటూరు – బి. అంజమ్మ ; నెల్లూరు – బాలగురువయ్య; శ్రీకాకుళం – జి. సుధీర్; ప్రకాశం – ఎల్. సాంబశివరావు, విజయనగరం – డి. సుధాకర్



## అభివృద్ధిని ఇలా చూద్దాం

వ్యాసాలు, సమీక్షలు

**ముదునూరి భారతి**

**పేజీలు 206**

**వెల రు. 80**

## కొత్తచూపు

'అభివృద్ధి వెలుగునీడలు', ఇతర వ్యాసాలు

**ఆర్. ఎస్. రావు**

**పేజీలు 296**

**వెల రు. 100**



ప్రతులకు, వివరాలకు :

**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
ఇమెయిల్ : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com




## ప్రతి అక్షరం ప్రజాద్రోహం

జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ నివేదిక

పొరపాట్లు - అబద్ధాలు - వక్రీకరణలు

**ఎన్. వేణుగోపాల్**

**పేజీలు 72 వెల రు. 20**

ప్రచురణ : తెలంగాణ ఆత్మగౌరవ వేదిక

ప్రతులకు : **దిశ పుస్తక కేంద్రం,** చిక్కడపల్లి, హైదరాబాద్. ఫోన్ : 040-27640574

**VEEKSHANAM** Telugu Monthly Journal of Political Economy and Society - 118 - May 2011
• RNI Regn.No.APTEL/2003/11482 • Published on 29/04/2011 • Postal Regn. No. L II/RNP/HD/1100/2011-13





Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao

BC



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA105M105 |
| పుస్తకం పేరు | వీక్షణం |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | ఉంది |
| వెనుక అట్ట | ఉంది |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Saranya |
| పేజీలు విడదీసినది | SARANYA |
| స్కాన్ చేసినది | Priyanka |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |